శ్రీ రస్తు.

రుక్మాంగదచరిత్రమను

# ఏకాదశీమాహాత్మ్యము

ప్రౌఢకవి మల్లనార్యప్రణీతము.



చెన్నపురి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924

శ్రీరస్తు.

# రుక్మాంగదచరిత్రము.

---

## పీఠిక.

ఉ. శ్రీమయపత్రముల్ జ[1]డయుఁ జెల్వగు నభ్రతరంగిణీకణ
స్తోమముపువ్వుముల్ ఫలముసోముఁడునై పొలు[2]పొందిపార్వ
తీ, కోమలదేహవల్లిఁ బెనఁగొన్న సమంచిత దక్షవాటికా
భీమయదేవకల్పక మభీష్టఫలంబులు మాకు నీవుతన్. 1

చ. కలశపయోధికన్య మృదుగండమరీచుల నీడఁజూచుచున్
దిలకము కమ్మకస్తురిఁ బ్రదీప్తముగాఁ గొనగోట దిద్దును
త్పలదళమేచకద్యుతికదంబశరీరుఁడుమాధవుండుని,చ్చలుఁ
గరుణాకటాక్షముల సన్మతితో మముఁ[3]జూచుఁ గావుతన్.

చ. శ్రుతులు పురాణముల్ మునులుసోమదినేశులు సర్వదేవతా
తతులును జేరి కొల్వఁ బ్రమదంబున భారతి[4]తోడఁ గూడి సం
తతమును లోకసృష్టి విదితంబుగ సంభవమొందఁ జేయు[5]వా
క్పతి పరమేష్ఠి మాకుఁ గలకాలమభీష్టము లిచ్చుఁగావుతన్.

---

1 డలు. 2 పొందు; పొందఁ. 3 బ్రోచుఁ. 4 దేవితోడ.
వాకృతి.

ఉ. ఆదిమశక్తి శంకరుని యర్ధశరీరమున న్వసించుచు
న్నైదుః మంచుగుబ్బలికి నాత్మజ షణ్ముఖుఁ గన్నతల్లి బ్ర
హ్మాదిసమస్తదైవతసమర్చితపాదసరోజయుగ్మ యు
త్ర్యాదరలీలశాంకరిదయాగరిమన్ మముఁ బ్రోచుఁగావుతన్.

చ. తలిరులుకూర్మముల్మణులుతారలుబంతులుమత్తెపండ్లుకా
హళులనఁటుల్సుమంజరిగుహాహిబయుల్ తెఱలద్రులంబు
జం, బలరులిగుర్లతల్వసువులద్దములిందుఁడు శ్రీలుముత్యము
ల్, తొలకరివిగాలువిండ్లు నెలతుమ్మెదలిర్లలిసిందిరాంగముల్.

సీ. తమము [1]క్రొన్నెలవిండ్లు తమ్ములు శ్రీ లద్ద
ములు చంపకము ముత్యములు పవడము
శశికంబుకము సంకుజక్కవల్ వసుగుహల్
బిసము లబ్జంబులు పెసరుగాయ
లలరులు ఫణి వీచు లభ్రంబు సుడి రావి
యాకు సైకత మంటు లతను దొనలు
మత్తెపండ్లు ప్రసూనమంజరుల్ కూర్మముల్
మణులు తారలిగుళ్లు మునివలక

తే. యునఁగఁ దగుముప్పదియు నాల్గు నంగకముల
గంధగజయాన కలకంఠి కనకవర్ణ
పుష్పగంధి లతాంగి కర్పూరవాస
నీరనిధికన్య మాయింట నిలుచుఁగాత. 6

క. వాణిన్ బురాణిఁ బుస్తక
పాణిన్ శుకవాణిఁ గమలభవురాణి గుణ

---

1 లు సెల.

శ్రేణి నలివేణి నుతగీ
ర్వాణిన్ గల్యాణిఁ గొల్తు వాక్చాతురికిన్. 7

మ. ధననాథప్రియకంఠకాళిమము మోదం బొప్ప నీక్షించి చ
య్యన జంబూఫలమంచు డాసి నిజహస్తాగ్రంబు వే సాఁచి యే
పునఁ బల్మాఱును బట్టి రాఁదిగుచు మ వేల్పుం బ్రోడ విఘ్నేశ్వరుం
డనుమోదంబునఁ జేయు మత్కృతికి నత్యంతంబు నిర్విఘ్న
[మున్.

క. మదిఁ దలఁతు విభీషణు నా
రదు వ్యాసు వసిష్ఠు నరుఁ బరాశరు రుక్మాం
గదుఁ బుండరీకు భీష్ము శు
కు దాల్భ్యుఁ బ్రహ్లాదు శౌనకు న్నాభాగున్. 9

చ. హరి శిఖి దంతి దైత్య వరుణానిలయక్షశివుల్ గజాజకా
సరనర నక్ర కైణ హయ [1]శాక్వరమేషకులు వజ్రశక్తిము
ద్గరశరపాశకుంతసృణికార్ముకహస్తులు భోగశుద్ధిసం
గరజయశౌర్యసత్వజయకామ్యవిభూతులు మాకు నీవుతన్.

క. మనమున సేవింపుదు మ
జ్జనకుని శ్రీవత్సగోత్రసాగరచంద్రున్
ఘనుఁ బోతయ మంత్రీశ్వరు
ననయంబును భక్తి నక్కమాంబాప్రియునిన్. 11

సీ. ఫాలపట్టికఁ బాశుపతమహామంత్ర భ
స్మత్రిపుండ్రము కాంతిమహిమ మీఱఁ
గటిమండలమున నీర్కావి [2]ధోవతి మీఁద
వెలిపట్టు పచ్చడం బలవుగులఁ

---

1 శాద్వలయానులు. 2 దోవతి.

గంఠపీఠిక మౌక్తికముల[1]లో రుద్రాక్ష
మాలికావిస్ఫూర్తి శ్రీలఁ దనర
దర్భాంకురాలంకృతం బైన పాణిప
[2]ద్మమునందు నక్షసూత్రము దలిర్పఁ

తే. ప్రణవపంచాక్షరీమంత్ర[3]ప్రణుతి నిగుడ
నాదిశంభుస్వరూప మై యధికమహిమ
[4]నున్నతికి నెక్కు శివదేవయోగి[5]పుత్త్రు
శక్తినాథుని మద్గురుస్వామిఁ దలఁతు. 12

సీ. వల్మీకభవుపాదవనజంబులకు మ్రొక్కి
సత్యవతీసూను సంస్మరించి
భవభూతివాక్యవైభవము వర్ణనఁ జేసి
భట్టభాణుని మనఃపదవి నిలిపి
కాళిదాసువచోవికాసంబు భూషించి
శ్రీహర్షు నాత్మలోఁ జిత్తగించి
ప్రవరసేనుకవిత్వపాటవంబు నుతించి
జయదేవసుకవి కంజలి యొనర్చి

తే. రాజశేఖరుఁ గొనియాడి భోజుఁ బొగడి
చోరుఁ బ్రణుతించి మదిలో మయూరుఁ దలఁచి
భర్తృహరిఁ గొల్చి సౌమిల్లిఁ బ్రస్తుతించి
మల్హణునిఁ బూజచేసి నమస్కరించి. 13

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవి నాచనసోముని భీమనార్యుఁ జే
రెన్నికఁ జిమ్మపూడియమరేశ్వరుభాస్కరుశంభుదాసునిన్

---

1 తో. 2 ద్మంబున. 3 ఫణితి. 4 నున్నతికి నెక్క. 5 పౌత్త్రు.

సన్నుతిఁ జేసి వాక్యసరసత్వము వీనుల కింపుమీఱ న
త్యున్నతిగా నొనర్తుఁ గవిరోధులు మేలనఁగావ్యమిమ్ములన్.

ఉ. శ్రీహరివాసరవ్రతవిశేషము దాఁ గృతిసంచితార్థ మా
శ్రీహరిమిత్రుఁ డీకృతికిఁ [1]జెన్నలరార నధీశుఁ డుత్తముల్
శ్రీహరిభక్తు లీకృతికిఁ జిత్తమునన్ విని మెచ్చువారు నా
కీహిత మింతకంటెఁ గలదే రచియించెద మేలు గాంచెదన్.

సీ. అత్యంతపావనత్వాపాదనంబున
సురలోకవాహినిస్ఫురణఁ బేర్చి
పాపాంధకారనిర్వాపణప్రఖ్యాతిఁ
దరుణార్కబింబంబుకరణి మించి
తాపత్రయాదిదుర్దర్పమర్దనమున
దివ్యౌషధప్రౌఢిఁ దేజరిల్లి
కామితార్థఫలప్రకరదానమ్మైఖరిఁ
గల్పభూజవిభూతి గణనకెక్కి
తే. దనరు రుక్మాంగ[2]దుని చరిత్రము శుభాఢ్య
మై మహాభాగవతసేవ్య మై ముకుంద
సద్గుణానీకమణిగణజలనిధాన
మై సమంచితపుణ్యనివాస మగుచు. 16

శా. ధారాళాఘపరంపరాతిమిరవిధ్వంసక్రియాదీప మై
నీరేజాక్షకథాబ్ధిసంజనిత మై నిస్త్రాసతాహేతు వై
ధీరోదారగుణప్రసాదకలనాదేదీప్యమానాంగ మై [ల్.
శ్రీరుక్మాంగదదివ్యరత్న మొసఁగున్ శ్రీసౌఖ్యకల్యాణము

---

1 జెన్న సలార. 2 ద చరిత్రమును శుభాఢ్య.

క. వన జల [1]కేళీ శశి రవి
తనయోదయ పాన యాన దూత్యబ్ధి వివా
హ నృప రతి విరహ ఋతు మం
త్ర నగా హవ నగర వర్ణనలు దగుఁ గృతులన్. 18

చ. ఎఱుఁగరు ఛందముల్ చదువరేమియు శాస్త్రము లబ్దవిద్యలోఁ
బఱువరలంకృతుల్ రసము భావము బ్రక్రియలయ్యవృత్తియు
న్నెఱయఁగఁ జూడరల్పులవనిన్ గవితల్ సమకూర్పఁ జూతురే
కొఱయవి సత్కవీశ్వరులకున్ మది కింపొదవింపఁ జేయునే.

క. నగుబాటు కోర్చి కవితా
ప్రగల్భుఁడ నటంచుఁ గుకవి ప్రజ్ఞలఁ బోవున్
దగునా బాణోచ్ఛిష్టం
జగత్త్రయం బనెడి సిగ్గు చాఁదె తమకున్. 20

ఉ. చెప్పఁగ లేరు గాని మది సిగ్గొకయింతయు లేక దుష్కవుల్
తప్పు లటంచు సత్కవిత దాతల కప్రియ మొందునట్లుగా
నప్పటికప్పటిన్ విడఁగనాడుదు రాడిన నేమి యీ ప్రభుల్
తప్పులు గామియున్ గృతివిలాసములన్ విని మెచ్చుకుందురే.

క. వడిఁ బెట్టుకొనక తేనియ
విడిచి నెఱసు లేటి పట్టువిధమునఁ గుజనుం
డడరిన కవితాసారం
[2]బెడరి వ్రణంబులు వహించు హృదయమునందున్. 22

క. నీ రు[3]డిగి పాలు గ్రొను
పారమరాళంబుకరణి సరసజ్ఞకవుల్

---

1 కేళిని. 2 బెడలిన మతి తా గ్రహించు. 3 విడి.

నేరములు వదలి కవితా
సారముఁ దగు మీరు మానసముల గ్రహింపన్. 23

శా. సౌరభ్యంబనుబంధచాతురితఁ గన్ శయ్యాచమత్కారశ్రీం
గారంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ బాంచాలరీతిం దగన్
వారస్త్రీయును బోలె నొప్పవలదా వర్ణింపఁ గావ్యంబిలన్.

క. నానుల్లును శృంగారము
నానావిధ వృత్తవర్ణనలు సంపూర్ణం
బై నిల్చినకృతి సత్కృతిఁ
గా నుతియింతురు గదా సుకవు[1]లెయ్యెడలన్. 25

క. జాజుల పొట్లము విప్పిన
యోజఁ గవిత్వంబు వెలయుచుండిన సభలన్
బూజింతురె యాకృతి బుధ
రాజులు రాజులును సుకవిరాజులు గరిమన్. 26

చ. వడియును బ్రాసమున్ గణము వర్ణన లర్థము శబ్ద మొప్పునే
కడమయు లేదు మత్కృతికిఁ గైకొనిచూడుఁడు సత్కవీంద్రులె
య్యెడ నదియొక్కపద్యముననిందులసత్త్వముపద్యలోచనల్
[2]కడివెఁడుకూటిలో మెదుకుఁ గైకొనిపాకమెఱుంగుకైవడిన్.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనసుకవీంద్రవర్ణ
నంబును గుకవినిరాకరణంబును గావించి యొక్క మహా
భాగవతసత్కథాబంధురంబును నల్పప్రయాసంబును నధిక
ఫలంబునుముకుందచరణారవిందభక్తికారణంబునగురుత్కాం

---

1 లెల్లెడలన్. 2 కడఁవెడు.

గదచరిత్రం బాంధ్రభాష గద్యపద్యంబుల నిర్మింతు నని
తలంచియున్న యవసరంబున. 28

సీ. పులితోలురెంటెంబు వెలిపట్టుగెంటెంబు
గటిమండలంబున గరిమఁ బసర
భసితాంగరాగంబు బహుగంధయోగంబు
బాహుమధ్యంబునఁ బరిఢ[1]వింప
శీతాంశునవకాంతి చేమంతిపూబంతి
యుత్తమాంగంబున నొఱపుఁ జూప
గండపెండేరంబు కలితమంజీరంబు
పాదపద్మములందుఁ బ్రతిఘటింప
తే. నర్ధనారీశ్వరస్వామి యై తనర్చు
దక్షపురిభీమలింగంబు దయ పొసంగ
నర్థిఁగల నాకుఁ బ్రత్యక్ష మైనఁ జూచి
మోద మిగురొత్తఁ బాదాబ్జములకు మ్రొక్కి. 29

సీ. గంగానదీజూట కైరవాప్తకిరీట
శమనకవాట పశ్వల్లలాట
వ్యాఘ్రాసురాఖేట వనజాసనకరోట
విబుధపర్వతకూట వేదఘోట
మృత్యువక్త్రచపేట మిహిరపాదాశాట
జితకాలకూట యానత[2]పికాట
దూరీకృతాశాట త్రుటితకుంభినిశాట
వరభక్తసంఘాట వజ్ర[3]ఘోట

1 విల్ల. 2 విరాట. 3 ఖేం.

తే. వాఙ్నిరాఘాట దురితపావకకృపీట
ఘనభుజాస్ఫోట భూమిపంకజవరాట
తాపసస్తోత్రవాచాట దక్షవాట
భీమశివలింగ హాటకస్తోమపాట?                                80

సీ. సప్తగోదావరీజలనవీనవిహార
హారవిస్ఫురితమహాభుజంగ
జంగమస్థావరసకలాత్మసంచార
చారణామరసేవ్యచరణపద్మ
పద్మానిజేశ్వరప్రకటితాయతబాణ
బాణాద్రిదైత్యేశ్వరభావనిలయ
లయకాలతాండవోల్లాసకేళీకల్ప
కల్పకోటిసహస్రకాలహరణ
తే. రణసముత్సాహవిజయగోరాజగమన
మనసిజాయోపహరణ మప్రతాప
తాపసస్తోత్రధారణ ధ్యానదక్ష
దక్షపురిభీమలింగ కాంతాశుభాంగా.                                31

సీ. చంద్రకోటిప్రభాసౌందర్యవిలసిత
సిత మహారోగవర్జిత [1]వృషాంక
అంకాగ్రశైలకన్యారూపవిభ్రమ
భ్రమరమేచకకంఠభాగదేశ
దేశాక్షిరాగనందితమనోరాజీవ
జీవాత్మపరమాత్మభావసత్వ

---

1 శుభాంగ.

సత్వరజస్తమస్సౌభాగ్యగుణయుక్త
యుక్తతరమఘప్రయోగదమన
తే. మనసిజాయోపహారణాగ్నిజనకనేత్ర
నేత్రసందోహ కలనాథునీప్రఘోష
ఘోష భాషారతిశవిశేషబాణ
బాణవత్సల క్షమేశ పార్వతీశ. 32

చ. అనివినుతించునన్ను హృదయంబునసత్కృప[1] తేలువాఱఁగా
గనుఁగొనినీవుసెప్పకొడికంబుగఁబూనిన యీప్రబంధముఁ
దన కిపు డంకితంబు విదితంబుగఁ జేయు మటన్న నట్లకా
కని యలభీమనాథునకు [2]నప్పటియుం బ్రణమిల్లి వేడుకన్.

క. ఘనరుక్మాంగదచరితముఁ
దన కిమ్మని భీమశివుఁడు దా నర్థింపన్
గనుటయె ప్రౌఢకవీంద్రున
కనయము నణిమాదిశుభము లందుట తలఁపన్. 34

ఉ. శ్రీహరివాసరవ్రతవిశేషము వాఁ గృతి సంచితార్థ మా
శ్రీహరిమిత్రుఁ డీకృతికి జెన్నసలార నధీశుఁ డుత్తముల్
శ్రీహరిభక్తు లీకృతికిఁ జిత్తమునన్ విని మెచ్చువారు నా
కీహిత మింతకంటెఁ గలదే తలపోయఁగ నెన్నిభంగులన్.

క. బంగారమునకుఁ బరిమళ
[3]మంగీకము గాఁగఁ గల్గినట్లయ్యెను రు
క్మాంగదచరితకు క్షమయు
లింగం బధినాథుఁ డగుట లెక్కింపంగన్. 36

---

1 దై యి (వ) వాఱఁగా. 2 నర్పణతం. 3 మంగీకారమును గలిగినట్టుల యుల రు.

క. కావున నే రుక్మాంగద
భూవరుచరితంబు చెప్పఁ బూనితి మొదలన్
దేవుని దాక్షారాము
శ్రీవిభవవిశేషమహిమ చెప్పఁగ నలయున్. 37

సీ. కామ్యార్థఫలసముత్కరకల్పతరువాటి
దళితపాతకకోటి దక్షవాటి
ప్రణుతకల్యాణైకగుణమణివ్రజపేటి
[1]ధాత్రీకటీశాటి దక్షవాటి
సన్మునీంద్రారామసస్యమేఘస్ఫోటి
[2]దమితరోగనిశాటి దక్షవాటి
రథవిమానాతపత్రపతాకగజఘోటి
తాపాద్రిశతకోటి దక్షవాటి
తే. దర్పితాశాలతాకోటి దక్షవాటి
దనరునిగమావివృతిచేటి దక్షవాటి
ద్వారసేవితకర్ణాటి దక్షవాటి
రక్షితేందుకిరీటి శ్రీదక్షవాటి. 38

షష్ఠ్యంతములు.

క. ఏవంవిధపురపతికిని
భూవినుతవిశేషమతికిఁ [3]బుణ్యవ్రతికిన్
కైవల్యరతికి నిర్జిత
దేవాహితతతికి భక్తదృఢసంతతికిన్. 39

క. పురుహూతదత్తసుందర
తరుణీవిరచితనవీనతరగానకళా

1 ధాత్రీకాకటీశాటి. 2 దళిత. 3 బుణ్యావళికిన్.

సరసనవలాస్య[1]కీలిత
పరమానందునకు జూటభరితేందునకున్. 40

క. అమితమహోత్సవసమయ
ప్రమదాజనవాద్యమానపటుమురజధిమిం
ధిమిమేఘనాదనర్తిత
సమదమయూరునకు దుష్టజనదూరునకున్. 41

క. చతురాగమవేదాంత
ప్రతిపాదితవిభవునకు శుభప్రభువునకున్
క్షితిధరరాజతనూజా
కృతసల్లాపునకు మేరుగిరిచాపునకున్. 42

క. అంభోధిమథనసమయవి
జృంభితసురదైత్యగర్వజిత్వరగరళా
రంభప్రతికారునకును
జంభారికృతస్తుతిప్రసన్నహారునకున్. 43

క. [2]కంఠకళంకునకును ను
త్కంఠాసంఘటితచతుర[3]తరవీరవధూ
కంఠగ్రహాంకునకు నతి
కుంఠితదైత్యునకు భక్త[4]గుణనిత్యునకున్. 44

క. జాలంధరముఖదైత్యా
భీలప్రఖ్యాతమదవిభేదనరేఖా
శూలాయుధపటువిక్రమ
హేలాహస్తునకుఁ గుముదహితమస్తునకున్. 45

---

1 కేలీ. 2 కంఠేకళంకునకు. 3 గంభీర. 4 గణసేవ్య.

క. రవి గణప మాతృ కాంబుజ
భవ వాణీ గుహ శివా సువర్ణధ్వజ భై
రవ ముఖదిక్పతివినుత
స్తవసమ్మోదునకు విభవసంపాదునకున్. 46

క. వామాంకకలితగౌరీ
భామాకుచకుంభ[1] మృదులపంకవిలి ప్త
శ్రీమహితోరస్స్థలునకు
భీమయదేవునకు శాంతపృథు[2] భావునకున్. 47

వ. అత్యంతభయభక్తితాత్పర్యంబుల ననేకసాష్టాంగదండప్ర
ణామంబు[3] లాచరించి యమ్మహాదేవుని గృతినాయకుని గా
వించి నాయొనర్పంబూనిన రుక్మాంగదచరిత్రంబునకుం
గథాక్రమం బెట్టి దనిన. 48

కథా ప్రారంభము.

ఉ. పుణ్య[4]నివాస ముత్తమతపోధనదేశము నిత్యముక్తసా
ద్గుణ్య మగణ్యయజ్ఞపరి[5]తర్పితహోతృవిశేషమంత్రనా
ద్గుణ్యము సిద్ధసాధ్యమునితోమక మై విలసిల్లు నైమిశా
రణ్యము యోగిపుంగవశరణ్యము నానుతి[6] కెక్కు ధారుణిన్.

ఆ. అనఘ మై తనర్చు నా నైమిశారణ్య
పుణ్యదేశమున నగణ్యమహిమ
వర్ణనీయ మైన వైష్ణవయాగంబు
నందు వైభవంబు లతిశయిల్లు. 50

---

1 ఘుసృణ. 2 బాహు. 3 లు సమర్పించి. 4 విలాస. 5 తోషిత.
6 కెక్కె.

సీ. శాండిల్య మౌద్గల్య మాండవ్య కశ్యప
వ్యా సాత్రి కౌండిన్య వాలఖిల్య
హారిత పిప్పల రైభ్య వరతంతు గాలవ
బక దాల్భ్య గౌతను శుక వసిష్ఠ
కౌశిక చ్యవన మార్కండేయ నారద
జమదగ్ని భృగు పరాశర శమీక
కణ్వ జాబాలి సాంఖ్యాయన వాల్మీకి
కపిల భరద్వాజ కలశజన్మ
తే. శృంగి తృణబిందు భరత మతంగ శక్తి
గర్గ శ్రీవత్స మునివరుల్ ఘనత మెఱయ
వరసభాసీను లై వినువారలకును
విమలవాగ్భంగిఁ గర్ణామృతములు గాను. 51

సీ. వారాహ వాసిష్ఠ నారదీ యాదిత్య
సందోహ మతిభక్తిఁ గొందఱకును
వైష్ణవ శ్రీభాగవత భవిష్యోత్తర
కూర్మపద్మంబులు గొందఱకును
బ్రహ్మాండ మత్స్య మార్కండేయ వామన
స్కాందంబు లనురక్తిఁ గొందఱకును
గారుడ బ్రహ్మ లింగ బ్రహ్మవైవర్త
గురువాయుసంహితల్ గొందఱకును
తే. మఱియు నొకకొందఱకు సుధామధురవాక్య
సమితి భారతరామాయణములు దెలియ
వరుస వక్కాణ మొనరించువ్యాసశిష్యు
వాగ్విరాజితు నుగ్రశ్రవసునిఁ జూచి. 52

క. తరణి నొక టొకటి పావకు
సరసిజభవు రెండు నాల్గు జలశాయిని శం
కరుఁ బదియుఁ గాఁ బురాణము
లిరవుగ వర్ణించుఁ బదియు నెనిమిది వసుధన్. 53

క. అందును బ్రహ్మాండశ్రీ
సందర్భపురాణ మెన్నఁ జనుఁ దన్మధ్యం
బందును రుక్మాంగదకథ
యందంబై యొప్పుఁ జెప్ప నగు నది మాకున్. 54

ఉ. నీవు కథాప్రసంగముల నేర్పరి వెల్లపురాణవాసనల్
వావిరి నీముఖస్థములు వన్నె వలిప్పఁగ మాకుఁ బుణ్యసం
భావిత మై ధరిత్రి నతిపావన మై యపవర్గసంపదు
జ్జీవన మైనసువ్రతము చెప్పు ముదారవచోవిశారదా!. 55

సీ. మునినాథ! రుక్మాంగదనరనాథుఁడు తొల్లి
యేకాదశీవ్రత మెట్లు సలిపెఁ
దద్రాజ్యమున నెట్లు ధర్మంబు వర్ధిల్లె
యమలోక మేల దైన్యంబు నొందె
వనజసంభవున కేమనవిఁ జెప్పెను జముం
డేల పుట్టించె మోహిని నజుండు
మందరాద్రికి నేల మానిని చనె వేఁట
లాడ నేటికిఁ బోయె నవనివిభుఁడు
తే. కాంత మోహిని నేరీతిఁ గలసె నతఁడు
వ్రతము వల దని యది యేల వాదు లడిగెఁ
బుత్రు నేటికి హింసింపఁ బూనెఁ దండ్రి
యప్పు డేరీతిఁ బ్రత్యక్షమయ్యెఁ జక్రి. 56

క. అని పలుకువారిమాటలు
విని సూతుఁడు సంతసిల్లి వినయోక్తుల నా
మునిచంద్రులమనములు నా
ననములు వికసింపఁ బలికె నగుమొగ మలరన్. 57

చ. ఘనులు మహానుభావులు జగన్నుతపుణ్యకథాప్రవీణవా
గ్వనధులు మీ రెఱుంగని నవవ్రతసంఘము లే నెఱుంగ
నే, ర్తున నన్నుఁ బెద్దఁ జేసి దయతో వినఁ గోరుటకాక
తారు వెం, చిన శుకవాక్యముల్ వినఁగఁ జిత్త మెలర్చెదు
[వారికై వడిన్. 58

క. కావున మును రుక్మాంగద
భూవరుఁ డొనరించునట్టి పుణ్యవ్రత మే
భావించి మీకుఁ జెప్పెదఁ
బావన మా వ్రత మటంచుఁ బలికె నియతుఁడై. 59

ఉ. తెల్లని పాముపానుపును దెల్లని వార్వము నెక్కు బిడ్డఁడుం
దెల్లనిదీవిపై విడిది తెల్లనితమ్ముల మీరుకన్నులుం
దెల్లనిమోము గుజ్జమును దెల్లనిమామయుఁ దెల్లకైదు
వుం, దెల్లనికోడలుం గలుగు తెల్లనికూఁతురితండ్రిఁ గొ
[ల్చెదన్. 60

క. శ్రీదంబులు జితకలుమవి
పాదంబులు మునిమనగప్రసాదంబులు భూ
మోదంబులు భవపాశ
చ్ఛేదంబులు వాసుదేవుశ్రీపాదంబుల్. 61

క. కరణంబులు భవసాగర
తరణంబులు శుభరమావతరణంబులు సా

చరణంబులు జితకలుషా
చరణంబులు హరిపదాబ్జసంస్మరణంబుల్. 62

క. కుందనములు పరమపద
స్యందనములు ముక్తి నీయ చందనములు శ్రీ
నందనములు కలుషపరి
స్పందనములు శార్ఙ్గపాణిపదవందనముల్. 63

క. అని యదునందను శ్రీపద
వనజంబులు దలఁచి మ్రొక్కి వ్యాసమునీంద్రుఁ
మనమున సేవించి తపో
ధనుఁడు వినుం డనుచుఁ బలికెఁ దపసులతోడన్. 64

సీ. కాశ్మీర మగధ ధాంధ్ర కాంభోజ కరహాట
ఘోట మాళవ మత్స్య లాట కుకుర
ఘూర్జర కర్ణాట ఘోట్టాణ కురు ముద్ర
కేరళ సౌవీర శూరసేన
సింధు మహారాష్ట్ర చేది పాండ్య విదేహ
కుంతల ద్రావి డావంతి నిషధ
వంగాంగ మరు చోళ బంగాళ నేపాళ
పాంచాల సాల్వ బర్బర మరాళ
తే. శక విదర్భాదివివిధదేశములఁ గలుగు
పట్టణవ్రాతములలో నపారకీర్తి
నఖిలసౌభాగ్యవైభవాయతన మగుచు
జగతిఁ బొగఁడొందఁ దగు విదిశాపురంబు. 65

చ. శ్రుతియుతులర్కతుల్యులు వసుప్రభులగ్నిసముల్ కులాచల
ప్రతిమము లాశుయానములు రత్నపుబొమ్మలుకల్పవృక్షసం

తతులు దలంప నప్పురమునఁ ద్విజరాజకుమారవైశ్యవ
ర్ణితభటసామజాశ్వతరుణీజనమానవకోటు లున్నతిన్. 66

క. అందుల విప్రోత్తములు పు
రందరగురుసదృశు లపరరాజీవభవుల్
వందితపరమేశ్వరగో
విందపదాంబుజులు వేదవేదాంగవిదుల్. 67

ఉ. మిత్రసమానతేజులు సమిద్రఘురాములు వైరివాహినీ
గోత్రమహీధరాఘశరకోటు లఖండనిరంకుశక్రమ
పాత్రులు సామజాశ్వరథసంక్రమణైకసమర్థు లుత్తమ
క్షత్రియులగ్గసోమకులసంభవు లుందురు దప్పురంబునన్

క. మేటిధనధాన్యసంపదఁ
గోటులకును బడగ లెత్తి కొన నమ్మంగా
ఘోటక గజ రత్నాంబర
కోటులఁ గలవైశ్యు లచటఁ గోటులతరముల్. 69

క. అద్రులు ధైర్యంబున బల
భద్రులు భుజశక్తి నహితభంజనమున సౌ
భద్రులు తత్పురమునఁ గల
శూద్రులు శూద్రకసమానశోభితశౌర్యుల్. 70

సీ. శృంగారరసమునఁ జికిలిసేయించిన
కంతుమోహనసాయకంబు లనఁగ
మెఱసి పోకను నిల్చి మెలఁతలై కనుపట్టు
కారుక్రొమ్మెఱుఁగులగము లనంగ
వరరూపలావణ్యవైభవశ్రీమూర్తు
లన మించునవకల్పలత లనంగ

మురి పెంపునడలచే గరువంబు దళుకొత్తు
పస మించురాయంచపదువు లనఁగఁ
తే. జిత్తజుని తేరికలికిరాచిలుక లనఁగఁ
గాంతిఁ జూపట్టునవచంద్రకళ లనంగ
మగల నెలయించుమరునిదీమంబు లనఁగ
వారసతు లుందు రప్పురవరమునందు. 71

సీ. కాలకంధరచాపఖండనోద్ధతరాఘ
వామోఘతీవ్రశరాగ్నిఁ దెగక
కలశోద్భవోదగ్రకఠినహస్తకుటీర
కోణకోటరమునఁ గ్రుంగఁబడక
యౌర్వానలాభీలదుర్వారభీకర
జ్వాలికావలిచేతఁ గ్రోలఁబడక
యతురుద్రరౌద్రబాహారోపపక్షిరా
ట్పతువిక్షేపంబుపాలు గాక
తే. రమణఁ జూపట్టు రత్నాకరం బనంగ
ఘుమఘుమారావసంరంభఘూర్ణమాన
మీనమకరోగ్రనక్రసమృద్ధిచేతఁ
బరఁగు విదిశాపురంబునఁ బరిఖజలము. 72

ఉ. కోటలగడ్తలట్టడలు కొత్తడముల్ గవనుల్ కవాటముల్
హాటకగేహాళుల్ వివిధయంత్రము లాయుధహర్మ్యగేహ
ముల్, ఘోటకముల్ రథావలులు కుంజరముల్ బహువా
హినీపతుల్, సాటువ కెక్కువీరభటసంకులముం దగు నప్పు
[రంబునన్. 73

వ. అన్నగరంబున కధీశ్వరుండు. 74

ఉ. సంగరరంగభార్గవుఁడు శాశ్వతకీర్తి రమామనోహరుం
డంగభవాభిరాముఁ డభియాతినృపాలవరేణ్యరాజ్యస
ప్తాంగపరిగ్రహుండు రజతాచలధీరుఁడు రాజరాజు రు
క్మాంగదమేదినీశ్వరుఁ డహర్పతివంశపవిత్రుఁ డున్నతిన్. 75

మ. ధరఁ బాలించెఁ బురూరవున్ సగరునిన్ త్రిశంకునిన్ హైహ
యున్, బురుకుత్సన్నలు నంబరీషు రఘురామున్ రంతి నం
గున్ మరు, త్తురఘూత్తంసు భగీరథుం బృథు సుహోత్రు
న్నాహుషిన్ భార్గవున్, భరతత్త్మాధిపునిం దిలీపు గయు
మాంధాతన్ శశిన్ బోలుచున్. 76

సీ. దోషాకరత్వంబు తుహినాకరునియంద
మనవిక్రమంబు సామజములంద
విప్రలంభము విటీవిటజనంబులయంద
కుటిలత్వ మింతులకురులయంద
మధుపసంగతి పుష్పమంజరీతతులంద
ఘర్షణంబులు హాటకములయంద
రాగాతిశయవికారములు గాయకులంద
వర్ణసంకరములు వ్రాఁతలంద

తే. పక్షపాతంబు నీడసంభవములంద
గుణపరిచ్యుతి మార్గణకోటియంద
సన్నుతికి నెక్కు నమ్మహాసార్వభౌముఁ
డవనిఁ బాలించె బుధవర్గ మభినుతింప. 77

క. మేదిని ధర్మము నాలుగు
పాదంబులు మోవ నానృపాలుఁడు రాజ

శ్రీ దళుకొత్తఁగ నేలుచు
నాదట నొకనాఁడు నిర్జరాధిపు మహిమన్. 78

సీ. హితబంధుజనపురోహితచయం బొకవంక
నుత్తమక్షత్త్రియు లొక్కవంకఁ
గవిగాయకర్థిమాగధసంఖ్య లొకవంక
నుడురాజబింబాస్య లొక్కవంక
వేదవేదాంగకోవిదవిప్రు లొకవంక
నూర్జితశ్రీమంతు లొక్కవంక
రణసముద్భటవీరరావుతు లొకవంక
నురుమంత్రిసామంతు లొక్కవంకఁ
తే. జతురు లొకవంక సకలశాస్త్రప్రవీణ
హృదయు లొకవంకఁ గొలువ సమిద్ధమహిమఁ
బరఁగు రుక్మాంగదక్షోణిపాలుకడకు
నరుగుదెంచిరి శుకశౌనకాదిమునులు. 79

క. చనుదెంచిన సంయములఁ
గనుఁగొని భయసంభ్రమములు గడలుకొనంగా
వినయమున నెదురుగాఁ జని
ముని చంద్రులపాదపద్మముల కెఱఁగుటయున్. 80

సీ. ఆరోగ్య మస్తు దీర్ఘాయు రస్తు యశోస్తు
శ్రీరస్తు సంకల్పసిద్ధి రస్తు
హరిభక్తి రస్తు సుస్థిరతాస్తు మహిమాస్తు
విప్రప్రసాదోస్తు విక్రమోస్తు
విఖ్యాతి రస్తు దిగ్విజయోస్తు సామ్రాజ్య
మస్తు మోదోస్తు కళ్యాణ మస్తు

విభవోస్తు సస్యాభివృద్ధి రస్తు నయోస్తు
దానకామోస్తు సత్కాంతి రస్తు
తే. ధనకనకవస్తువాహనధాన్యపుత్ర
పౌత్రలాభోస్తు నిత్యసౌభాగ్య మస్తు
ప్రతిభటౌఘక్షయోస్తు భూపాలనైక
శక్తి రస్తు సదైవ తే జనవరేణ్య!. 81

మాలినీవృత్తము.

అని మునులీక్రియ దీవన లందఱు నన్నివిధంబుల నిచ్చిన
న, జ్జనపతిచంద్రుఁడు గైకొనివారలఁ జయ్యనఁదోఁకొని తె
చ్చి సుఖాసనములయందిడి యర్ఘ్యము పాద్యము సన్ను
తిమీఱఁగ నిచ్చి సమర్చనములు సేసి కరంబులు మో
డ్చి తిరంబుగఁ గన్గొని యిట్లనియెన్. 82

ఉ. ధన్యుఁడ నైతి మీకృపకుఁ దావల మైతి సమస్తరాజరా
జన్యులలోన ధర్మగుణశాశ్వతకీర్తుల నెల్లవారికిన్
మాన్యుఁడ నైతి మీరు బహుమానముతో నిట యేఁగు
దేరసా, మాన్యుల కిట్టిభాగ్యమహిమల్ సమకూరున యే
[యుగంబునన్. 83

వ. అని యమ్మహీవల్లభుండు పెన్నిధిం గన్న పేదచందంబున
నత్యంతసంతుష్టాంతరంగుం డై యమ్మహాయోగిపుంగవుల
కి ట్లనియె. 84

ఉ. ఏవ్రత మెల్లలోకముల నెన్నిక కెక్కు మహాప్రసిద్ధిచే
నేవ్రతమెందుఁ బాపహరమెప్పుడు నేవ్రతము త్తమోత్తమం
బేవ్రత మెల్లసంపదల నిచ్చురమారమణీమనోహరుం, డేవ్ర
తమాచరింపఁ దనయిచ్చఁ బ్రమోదమునొందునిచ్చలున్.

క. వ్రతముల కన్నిటికంటెను
ప్రతివెట్టఁగరానిదై శుభప్రదమై సు
వ్రతరాజం బగువ్రత మా
నతి యిచ్చి కృతార్థుఁ జేసి నను బ్రోవఁ దగున్. 86

వ. అని విన్నపం బొనర్చుటయును. 87

భుజంగప్రయాతము.

ధరామండలిన్ గల్గుధర్మవ్రతంబుల్
పురాణంబులన్ శాస్త్రపుంజంబులందున్
గరం బింపు సొంపారఁగాఁ గాంచి మానుల్
పొరిం బల్కి రిట్లంచు భూపాలుతోడన్. 88

సీ. అమితపాపౌఘవంశాటవీఘనదావా
శిఖికీల యేకాదశీవ్రతంబు
దర్పితాహితదైత్యదళనోగ్రవిష్ణుకా
క్షేయకం బేకాదశీవ్రతంబు
కఠినపాతకసముత్కరభేకలోకభు
గ్జిహ్మగం బేకాదశీవ్రతంబు
సంసారసంతాపసంతప్తమానసో
జ్జీవనం బేకాదశీవ్రతంబు
తే. సువ్రతాకల్ప మేకాదశీవ్రతంబు
చిరశుభాకార మేకాదశీవ్రతంబు
చిన్మయానంద మేకాదశీవ్రతంబు
శ్రీసమంచిత మేకాదశీవ్రతంబు. 89

సీ. పుణ్యభూములలోనఁ బురుషోత్తమమువోలె
గ్రహములలో దివాకరుఁడువోలె

నంభోనిధులలోన నమృతార్ణవమువోలె
నగములలో మేరునగమువోలె
నాశ్రమంబులలో గృహస్థాశ్రమమువోలెఁ
దరువులలోఁ గల్పతరువువోలె
నధికదానములలో నన్నదానమువోలె
మణులలోఁ గౌస్తుభమణియుఁబోలె
తే. స్వర్గమున భూమియందు రసాతలమునఁ
బ్రతి యొనర్పఁగ రానిసువ్రతము సకల
మంగళాస్పద మఖిలసంపత్కరంబు
క్షితితలేశ్వర! యేకాదశీవ్రతంబు. 90

క. ఆపుణ్యవ్రతశీలుఁడు
కాపురుషుం డైన పాపకర్ముం డైనన్
శ్రీపతిసాయుజ్యంబును
వే పడయును సత్య మిది వివేకనిధానా!. 91

క. సురదొరసిన గంగాంభః
పరిపూరితఘట మశుద్ధిఁ బరఁగినక్రియ భూ
వర! దశమివృద్ధి గలసిన
హరిదివస మయోగ్య మెంత యధికం బయినన్. 92

క. పాయుఁ బితృఋణము గయయం
దాయత మగుబ్రహ్మహత్య యణఁగున్ గాశిన్
ఏయేవిధమున నున్నన్
పాయదువో దశమివృద్ధి పాపం బిలలోన్. 93

క. భక్తి యొలర్పఁగఁ దగుశా
స్త్రోక్తంబుగ నాచరింపు మురుపుణ్యనిధీ!

వ్యక్తంబు గాఁగ విను వి
ధ్యుక్తంబుగఁ జెప్పెదము యథోచితలీలన్. 94

ఉ. స్నాన మొనర్చి ధౌతపరిధానములన్ ధరియించి యంటఁ
గాఁ, గానిమనుష్యులం గనక కల్లలు వల్కక యుగ్రకృ
త్యముల్, మాని వినిద్రుఁడై నియతమానసుఁడై తమలం
బుఁ దక్క స్త్రీ, జానివుగాణముల్ వినుట సంగతి శ్రీహరి
[వాసరంబునన్. 95

సీ. దశమినాఁ డేకభుక్తము సేసి మఱునాఁ డ
హోరాత్రముల భక్తి నుపవసించి
హరిమందిరమున జాగర మొప్పఁ గావించి
వేగిన ద్వాదశి వేళయందు
విప్రోత్తములకు షడ్విధరసోపేతంబు
గా భుజింపఁగఁ బెట్టి కనకనిష్క
తతులు దక్షిణ లిచ్చి తదనంతరము సుహృ
జ్జనులతో నామిషక్షౌద్రశాక
తే. విరహితంబుగఁ బారణ వేడ్కఁ జేసి
నిద్ర దివ మెల్ల వర్జించి నియమపర
మావు భుక్త్యంగనాసంగఁసంబు లుడిగి
యుచితగతి నుండు మది యుత్తమోత్తమంబు. 96

క. ఈకరణిఁ జరుపనోపక
యేకాదశిదివస మైన నిరుప్రొద్దు నిరు
త్సేకమున నుపవసించిన
శ్రీకాంతుం డుత్తమముగఁ జేకొను నధిపా!. 97

క. తక్కిన వ్రతములు సలుపక
తక్కినఁ బాతకము లేదు ధర నీవ్రత మే
చిక్కుల మానఁగ రా దిది
తక్కినఁ బాతకచయంబు వగులు నరేంద్రా!. 102

సీ. పతికార్యభారసంభ్రమవశంబుననైన
నాఁకలి లేకైన నరుచినైన
భామినీవిరహాసంప్రాప్తి నొందుటనైన
నశన మబ్బక యైన నలుకనైన
మృగయావినోదనిమిత్తములందైన
వ్యసనంబునందైన వసటనైన
దారుణజ్వరపీడఁ దగులుటనైన సం
గర మొనర్చుటనైనఁ గఱవునందు
తే. నైన హరివాసరమునాఁ డహర్నిశంబుఁ
జాల శుష్కోపవాసంబు సంభవించె
నేని నాపుణ్యనకుఁ గల్గు నెవ్వ సిరి ద
నర్చు శ్రీహరివైకుంఠనగరసుఖము. 103

క శ్వానామిషభక్షకునకు
నైనను నిష్కృతులు గలుగు హరిదివసమునన్
మానక భుజించుదోషికి
నేనిష్కృతి గలుగ నేర దినవంశనిధీ!. 104

క. అని పల్కి యమ్మహాత్ములు
దిననాథకులావతంసు దీవించి సుఖం
బున నుండు మదాశ్రమముల
కును జనియెద మనుడు రాజకుంజరుఁ డనియెన్. 105

క. తక్కిన వ్రతములు సలుపక
తక్కినఁ బాతకము లేదు ధర నీవ్రత మే
చిక్కుల మానఁగ రా దిది
తక్కినఁ బాతకచయంబు నగులు నరేంద్రా! 102

సీ. పతికార్యభారసంభ్రమపరంబునన్నైన
నాఁకలి లేకైన నరుచినైన
భామినీవిరహసంప్రాప్తి నొందుటనైన
నశన మబ్బకయైన నలుకనైన
మృగయావినోదనిమిత్తములందైన
వ్యసనంబునందైన వసటనైన
దారుణజ్వరపీడఁ బగులుటనైన నం
గర మొనర్చుటనైనఁ గఱవునందు

తే. నైన హరివాసరమునాఁ డహర్నిశంబుఁ
జాల శుష్కోపవాసంబు సంభవించె
నేని నాపుణ్యునకుఁ గల్గు నెప్డు సిరి ద
నర్చు శ్రీహరివైకుంఠనగరసుఖము. 103

క శ్వానామిషభక్షకునకు
నైనను నిష్కృతులు గలుగు హరిదివసమునన్
మానక భుజించుదోషికి
నేనిష్కృతి గలుగ నేర దినవంశనిధీ!. 104

క. అని పల్కి యమ్మహాత్ముఁలు
దిననాథకులావతంసు దీవించి సుఖం
బున నుండు మదాశ్రమముల
కును జనియెద మనుడు రాజకుంజరుఁ డనియెన్. 105

క. కారణబాంధవు లితరు ల
కారణబాంధవులు మీరు గావున నను శ్రీ
నారాయణపుణ్యవ్రత
పారాయణుఁ జేసితిరి కృపామతులారా!. 106

వ. అని యప్పు డప్పరమయోగిపుంగవులకు సాష్టాంగదండప్ర
ణామంబు లాచరించి పాదచారియై కొంతద వ్వరిగి వారల
చేత నాశీర్వాదపూర్వకంబుగా నంపించుకొని క్రమ్మఱఁ
దన నగరి కేతెంచి కొలువునం గూర్చుండి తన్నుం బరివే
ష్టించి యున్న బుధబంధుపురోహితామాత్యవర్గంబులం
గనుంగొని యమ్మహీవల్లభుం డి ట్లనియె. 107

ఉ. వింటిరె! మీర లీనిగమవేత్తలు యోగివరేణ్యు లిట్లు నా
యింటికి నేఁగుదెంచి నను నెంతయు ధన్యునిఁ జేసి నామనం
బంటఁగ నీమహావ్రతమహత్త్వము దెల్పిరియిట్టిదెయ్యెడఁ
గంటిరె నాతపఃఫలముఁ గాంచితి మించితిఁ బుణ్యసంపదన్.

క. తప్పక శ్రీహరివాసర
ముప్పారఁగ నాచరింతు యోగివరేణ్యుల్
చెప్పినశాస్త్రోక్తక్రియ
చొప్పడరఁగ వైష్ణవోక్తిశోభితగరిమన్. 109

క. మీరును నిద్ధారుణిఁ గల
వారును నీసువ్రతం బవశ్యము ముద మిం
పారఁగఁ జరుపుఁడు మన కా
సారసదళనేత్రుఁ డొసఁగు సాయుజ్యంబుల్. 110

వ. అనుటయు నాకొలువునం గలవార లెల్ల నేకవాక్యంబున
ని ట్లనిరి. 111

క. శ్రీజానికిఁ బ్రియముగ మము
నోజ వ్రతము సలుపు మనుచు నూఁదఁగ నేలా
'రాజానుమతో ధర్మం'
బీజగమున వినమె మాట యెప్పుడును నృపా!. 112

క. కావున మీ రిటు చెప్పినఁ
గావించుట కాక యొండు గలదే మాకున్
భూవర! చాటింపఁగఁ దగు
నీవసుమతిలోని ప్రజల కెల్లం దెలియన్. 113

క. అనుటయు నజ్జననాథుని
యనుమతమున మంత్రిముఖ్యు లట తలవరులన్
బనిచిరి హరిదివసవ్రత
మనురక్తిం జేయుఁ డనుచు నవనిం జాటన్. 114

ఉ. వారును నవ్వసుంధర నవారణఁజాటఁ దొణంగి రోలి నూ
రూరను బల్లెపల్లె నగరోత్కరవీధులఁ బట్టణంబులన్
భేరులు తమ్మటంబులును నిస్సహాణంబులు శంఖకాహళుల్
భోరుకలంగ మ్రోయ నృపపుంగవునాజ్ఞ వినంగఁ జెప్పుచున్.

సీ. అభ్యంజనస్నాన మాచరించి దశమం
దుల నొక ప్రొద్దుండ వలయుఁ జుండో
హరివాసరము నిరాహారు లై జాగరం
బలవున్నై నిశిఁ జేయవలయుఁ జుండో
ద్వాదశి విప్రసంతర్పణం బొనరించి
వరుసఁ బారణసేయువలయుఁ జుండో
తద్దినం బెల్ల నిద్రయు మాఱుటన్నంబు
వర్జించి యుండఁగా వలయుఁ జుండో

తే. అందఱికి నివ్విధంబు రాజాజ్ఞ సుండొ
తప్పఁగా రాదు తప్పినఁ దప్పు సుండొ
నవ్యకైవల్యఫలసాధనంబు సుండొ
యాదినారాయణునకుఁ బ్రియంబు సుండొ. 116

క. అని చాటి రెల్లదిక్కుల
జనములు నివ్విధము సలుపఁ జాఁగిరి రాజుం
దనభార్యలతోఁ గూడఁగఁ
జనితానందముగ వ్రతము సలుపఁ దొడంగెన్. 117

సీ. వీథులు సవరఁ గావించి గంధంబునఁ
గస్తూరికలయంపిఁ గలయఁ జల్లి
క్రొత్తముత్యముల ముగ్గులు విచిత్రములుగా
రంగవల్లిక లేర్పడంగ వ్రాసి
మణిగాసనములఁ బ్రేమ నొనర్చి గోడలఁ
జెలువారఁ గృష్ణలీలలు లిఖించి
కలువడంబులు గట్టి ఘంటాపథములందుఁ
బొడవుగా నునుబట్టుపడగ లెత్తి
తే. కదళికాతతి నిల్పి మేల్కట్లుగట్టి
హర్మ్యముల హేమకుంభంబు లందపఱిచి
పురము రాజ్యంబు శృంగారముగ నొనర్చి
యవనినాథుండు నదిఁ దీర్థమాడి వచ్చి. 118

మ. కరపాదాననముల్ శుభాంబువులఁ బ్రక్షాళించి శుద్ధాత్ముఁ
డై, హరిపూజాస్థలిఁ జిత్రకంబళమునం దాసీనుఁడై ద్వాద
శా, క్షరమంత్రాంచితగోపిచందనసమంచత్ఫాలభాగుండు

నం, బురుహోత్కోత్కరమాలిఁ గ్రాధరుఁడు నై మోదంబు
దీపింపఁగన్. 119

సీ. అభిషేక మొనరించె నమరేంద్రవంద్యున
కర్పించెఁ బరిధాన మచ్యుతునకుఁ
గనకాంబరునకు నర్ఘ్యమును బాద్యము నిచ్చె
నిచ్చె నాచమనీయ మీశ్వరునకు
నొసఁగె శ్రీగంధంబు వసుదేవసుతునకు
శేషశాయికి నిచ్చె భూషణములు
నిర్మించె శార్ఙ్గపాణికి మాలిఁ బువ్వుముల్
పచరించె ధూపదీపములు హరికిఁ
తే. జూపె నమృతోపహారంబు గోపపతికి
నధికతరభక్తి నీరీతి నాదిదేవుఁ
బూజఁ జేయుచు దిన మెల్ల భూరిమహిమ
జరిపె నేకాదశీమహోత్సవము నృపతి. 120

సీ. తమటనిస్సాణమృదంగభేరీశంఖ
రవములు ఘోరున రహిఁ జెలంగ
భరతశాస్త్రనిరూఢి భామాసమూహంబు
నభినయం బలర నాట్యంబు సలుప
శ్రీభాగవతనారసింహవామనవైష్ణ
వపురాణములు భాగవతులు చదువ
శ్రుతిఁగూడి గాయకస్తోమంబు గర్ణామృ
తములుగా సంకీర్తనములు సలుప

తే. బహుళకర్పూరగంధపుష్పములతోడ
ధూపదీపములను బహుస్తుతులతోడ
వివిధనైవేద్యములతోడ విష్ణుపూజ
సలుపుచును భూవిభుఁడు చేసె జాగరంబు. 121

క. అంతటను దెల్లవాఱిన
సంతసమునఁ బ్రజలుఁ దాను స్నానంబులు చే
సెంతయుఁ బ్రియమున లక్ష్మీ
కాంతునిగుడి కేఁగి మ్రొక్కి కణఁక యెలర్పన్. 122

సీ. దండంబు సర్పితోద్దండరక్షోహర్త
కడియుండ జాతరూపాంబరునకు
జోహారు సురమునిస్తుతపాదయుగునకు
శరణార్థి వైకుంఠశాశ్వతునకు
జేజే రమాముఖాంభోజాతమిత్రున
కభివందనంబు పద్మాక్షునకును
జోతలు కైటభాసురగర్వహరునకు
నొలిగె బ్రహ్మాండభాండోదరునకు
తే. మోడ్పుకెంగేలు కరుణాసముద్రునకును
గోపపతికిఁ బ్రణామంబు కోటిసూర్య
తేజునకు మ్రొక్కు యదువంశతిలకునకును
సంతసంబును భయభక్తి శరణొనర్తు. 123

సీ. డాచంక వేత్రదండముతోడ బంగారు
జలజాతభృంగార మలవరించి
మొలపట్టుకాసెలో మురళికానాళంబుఁ
జొనిపి బిగ్గర దిండు పెనఁచి కట్టి

దధిమిశ్రితం బై నధవళాన్నకబళంబు
సవ్యహ స్తమునందు సంతరించి
రత్నాంగుళీయకప్రభఁ దనర్చినవ్రేళ్ల
సంది నొక్కొకవడపిండె యునిచి
ఆ. గోపసుతులనడుమఁ గూర్చుండి నవ్వుచు
నఖలయాగభోగి వై తనర్చు
దేవ! నీవు చల్ది త్రిదశుల నోరూర
నారగించులీల లభినుతింతు. 124

సీ. మూఁడుకన్నులవేల్పు ముంజేతికడియంబు
పఱవుపచ్చడము నై యొఱవుమిగుల
నక్కన విలసిల్లు చక్కనిపూఁబోణి
మాలును మనుమరాలై తనర్ప
బొడ్డుఁదామరఁ బుట్టి పొలుపారుబిడ్డఁ డం
తటికిఁ దీర్పరియు ధాతయును గాఁగ
పులుఁగులగమికాఁడు పలుదెఱంగులదాఁటు
గుఱ్ఱంబు బంటు నై కొమరుమిగుల
తే. ప్రాఁతచదువులు వలకాలిపసిఁడియంది
యయును గూర్చుండువీఁటయు నగుచు మీఱ
నేలయును మిన్నుఁ దన్ను నీనేర్పుకొలఁది
తెలియ నేర్తుమె మాయన్న! తెలియదన్న!. 125

క. వన్నెలు గలపచ్చడమఁట
కొన్నవిలుకాఁడు ముద్దుఁగొడుకఁట వడకుఁ
వెన్నెల కిర వఁట కన్నులు
వెన్నుఁడ వఁట నీకు సవతు వేల్పు లేరీ!. 126

ఉ. ఎన్నఁటిబాంధవుండుధ్రువుఁడెన్నటిచుట్టమహల్య కుబ్జయి
కెన్నఁట్టియిష్టురాలిభకులేశ్వరుఁ డెన్నఁటిభృత్యుఁ డిట్టియి
యున్నతసత్కృపాగరిమ నెందు నకారణబాంధవుండవై
మన్ననఁ బ్రోచునీకరుణమాత్రమే నుతియింప నచ్యుతా!

సీ. రాజసంబున నీవు బ్రహ్మత్వము వహించి
తలఁచినంతనె సృష్టిఁ గలుగఁ జేసి
సాత్త్వికంబున నీవు జగతి విష్ణుండ వై
లీలావిభూతిఁ బాలింపుచుండి
తామసంబున నీవు భీమరూపము దాల్చి
సకలప్రపంచంబు సంహరించి
ఫణసహస్రవిరాజఫణిశయనుండ వై
ప్రళయాంబునిధియందుఁ బవ్వళించి

తే. పేర్మి నీరీతి దొంతులు పేర్చి పేర్చి
క్షితి బహుప్రకారముల రక్ష చేసి చేసి
కూడనివి యెల్లఁ గ్రమ్మఱఁ గూల్చి కూల్చి
విశ్వములు నీవు క్రీడఁ గావింతు వధిప!. 128

క. శౌరిన్ మురారి హరి నసు
రారిన్ మధువైరి నఘవిదారిన్ బుణ్యా
చారిన్ సువిచారిన్ శ్రీం
గారిన్ గిరిధారిఁ గొల్తుఁ గలిసంహారిన్. 129

వ. అని యి ట్లనేకవిధంబుల సంస్తుతించి యయ్యిందిరాధీశ్వరు పాదతీర్థంబులు గైకొని నిజమందిరంబునకుం జను నవసరంబున. 130

సీ. ఏవీథిఁ జూచిన శ్రీవైష్ణవశ్రేణిఁ
బేర్మిఁ బారణలకుఁ బిలుచువారు
ఏదేవభవనంబు మోదంబుతోఁ గన్న
నుపహారములు సల్పుచున్నవారు
ఏవేదికాస్థలం బీక్షించిన సహస్ర
నామకీర్తనము లొనర్చువారు
ఏగృహాంగణము నెయ్యెడ విలోకించిన
సరవితోఁ బంతులు సాగువారు
తే. నెచట భూసురుఁ గనిన మాయింట వేళ
యైనయది రం డనుచుఁ గొంచు నరుగువారు
నగుచు భయభక్తిసంభ్రమాయత్తు లగుచు
నఖిలమానవు లప్పు డాహ్లాదమునను. 131

సీ. పాయసాన్నము లపూపములు పెసరపప్పు
లాజ్యప్రవాహంబు లరఁటిపండ్లు
ఖండశర్కరలు మీఁగడ లిక్షుఖండముల్
తీయఁగూరలు చారు తిమ్మనములు
అప్పడములు పెనునామవడలు మంచి
పచ్చళ్లు శిఖరుల పనసతొలలు
మామిడితాండ్రయామలకముల్ పానక
ములు రసావళ్లాలముద్ద పెరుఁగు
తే. శొంఠిమజ్జిగలును భూమిసురసహస్ర
ములకు గంధాక్షతలపూజ మున్నుగాఁగ
నారగింపంగ నిడి విడియంబు లొసఁగి
తారుఁ బారణ సేసిరి తత్క్షణంబ. 132

చ. నరపతి వారికిన్ శతగుణంబులుగాఁ బదివేలు భూమిని
ర్జరులకు భోజనంబు లిడి స్వర్ణము దక్షిణ లిచ్చి బాంధవో
త్కరసచివాప్తమిత్రసహితంబు నిజవ్రతమార్గరీతి శ్రీ
హరిపదపద్మభక్తి చెలువారఁగఁ బారణసేసి రక్తితోన్. 133

క. పారణసేసిన పిమ్మట
ధారుణిపతి వైష్ణవులును దానుఁ బ్రధానుల్
శ్రీరామకథలు వినుచును
వారక దివ మెల్ల నిద్ర వదలి చరించెన్. 134

క. ఈరీతి నానృపాలుఁడు
ధారుణి నేకాదశీవ్రతము సలుపంగాఁ
జారుతరభోగభాగ్య
శ్రీరమ్యస్ఫూర్తి ధాత్రిఁ జెన్ను వహించెన్. 135

సీ. వలె నన్నయప్పుడె వర్షించు మేఘము
లావులు పాలు చన్నవిసి పిదుకుఁ
గోరినసస్యముల్ కొండవేలును బండు
నెల్లకాలము ఫలియించుఁ దరులు
వినుతసంతానాభివృద్ధి నొందిరి జనుల్
ధర్మంబు నాల్గుపాదముల నడచె
శ్రీధాన్యకటక మై చెన్నొందె దేశంబు
బహుభోగభాగ్యసంపదలు మించె

తే. క్రమము దప్పినమరణముల్ కట్టువడియె
వ్యాధు లుడివోయె నపమృత్యుపదటంగె
కఱవు గఱవయ్యెఁ జోరులాకాంక్ష లుడిగె
వసుధ రుక్మాంగదుఁడు సల్పువ్రతముకతన. 136

క. యమలోకమునకుఁ జన రు
త్తమ మగువై కుంతమునకుఁ దక్క మనుష్యుల్
క్రిమి కీటక పశు పక్షి మృ
గము లాదిగఁ బొందుచుండెఁ గైవల్యంబుల్. 137

వ. ఇవ్విధంబున రుక్మాంగదమహీశోత్తమునిరాజ్యంబంతయు నూర్జితం బై యఖిలజనులు నత్యంతాహ్లాదంబునం దామరతంప రై పుత్రమిత్రకళత్రాదులతోడ నభివృద్ధిం బొందుచుండి రంతఁ గొంతకాలంబునకును. 138

క. అనఘుం డగురుక్మాంగద
జననాథునిభార్య యైనసంధ్యావళికిన్
వనజోదరుకారుణ్యం
బున గర్భప్రాప్తి యయ్యె మోద మెలర్పన్. 139

క. చెక్కులు పలుచన లై చను
ముక్కులు నలుపెక్కె చిట్టములు పొడమెఁ దరుల్
నొక్కులు విరిసెం గోరిక
లక్కమలాననకు నంతకంతకుఁ జేర్చెన్. 140

క. వెలువెలుకఁ బాఱె దేహము
అలసత నడుపులను జెయ్వులందును దోఁచెన్
వెలివిరిసె నాభి జఠరము
కలకంఠికిఁ బొడవు దోఁచి కానఁగవచ్చెన్. 141

సీ. బహుళగంధములతోఁ బవనుఁ డల్లన వీచె
దిక్కులు విశద మై తెలివి నొందె
జలరాసు లేదు నుత్సవమున నుప్పొంగె
భానుబింబము శుభప్రభఁ దనర్చె

హవ్యవాహుఁడు దక్షిణార్చుల విలసిల్లెఁ
దరులు పుష్పఫలప్రతతుల నలరె
నిర్మలం బైనట్టినీరముల్ ప్రవహించె
నఖిలజీవులకు నాహ్లాద మొదవె
తే. నంబుజోదరుదివ్యపాదారవింద
భక్తిభాజనుఁ డైనయప్పార్థివునకు
నమితగుణరత్నసంశోభి యగుకుమారుఁ
డుదయమును నొందునవ్వేళ నుర్వియందు. 142

క. అవనీశ్వరునంతఃపుర
భవనాంతరదేశ మెల్లఁ బ్రభచే వెలిఁగెన్
గువలయబాంధవుపొడుపునఁ
బ్రవిమల మగుపూర్వభూమిభాగమువోలెన్. 143

ఉ. నందనుఁ డుద్భవించె ననిన న్విని యెంతయు సంతసించి మి
న్నందుచు సూతికాగృహమునందుల కేఁగితనూజువక్త్రమా
నంద మెలర్పఁ జూచి జననాథవరేణ్యుఁడు తీర్థమాడి చె
న్నొందఁగ సత్కుమారజననోత్సవమొప్పఁగఁ జేసెన త్తఱిన్.

క. మఱియును బుధబాంధవులకు
నిఱుపేదల కాశ్రితార్థినివహంబులకున్
జిఱుతలకును వృద్ధులకును
మెఱుఁగుంబోఁడులకు నిచ్చ మెచ్చఁగ నిచ్చెన్. 145

క. జననాథుఁడు పండ్రెండవ
దినమునఁ బుణ్యాహ మొప్పఁ దీర్చి సుతునకున్
మన మలరఁగ ధర్మాంగదుఁ
డనునామము సకలజనులు నౌ ననఁ బలికెన్. 146

వ. ఇవ్విధంబున నమ్మహారాజశేఖరుండు నిజకుమారతిలకునకు జాతకర్మనామకరణాన్నప్రాశనచౌలోపనయనాదులు క్రమక్రమంబునఁ గావించి యనంతరంబ యక్షరాభ్యాసంబు మొదల కావ్యనాటకాలంకార వేదశాస్త్రపురాణేతిహాస ప్రకారంబు లెఱింగించి గజతురగస్యందనారోహణనిపుణత్వంబును నసి కుంత తోమర గదా ప్రాస త్రిశూల పరశు చక్రాంకుశ భిండివాలాయుధాది నానాయుధాభ్యాసంబులును గావించిన. 147

ఉ. సన్నుతరూపవైభవము శాశ్వతకాంతియు భోగభాగ్య మత్యున్నతశౌర్యరేఖయు సముజ్జ్వలతేజమునాఁడునాఁటికిన్ వన్నె దలిర్పఁగా ధరణివల్లభసూనుఁడు బంధుకోటిలో నెన్నికమీఱుచుం బెరిఁగె నేనిడకొమ్మున దాదితొమ్మునన్.

ఉ. ఆవసుధాధినాథసుతుఁ డంతట యౌవనరేఖ మీఱనై రావణదంతి గంధమున గంజిలుకై వడిఁ గల్వకంబుపూఁ దీవకతంబునం బొలుచు తెల్వి సుధాంశుఁడుసన్నుతచ్ఛవి శ్రీ విలసిల్లుభాతి రవిచే నుదయాచల మొప్పునాకృతిన్.

మాలిని. సంగరరంగజయం బనయంబు విశాలయశంబుఁ బ్రియంబు సము, త్తుంగపరాక్రమరేఖయు నవ్యవధూనిరపేక్షణమారముస, ప్తాంగసమంచితరక్షయు దానమహాత్వము నెన్నిక కెక్కఁగ రు, క్మాంగదునాజ్ఞ శిరంబునఁ దాల్చి ధరాధిపనందనుఁ డింపెసఁగెన్. 150

చ. త్రిభువనసుందరాంగి సుదతీమణి నంబుజనేత్ర మాళవప్రభుసుత చంద్రరేఖ యనుపల్లవకోమలపాణిఁ గంతుస

న్నిభుఁడగునక్కుమారునకు నెమ్మి వివాహము చేసె నిందిరా
విభవ మెలర్ప భూవిభుఁడు విశ్రుతశాస్త్రసమగ్రవైఖరిన్.

క. ధర్మగుణవర్ధనుం డగు
ధర్మాంగదు నిఖిలరాజ్యతంత్రాధిపుఁ గాఁ
బేర్మి నొనరించి భూపతి
నిర్మలహరిపాదభక్తిసిరతుం డయ్యెన్. 152

ఉ. ఆనరనాథసూనుఁ డది మొదిగఁ బ్రోదిగ రాజ్య మెల్ల స
న్మాన మెలర్పఁదీర్పుచుఁ గ్రమంబునధర్మము నిర్వహింపుచున్
బూనికమీఱ వైరినృపపుంగవులం బొరియింపుచున్ బృహ
ద్భానుసమప్రతాపభరితస్ఫురణ న్వెలసిల్లె నుర్వరన్. 153

ఉ. ఆయత దేహదీప్తు లఖిలావనిభాగ మలంకరింప నా
రాయణపాదపంకజపరాయణుఁ డంబుజగర్భసూనుఁ డా
మ్నాయవిశారదుండు మునినాయకమౌళివిభూషణంబు ప
ర్యాయపితామహుండు హృదయంబుననంతకుఁ జూచు వేడు
[కన్. 154

సీ. ప్రబల మైనజటాభరంబు పైఁ జుట్టిన
కాషాయవస్త్రప్రకాశ దనర
వక్షస్స్థలమున క్రేవఁ దనర్చువనజాక్ష
మాలికాదీప్తిసామగ్రి నిగుడఁ
గటిమండలమున సంగత మైన కృష్ణాజి
నోత్తరీయకము చెన్నొప్పుచుండ
నంసస్థలమున నారాయణసంకీర్త
నము మ్రోయుమహతి గానము దలిర్ప
తే. దండము సకలతీర్థకమండలమును
లాలితస్ఫూర్తిఁ దగుజపమాలికయును

హస్తమున మీఱఁగాఁ గలహప్రియుండు
వచ్చె నారదముని సమవర్తికడకు. 155

ఉ. దూరముననె యమ్మునినిదుర్గ్భని దండధరుండుభక్తియే
పారఁ బ్రణామముల్ సలిపె నయ్యతిరాజశశాంకుపాదపం
కేరుహముల్ విశేషమణికీలితదివ్యకిరీటవిస్ఫుర
న్నారనవప్రభావలుల భాసురలీల నలంకరింపఁగన్. 156

క. రుచిరాసనంబునం దిడి
యచలితభయభక్తితోడ నర్ఘ్యము పాద్యం
బుచితముగ నొసఁగి మునితో
వచియించెను దండధరుఁ డవష్టంభముగన్. 157

ఉ. సారసగర్భసంభవ విశాలతపోధన యాత్రికైకర
తారతబుద్ధి మీరలు ప్రసన్నత మన్నిలయంబు గన్గొనన్
వారక నేఁడు వచ్చుట లవారణ చిచ్చుకగుంటమీఁద భా
గీరథి వచ్చినట్లు పరికింపఁగ నింతటిపుణ్య మబ్బునే. 158

క. చరియింతువు త్రిభువనములు
మొరయింతువు మహతియందు మురరిపుచరితల్
విరియింతువు భవతిమిరము
వరియింతువు ముక్తికాంత వనజభవసుతా!. 159

క. తెలియుదువు లోకవార్తలు
బలియుదువు ముకుందపాదభక్తిక్రియలన్
మలియుదువు సుజనగృహముల
వెలయుదు వధ్యాత్మవిద్య విబుధమునీంద్రా!. 160

చ. కనుఁగొనుచుందు వెప్పుడు జగంబులసర్వమునీదుదృష్టిలోఁ
గానని విశేష మొందు నొనగూడదు ధారుణిలోనిమర్త్యులే

చనవున నన్నుఁ గైకొనక సద్గతి కేఁగుచు నున్నవార లె
వ్వనిశరణంబుచొచ్చిరిధ్రువంబుగనాకెఱుఁగంగఁజెప్పుఁడా.

ఉ. ఓయనఘాత్మ! తాపసజనోత్తమ! నారద సన్మునీంద్ర! నా
రాయణపాదపంకజపరాయణ! నిన్ను మదీయపూర్వపు
ణ్యాయతసత్ఫలంబుమదమారఁగఁగాంచినభంగిఁ గంటి న
న్యాయము నాదురాజ్యసుఖ మారడిఁబోయెఁబొసంగఁజూ [డుఁడా.

సీ. అన్నవిక్రయులు దేవాధికారులు సురా
పానవర్తనులు గోబ్రాహ్మణాంగ
నాహంత లన్యకాంతాపరాయణులు వి
శ్వాసఘాతకు లనాచారనిరతు
లనృతవాక్యులు సజ్జనాపవాదులు గురు
ద్రోహులు పిశునతా ద్యూతరతులు
గృహదాహకులు విష్ణుకీర్తనద్వేషులు
శివదూషకులు కులశ్రీవిదూరు

ఆ. లంటఁగానిసతుల నసురక్తిఁ బొందిన
ఖలులు బాలవృద్ధగణము లుండ
భుక్తిగొన్న దుష్ప్రభులు నేగుదెంతురు
ప్రతిదినంబు నాదుభవనమునకు. 163

సీ. కూటసాక్షులు హీనకులసేవకులు వృష
లీపతు లన్యధనాపహారణు
లన్వయచ్యుతులు రణావనివిముఖులు
చౌర్యవర్తనులు పాషండమతులు
సుకృతవిక్రయులు భూసురగురుద్వేషులు
శరణాగతావనశూన్యు లవని

మిత్రఘాతకులు స్వామిద్రోహు లాశ్రిత
జనవిసర్జనులు విషప్రయోగు
తేలాదిగాఁగల్గు పాపాత్ము లనుదినంబు
మనుజలోకంబు నందుండి మత్పురమున
కన్నిత్రోవల నర్బుదన్యర్బుదముల
సంఖ్య లేకెంతు రుడుగని సందడులను. 164

క. నరకంబు లెల్ల నిరతము
సిరి దొలకుచునుండు సకలజీవులచేతఁ
బురవరము నాల్గుదిక్కులఁ
బరిపూర్ణత నొందు జనుల బాధలరవముల్. 165

ఉ. గురుతరవిక్రమస్ఫురణఁ గోటులసంఖ్యమహోగ్రకింకరుల్
పరిగొని పాపకర్ములను బట్టికరంబులు గూడఁగట్టి ని
ష్ఠురకరవాల శూల పరశు క్షురికాదులఁ గ్రొల్లఁ జేతులుఁ
శిరములు వక్షముల్ దుమురుసేయుచు నుండుదు రెల్లకాల
ముఁ. 166

ఉ. కొందఱ నంధకూపములఁ గూలఁగఁద్రోచియుఁ జాపఱాల
పైఁ, గొందఱ దేహముల్ నలియఁగొట్టియు నేత్రములందు
వ్రేలఁగాఁ, గొందఱఁ గట్టి చేఁదియును గ్రూరమృగాదన
కోటిముందఱం, గొందఱఁ గట్టివేసియును గొందఱ
నమ్ములపాలుఁ జేసియుఁ. 167

క. ఈకరణి నెల్లకాల మ
నేకవిధంబులను బాధ లెడ తెగక భటా
నీకములు సేయుచుందురు
రీకాలమునందు దొరకఁ డెందు నొకండుఁ. 168

ఉ. పట్టణవీథులందు నసిపత్త్రవనంబులయందు డాకినీ
హట్టములందు రాజభవనాగ్రములన్ జెఱసాలలందు నే
పట్టుననిండియుండుదురు పాయఁగఁద్రోయఁగరాకమూకలై
యొట్టిడినట్లు నేఁడొదవఁడొక్కరుఁడున్ బురిపాడు దేరెడిన్.

ఉ. ఏనొనరించుకార్యగతి యెయ్యది సంయమనీపురంబు నా
నానరకవ్రజంబులు జనంబులచేఁ బరిపూర్తి నొందుచున్
గానఁగవచ్చుచున్నఁడు సుఖస్థితి గల్గునొకో భటాలికిన్
మానివరేణ్య! సర్వముఁ గ్రమంబున నాకెఱుగంగఁ జెప్పుఁడా.

క. అని పలుకు జమునివాక్యము
విని సురముని నలికి భూమివిభుఁడు మహాత్ముం
డనఘుఁడు రుక్మాంగదుఁ డను
ఘనపుణ్యుఁడు రా జొకండు గలఁ డిలలోనన్. 171

క. ఏకాదశీవ్రతం బతఁ
డేకాలముఁ బ్రజలుఁ దాను నెడవడ కుండన్
బ్రాకటభక్తిన్ జలుపఁగ
నాకతమునఁ బరమపుణ్యులై జను లెల్లన్. 172

క. నీ పురికి రారు మానవు
లావురుషోత్తముపదంబు నందుదు రెంతేఁ
గాపురుషు లైన నిఁక నీ
వా పద్మజుకడకు నేఁగి యతిరభసమునన్. 173

చ. కమలజుఁ గాంచి భక్తి యెసఁగన్ బ్రణమిల్లి వరేతరాజ! నీ
క్రమము సమస్తముం దెలియఁగా వినిపించినఁ బద్మసంభవుం
డమరఁగ నీదు రాజ్యము ప్రియంబున నెప్పటియట్లయుండఁగా
సముచితలీలఁ జేయును బ్రసన్నమతిన్ జనుమీక్షణంబునన్.

వ. అని నారదుండు దండధరునకు హితోపదేశంబు చేసి యమునియుం జనియె నని సూతుం డెఱింగించిన విని శౌనకాదిమహామును లటమీఁది వృత్తాంతం బెట్టి దనిన. 175

శా. గౌరీమానసవాస వాసవసభాకల్యాణ కల్యాణశై
లారూఢాయతచాప చాపలఖలవ్యాపాద పాదాగ్రమం
జీరధ్వానవిశేష శేషఫణిరసన్వీకారకారా మహీ
గారారాతి బలాబలారి బలదర్పోద్దీప దక్షద్విపా. 176

క. వ్యాసాదిమౌనిమానస
వాసా! వాసవవిరించివరదా! వరదా
నాసక్తచిత్త! చిత్తజ
లాసకలీలాభిరామ! లక్ష్మీధామా!. 177

పృథ్వి. విశేషఫణిభూషణా వినుతభక్తసంతోషణా
ప్రశస్తమృదుభాషణా ప్రబలదుఃఖసంశోషణా
త్రిశూలవరధారణా త్రిపురదైత్యసంహారణా
నిశేంద్రనవమండనా నిఖిలవైరిజిద్భండనా.! 178

గద్యము. ఇది శ్రీమత్పార్వతీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనానందచర్య ప్రౌఢకవిమల్లనార్య ప్రణీతం బైన రుక్మాంగదచరిత్రంబను మహాపుణ్యకథయందు రుక్మాంగదుం డున్నడకు శౌనకాదిమహామును లేతెంచుటయు నవనీశ్వరుండు పుణ్యవ్రతోపదేశంబు సేయు మని ప్రార్థించుటయు నమ్మును లేకాదశీవ్రతమాహాత్మ్యం బెఱిఁగించుటయు నాబాలవృద్ధజనసహితం బఖిలావనీజనసమూహంబుతోఁ జాతుర్భక్తవర్జితంబుగా

నేకాదశీవ్రతం బవనీశ్వరుం డాచరించుటయును దద్వ్రత నిమిత్తంబున వసుంధర సర్వసంపత్సమృద్ధి నొందుటయు ధర్మపత్నియైన సంధ్యావళియందు ముకుందచరణారవింద భక్తితాత్పర్యుండగు ధర్మాంగదుం డుద్భవించుటయు ధరణీ చక్రంబునంగల మానవలోకంబులో నొక్కండయి నయ మసదనంబునకుఁ జనకుండుటయుఁ దత్పుత్రపౌత్రులాచరిం చువ్రతపుణ్యంబునం జేసి యమలోకంబున మున్నున్న నార కులు నరకనిర్ముక్తులై దివ్యలోకంబున కరుగుటయు జమస దనం బఖిలజనశూన్యత్వంబు నొందుటయు నారదుండు యముని పురంబునకుం జనుటయు ధర్మరాజు తనలోక శూన్యవృత్తాంతంబు నారదునకు విన్నవించుటయు నత నికి నారదుండు రుక్మాంగదుం డొనరించు నేకాదశీవ్రత ప్రభావం బెఱింగించుటయు నతండు కమలగర్భసమ్ముఖం బునకుం జన నియోగించి చనుటయు నన్నది ప్రథమా శ్వాసము.



శ్రీ ర స్తు.

# రుక్మాంగదచరిత్రము

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీగౌరీహృదయాబ్జ
ప్రాగల్భ్యమరందభృంగ! పంచాక్షరమం
త్రాగమరూప! పదాంగద
భోగికులాధీశ! దక్షపురభీమేశా!. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని
యె అట్లు హితోపదేశంబు చేసి నిలింపమాని చన్నపిమ్మట
ధర్మరాజు శతసహస్రసంఖ్యగల భయంకరకింకరవర్గంబు
నిరంకుశప్రతాపంబున నిరువంకలం గొలువ మహామహిష
వాహనారూఢుం డై శంఖ కాహళ మృదంగ తమ్మటా
నేకభేరీ నిస్సాణ ధ్వానంబులు చెలంగ నాప్రొద్దె కదలి
గగనగమనంబున ననేకలోకంబు లుత్తరించి సర్వలోకోత్త
రంబగు సత్యలోకంబున కరిగె. తత్పట్టణప్రదేశంబున నగ
ణ్యరత్నహాటకప్రాకార గోపురాట్టాలక హర్మ్యమంటపో
ద్భాసితంబును కపోతపాలికాద్వారతోరణస్తంభవిరాజి
తంబును మరకతమణిగవాక్షకుడ్యవేదికారమ్యంబును కన
కకవాటదేహళీప్రభాభిరామంబును జతుశ్శాలాభివితాన
విశాలంబును నవీనశాతకుంభకుంభాలంకారశిఖరప్రదేశ

శోభితంబును నగుచు విలసిల్లు పద్మభవునగరసింహద్వా
రంబున నులాయంబు డిగ్గి ద్వారికులచేతఁ దనరాక కమ
లసంభవున కెఱిఁగించి యద్దేవతాసార్వభౌము ననుమతం
బున నగరు చొచ్చి చనునవసరంబున సనక సనందన
సనాతన సనత్కుమారాది యోగీంద్రులును వసిష్ఠ వాల
ఖిల్య వామదేవాత్రి కశ్యప కణ్వ కలశభవ భరద్వాజ
ప్రముఖసన్మునివ్రాతంబును దేవేంద్రప్రముఖ దిక్పాలకస్తో
మంబును జంద్ర సూర్యాది గ్రహంబులును గరుడ గంధ
ర్వ సిద్ధ విద్యాధర యక్ష రాక్షస సమూహంబును ఋతు
సంవత్సర మాస పక్షంబులును దివా రాత్రంబులును సప్త
కులపర్వతంబులును సప్తసముద్రంబులును సప్తద్వీపం
బులును నదీ నదంబులును బరివేష్టించియుండ వజ్రసిం
హాసనాసీనుం డై కొలువునం గూర్చున్న భారతీజానిం గని
కాలగండ కాలపాశాది సాధనంబులు ముందటం బెట్టి
సాష్టాంగదండప్రణామంబు లాచరించి ముకుళితకరకమ
లుం డై యనేకవిధంబుల సంస్తుతించి యిట్లనియె. 2

శా. వాణీనాథ! సమస్తదేవవరదా! వ్యక్తంబుగా దేవతా
శ్రేణుల్ మీరు వినంగఁ జెప్పెద విచారింపుండు రుక్మాంగద
క్షోణీపాలుఁడు విష్ణుభక్తుఁడు మహాశుద్ధాత్ముఁ డౌదార్యపా
రీణస్వాంతుఁడు తానుభూమిజనులన్ ప్రీతిన్ సదాకాలమున్.

క. హరివాసరంబు నియతిన్
ధర చాతుర్భుక్తవర్జితంబుగఁ జరుపన్
నరు లాపుణ్యఫలంబున
హరిపురికే చనుచు నుందు రధికవిభూతిన్. 4

క. నాలోకంబున నిప్పుడు
భూలోకమునరుఁ డొకండు పౌడకట్టఁడు నే
నేలాగున యమలోకముఁ
బాలింపుదు హీనవృత్తిఁ బడఁగాఁ జాలిన్. 5

తే. నరకములయందు మున్నున్ననరులు దివికిఁ
జనిరి తత్పుత్త్ర పౌత్త్రులు సలుపు వ్రతమ
హాత్మ్యముఁ జేసి క్రొత్తసీరసుగుఁదెంచి
ప్రాఁతసీఁగును గొనిపోవుభంగి మీఱ. 6

సీ. విప్రాలయములందు విడిమట్టుగానుండు
వాని మంటలలోన వైవ లేదు
విప్రు నిందించంగ వినువాని చెవులందు
కఱకునారసములు పఱుప లేదు
విప్రుపై నలిగి యుద్వృత్తిఁ దిట్టినవాని
జిహ్వ మంగలకత్తిఁ జీఱ లేదు
విప్రుసొమ్ము భుజించు వృజినాత్మునుదరంబు
కఱకుఱంపంబులఁ జరుగ లేదు
తే. విప్రతతిమీఁద నధికారవృత్తిఁ దిరుగు
నధము నసిపత్త్రవనధారయంత్రతప్త
వాలుకా కుంభ శిఖి రౌరవములఁ ద్రోచి
భీకరంబైన బాధలఁ బెట్టలేదు. 7

క. దేవాధికారులను భా
ర్యాసక్తులను సురాలయంబున సురతం
బావర్తించిన హీనులఁ
బావకుగుండముల లేదు పడఁద్రోయంగన్. 8

చ. అనృతములాడినట్టి యధమాధమునాలుకఁ గోసివేయలే
దని శరణన్నఁ గావని దురాత్ముల నిప్పుల యేటిలోపలన్, ము
నుఁగఁగఁ ద్రోయు లేదు ఋణమూఁగొని పెట్టక పాయఁ ద్రోచుదు
ర్జనుఁ బురివెంట్లు చుట్టి పశుమంబునఁ గాల్వఁగ లేదు వీధులన్

క. రెట్టికి మిగులఁగ ఋణధన
మిట్టలమునఁ గొన్న పాపహృదయుని ప్రేగం
గట్టి వడి నినుపగుదియల
బిట్టరయఁగ మోఁద లేదు పేర్చి నరకమున్. 10

క. కొండీని మేను గ్రాఁగుచు
నుండిన తైలంబులోన నుడికింపఁగ లే
దొండబడఁ దిగిచి కండలు
ఖండింపఁగ లేదు దేవ! కనకాపహరున్. 11

క. గోవిప్ర స్త్రీ హత్యలు
గావించిన ఖలులు బ్రహ్మకల్పంబులు నా
నావిధ నరక శతంబుల
లో వడి వ్రేయంగ లేదలుక నిగుడంగన్. 12

క. విందనుచుఁ బెట్ట మానవు
లం దునిమిన పాపకర్ములను బరదారా
నిందితులఁ దప్తవాలుక
లం దీడ్వఁగ లేదు కన్నులను జలమొలుకన్. 13

సీ. పరిధాన మందిభూపతి కార్యతతిహాని
సేయు సజ్జుని పొట్ట చింప లేదు
పతిసొమ్ముఁ దిని యన్యపతికి లోఁజే యిచ్చు
కలుషచిత్తుని వహ్నిఁ గడుగ లేదు

బహుమానపాత్రుఁడై పతిభూమి యహితభూ
పతి కిచ్చు ద్రోహిఁ గాల్పంగ లేదు
పతి నిల్చినట్టిచో బల్మి నుండఁగ నోంటి
వచ్చినఖలుఁ ద్రుంచి వైవ లేదు
తే. పతికి మాఱిడి పతిమాట భక్తితోడఁ
జేయ నొల్లని తులువ నిగ్రహింప లేదు
ప్రజలతోఁ గూడి పతిసొమ్ము పరఁగఁ బంచి
కుడుచు నధములతల దెగఁ గొట్ట లేదు. 14

క. భూవరు దుర్గమునకు నై
చావక పగతురకు నిచ్చి సన్మానముతో
జీవించు నధమునురమున
గ్రావం బెత్తంగ లేదు కల్పాంతంబుల్. 15

క. పతి కవసర మగుచోటను
బతిముందఱ నిలువ లేక పాఱినభటులన్
జితిఁ గాల్ప లేదు భగ్న
వ్రతుఁ దోయఁగ లేదు ముళ్లరాసులమీఁదన్. 16

ఉ. చేసినధర్మముల్ హృదయసీమల సిగ్గొకయింత లేక యు
ల్లాసముతోడఁ జెప్పుకొను లక్షణహీనుల నోళ్లు గాలఁగా
సీసము వోయ లేదు సరసీరుహనేత్రలఁ బర్వరాత్రులం
డాసిన హీనులం ఘృతఘటంబుల వ్రేల్వఁగ లేదు నిర్దయన్.

క. వెఱవక బ్రాహ్మణకాంతలఁ
జెఱవట్టినక్రూరమతులఁ జిత్తజకేళిం
జెఱచినదారుణకర్ములఁ
గొఱతల వేయంగ లేదు గురుశౌర్యమునన్. 18

క. ధర్మంబు తప్పఁజెప్పిన
దుర్మార్గుల నరయఁగట్టి త్రోయంగా లే
దర్మిలి సేయక శంబర
నిర్ముక్తంబైన కూపనివహములందున్. 19

చ. మగనిమొఱంగి యన్యపురుషానవృత్తి రతినల్పుచుండున
మ్మగువశరీరయష్టిఁ గల మాంసము చెంపఁగ లేదు సోదరుం
బగ గొని రాజ్యలోభమునఁ బట్టి వధించినదుష్టకర్మునిన్
భగభగమండుచుంటఱకుఁ బట్టి కమర్పఁగ లేదు పద్మజా! 20

క. జనపతిచే దుర్దానము
గొని ధర్మవ్యయముసేయఁ గొలుపనిలోభా
త్ముని క్రిమికూపములోపల
నునుపంగా లేదు బాధ నొరలుచు నుండన్. 21

సీ. అసిపత్రవనములయందుఁ ద్రోయఁగ లేదు
విలపింపఁ గన్యకావిక్రయులను
దారుయంత్రముల నందందఁ ద్రిప్పఁగ లేదు
దారుణక్రియ గురుతల్పగులను
కూటశాల్మలులందుఁ గుదియఁగట్టఁగ లేదు
పాటిదప్పిన ధరాపాలకులను
గాలసూత్రముల వీఁకఁ గుదింపఁగా లేదు
పటుశక్తి విశ్వాసపాతకులను
తే. వహ్నికుండంబులను బడవైవలేదు
తల్లడంబందఁగా గ్రామదాహకులను
బెబ్బులులచేత వడిఁ గరిపింపలేదు
గరళ మన్నంబులో నిడ్డకష్టమతుల. 22

తే. పంక్తిభేదం బొనర్చిన పాపినోర
నిప్పు లిడలేగా లే దవనీసుపర్వ
తల్లిఁ జెల్లెలి గోవును దన్నినట్టి
క్రించుచరణంబు లలుక ఖండించివైవ. 28

చ. వదలక తీవ్రదాహమున వారికినై పఱతెంచుచోట న
ద్యుదకసరిత్సభూమినుగులొడ్డి మృగంబులఁ బట్టిచంపుదు
ర్మదులను దప్పి నాఁకటను వాఁడగ నెండలఁ గాళ్లు సేతులుఁ
గుదియఁగఁ గట్టి త్రోచినను గూడద దేమి త్రిలోకవందితా!.

క. ఉపకారము మఱచిన పా
పపునరుఁ డలక్రిందుగాఁగ బహువృక్షసపా
దపశాఖ వ్రేలఁగట్టఁగ
నిపు డేమియు దొరకకున్న దింద్రాదినుతా!. 25

క. హరిపాదభక్తులై యీ
శ్వరనిందయు శంభుచరణసంసేవకులై
హరినిందయుఁ గావించిన
దురితాత్ముల లేదు దప్పితోఁ గృశియింపన్. 26

క. ఫలవృక్షంబులు నఱికిన
ఖలులఁ దటాకములు పగులఁగాఁ జేసిన దు
ష్టుల గిరిశృంగంబులనిడి
దొలుసంగా లేదు దప్పితోఁ గృశియింపన్. 27

క. ప్రభునొద్ద నుండి సుజనుల
యభిమానముఁ దూలనాడి యధిపతి యిడున
య్యభిమతములు దప్పించిన
త్రిభువనకంటకుల లేదు తిత్తొలువంగన్. 28

ఉ. అన్నము వేదము౯ వెలకు నమ్మిన యాజ్ఞుల నోరఁ గ్రొత్తగా
సూన్నము నష్టయుం బలిమిఁ జొన్పఁగ లే దరగాసు విప్రుచేఁ
గొన్న వివేకశూన్యులను గొఱ్ఱులఁ బెట్టఁగ లేదు గోష్ఠముల్
దున్నినదోషి మేను బలుదూటులు పుచ్చఁగ లేదు ముప్పిరి౯

తే. ఆవులను బందెగొన దొడ్డినాఁగి నీరు
గసవు నిడనిజనంబు కల్గానుగలను
బాటిసేయనివానిఁ గుంపటులఁ గాల్పఁ
జదుపఁగా లేదు లేదు కుంచమును దూము. 30

క. అగ్రజుని బెండ్లిసేయక
వ్యగ్రతఁ దా మున్నుఁ బరిణయము నొందినదు
ష్టాగ్రసరు నీడ్వఁగ లే
దాగ్రహ మొదవంగఁ గర్కశావలిమీఁద౯. 31

చ. ఒకనిమిషార్ధదుఃఖమున కోర్చి నిశేశునితోడఁగూడి పా
యక యనలార్చులం దెగి మహావిభవంబున స్వర్గభోగ మొం
దక పతిఁ బాసి ప్రాణములు నమ్మిచరించువితంతుఁబట్టి పా
వకనిబిడోగ్రకుండముల వైవఁగ లేదు సహస్రవర్షముల్ 32

ఉ. దేవరతోఁటఁబువ్వులు దెచ్చి శిరంబునఁ దాల్చుకొన్న పా
పావహుఁ గాటశాల్మలుల యందుఁ బ్రాకఁగఁ ద్రోయ లేదు
చో, రావలినేలి విత్తము నహర్నిశము౯ హరియించుక్రూరు
ల౯, వారి నంధకూపముల వైవఁగ లేదు మహాగ్రహం [బున౯ 33

సీ. పరభామ నభిలాషపడి నిరీక్షించిన
దుర్మార్గు కనుదోయిఁ దొలుప లేదు
పరకళత్రము చేయి వట్టిన పాపాత్ము
కరముఁ గాకులగాల్లఁ గరప లేదు

పరసతివదనచుంబన మొనర్చిన దుష్కృ
తాత్ముపక్త్రమునఁ గొఱ్ఱుపము లేదు
పరుసియిల్లాలి లోఁబడఁ గాఁగిలించిన
తులువదేహంబులి త్రోలుపలేదు
తే. పరపయోరుహముఖకుచప్రాంతములను
నఖము డిగిచిన ఖలునివేల్పులుక లేదు
పరవధూమణిఁ బొందిన భాగ్యహీను
కోశ మసిధార మొదలంటఁ గోయ లేదు. 34

క. ఋతుమతియై యుండిన కుల
సతిఁ గనయుక వేఱె యొండుజలజాననతో
రతి సల్పిన భ్రూణఘ్ను
ప్రముఁ జెఱఁ బడఁ ద్రోయ లేదు ప్రక్కలువాఱఁగా. 35

క. ధరణీసురవృత్తులు దమ
పరిధానముతోఁ ఱుకు నడ్డపాటొనరుచు న
ద్దురితాత్ములఁ ద్రోయఁగ లే
దిరువదియొక నరకముల ననేకాబ్దంబుల్. 36

చ. జనకునిఁ దల్లి నగ్రజుఁ బసన్నులఁ జేయుక హీనవృత్తిఁ గ
న్గొనిననుపాపగాధితలఁ గొడ్డఁట ప్రక్కలు వాపలేదు లే
దనవరతంబు వల్లభుని నప్రియభాషలఁ దూలనాడు దు
ర్వనితముఖంబుగాల్చికరవాలున మాంసముచెండి వేయఁగా. 37

క. గురునిందాపరుల ద్విజా
సురతపరాయణుల శునకసూకరరతులా
పరుల నసిపత్రగహనాం
తరముల వడిఁ ద్రోయ లేదు తాసురసభవా! 38

ఉత్సాహ. నదులలోఁ దటాకముల వనంబులందు దేవతా
సదన కూప గోష్ఠ బిల కులస్థలంబులందు దు
ర్మదమునన్ మలంబు విడిన మానుషాధముల భయం
బొదవఁ గదలఁ దలలమొదడు లొలుక నడవలే దొగిన్. 39

క. కాలినయుమ్ములఁ జిల్లల
కోలల విషయుక్తమైన గురుశరములచే
వాలముఁ జేసిన క్రూరులఁ
దేలింపఁగ లేదు యినుపపెనములమీఁదన్. 40

తే. అశుచి యై యుండి గో విప్రహవ్యవహుల
నంటుకొను ఖలుకరముల నట్లు సూర్య
చంద్ర తారలఁ గనుగొన్న జడుని కన్ను
లనలములఁ గాల్ప లేదు భాషాధినాథ!. 41

క. కలకొలఁది శ్రాద్ధకాలం
బులఁ బితృదేవతల భక్తిఁ బూజింపనిక
ర్మలఁ గాలపాశముందునఁ
బొలియఁగ నునుపంగ లేదు భువనశరణ్యా!. 42

క. అమవసల నేలువూన్చిన
కుమతులఁ దద్వాసరమునఁ గ్రూరతఁ దరువుల్
సమయించిన యవివేకులఁ
గమలోద్భవ! ద్రోయ లేదు గరళములందున్. 43

క. తనవెనుక భీతిఁ బొందిన
జనునిన్ రక్షింపలేక శాత్రవునకు న
ప్పనఁ జేసిన యధమాధముఁ
గనియలుగాఁ గోయ లేదు కరపత్రములన్. 44

ఉ. శ్వానము కోడి జేడి వ్యభిచారి ననాఘకు నూరఁబంది ము
 ష్టైనసతి న్సురాపుని నిజాన్వయదూరు నశౌచు నూతకున్
 బీనుఁగు నెల్క గార్దభముఁ బిల్లిని నూసరి నంటినప్పుడే
 స్నానము సేయఁడాఖిలునజస్రముఁ ద్రోయఁగ లేదునగ్నులన్

మ త్త. చిత్రగుప్తుఁడు వ్రాఁత వ్రాయఁగఁ జేతులాడక యింటిలోఁ
 జిత్ర మాకులు ఘంటము న్నిరసించి పారఁగ వైచె నా
 పత్రముల్ శిథిలంబులై యసిపత్రకాననముల్ దివా
 రాత్రు లూరక పాడి చెప్పఁగ రాదు పంకజసంభవా! 46

మ త్త. కాలదండము త్రుప్పువట్టెను ఘాతుకక్రియ నిస్సిరో!
 కాలపాశము కచ్చువిచ్చె నఖర్వవిక్రమ మొందఁగాఁ
 గాలకింకరకోటిభీకరగర్వ మెల్ల నణంగె నీ
 కాల మేటి యమాధికారము గైకొనుండు సమస్తమున్.

సీ. అని విన్నవించిన యమునివాక్యము లెల్ల
 విని పద్మభవుఁడు మున్నన యెలర్ప
 నోదండధర! రాజ్య మొప్పగింపఁగ నేల
 ధాత్రీశ్వరుఁడు సల్పుఁ దద్వ్రతంబు
 భంగి యట్టిన యందు భస్మంబులోఁ బాత
 కము లెల్ల నీ కెఱుంగనివి గలవె
 హరికిఁ బ్రాణంబు శ్రీహరివాసరవ్రతం
 బది యణంచినఁ గాని యనఘ! నీదు

తే. భూమి యభివృద్ధిఁ బొందన దాపుణ్య మెట్లు
 కుంఠితము సేతుఁ జేసిన గోత్రధరుఁడు
 కినియ కూరక యెట్లుండు కినిసె నేని
 వలవ దదియడ్డ వెట్ట నెవ్వారివశము. 48

గీ. ఒక యుపాయంబు గల్పించి యుచితభంగి
నవనినాథుఁడు గావించు నావ్రతంబు
మఱచి యుండెడు నట్లుగా నెఱయఁ జేతు
శమన! సంతసమందు విచార ముడిగి. 49

ఉ. శ్రీహరిఁబోలుదైవమును శ్రీహరిభక్తులఁబోలు మానవుల్
శ్రీహరివాసరవ్రతవిశేషఫలంబునుఁ బోలు ధర్మసం
దోహము లేదు సన్నుతముగా హరిఁ గొల్చిన వారికెల్ల సం
దేహము లేదు చేకురు ననేకశుభోన్నతభోగమోక్షముల్. 50

క. పావనములు కలివిషసం
జీవనములు విజితమృత్యుజీవనములు భృ
త్యావనములు చింతితసం
భావనములు వాసుదేవు పదసేవనముల్. 51

క. స్ఫురితంబులు దూరీకృత
దురితంబులు మృత్యుభయవిదురితంబులు భూ
భరితంబులు పాతకగ
త్వరితంబులు చక్రపాణివరచరితంబుల్. 52

సీ. తలఁచినయంతనే ద్రౌపదిమానంబు
నిలుపఁడా యక్షయవలువ లొసఁగి
శరణన్నమాత్రానఁ గరిరాజుఁ గావఁడా
ఘనచక్రధార నక్రంబు దునిమి
కలఁడన్నమాత్రనె కలుగఁడా' కంబంబు
నందుఁ బ్రహ్లాదుఁ డానంద మొందఁ
గనుఁగొన్నమాత్రనె కట్టఁడా పట్టంబు
రావణానుజుని దద్రాజ్యమునకు

తే. శ్రీహరికి సాటిదైవంబు సృష్టిఁ గలఁడె
హరి ప్రమోదించుఁ జేకుగు నధికమహిమ
హరికిఁ గ్రోధంబు రా నెవ్వఁ డాచరించు
వాఁడు నిలుచుట యరుదు జీవంబుతోడ. 53

సీ. జలజాక్షు పదపంకజములు పూజింపఁగా
వలవదా! చేతులు గలుగుఫలము
శేషశాయికిఁ బ్రదక్షిణ మాచరింపఁగా
వలవదా! పదములు గలుగుఫలము
దితిజాంతకుని దివ్యదేహంబు గనుఁగొన
వలవదా! కన్నులు గలుగుఫలము
నలిననాభుని దివ్యనామముల్ వినుతింప
వలవదా! నాలుక గలుగుఫలము
తే. కనకపీతాంబరుని దివ్యకథలు వినఁగ
వలవదా కర్ణపుటములు గలుగుఫలము
భక్తితాత్పర్యముల యదుపతికి మ్రొక్క
వలవదా! యుత్తమాంగంబు గలుగుఫలము. 54

సీ. ఉపవాసములు నుండి వొలయు నెండల నెండి
వాయుభక్షణ సేయవలదు సుమ్ము
పశుమారణకు నోర్చి బంగారు వోకార్చి
వాజిమేధము సేయవలదు సుమ్ము
తలయెల్ల జడకట్ట నలమైన చలివెట్ట
వడిఁ దీర్థములఁ గ్రుంకవలదు సుమ్ము
బలుఘట్టములు నొవ్వఁ గలపాపములు నొవ్వ
వారణాసికిఁ బోవవలదు సుమ్ము

తే. సత్యపావర్తి దేవతాచక్రవర్తి
శ్రితజనాధారు నఖిలదుష్కృతవిదూరు
నామకీర్తనె చాలుఁ బుణ్యములు మేలు
ఘనతరంబైన పాపసంఘముల నణఁప 55

క. ఆమాలికము శ్రీతులసీయుఁ
దామరసదళాక్షమూర్తి తా తా మగుటం
గామితము లిచ్చు నరులకు
శ్రీమిగులంగఁ జెరి సేవఁ జేసినమాత్రన్. 56

తే. అమృతసాగరమధ్యంబునందు శేష
తల్పమున శయనించియు దానవారి
నిద్ర మేల్కాంచి యుండిననెల సమస్త
పుణ్యసముదాయముల కెల్లఁ బుట్టినిల్లు. 57

సీ. కార్తికమాస మాఘస్నానమునఁ బాయు
బహుజన్మజనితపాపవ్రజంబు
కార్తికమాస వికాసదీపమునందు
భస్మంబు లౌ నఘప్రతతు లెల్లఁ
గార్తికమాస భాస్కరనమస్కారంబు
లను మహాదురితజాలంబు లణఁగుఁ
గార్తికమాస గోకణపూజఁ దాపత్ర
యానేకదోషంబు లడఁగఁ జేయుఁ

తే. గార్తికమునందు శుక్లపక్షమున ద్వాద
శీదినంబున శ్రీమూర్తి మేదినీసు
పర్వనకు దాన మిచ్చిన భవ్యుఁ డొందు
దివ్యకైవల్యపట్టాభవ్యసుఖము. 58

మ. తిలదానంబు ప్రవాహతీర్థమునఁ భూదేవౌఘసంతర్పణం
బులు లక్ష్మీలలనామనోహరువ్రతంబుల్ తత్కథాకీర్తనం
బులు పాలాశపవిత్రపాత్రల దినంబుం భుక్తి కావించుటల్
వలయుం గార్తికపుణ్యమాసమునఁ గైవల్యంబపేక్షించినన్.

చ. మకరమునం బ్రయాగమున మాఘమునల్పిన నశ్వమేధపం
చకఫల మబ్బునబ్బునొక స్నానము గౌతమినారియందుఁ గా
ర్తికమున నాచరించినఁ దదీయసహస్రగుణంబుఁ గార్తిక
ప్రకటమహత్త్వసంపదలు ప్రస్తుతిసేయవశంబె యేరికిన్. 60

ఉసిరికక్రింద దామోదరు సర్చింపఁ
గలిగినఁ గల్గు సంకల్పసిద్ధి
యుసిరికక్రిందఁ బొల్పెసలార భుజియింపఁ
గలిగినఁ గల్గు శ్రీకాంతునగరు
ఉసిరికక్రిందఁ జేయుజపంబు లణుమాత్రఁ
గలిగినఁ గల్గు నఖర్వమహిమ
యుసిరికకడభూమి యిసుమంత దానమీఁ
గలిగినఁ గల్గు లోకత్రయంబు

తే. ఉసిరికలక్రింద జాగరం బుండి యుండి
కాయలను దీర్థమాడంగఁ గలిగెనేని
గలుగుఁ గైవల్యకామినీకనకకుంభ
కలితశ్రీమార్గముల నుండుఘనత మఱియు. 61

తే. కార్తికమునందు నుసిరికకాయ లొక్క
దోసెఁ డించుకహేమంబుతోడఁ గూర్చి
ధరణిసురునకు నెవ్వఁడే దానమిచ్చు
నతఁడు శ్రీవిష్ణులోకంబునందు నుండు. 62

ఉ. స్నానము సంధ్యయుం జపము శాశ్వతహోమము దేవపూజ
యుక్, దానము భూసురార్చనసువ్రతంబులు నక్షము లేక
భుక్తముల్, భూనుత వేదపారముతపో మహిమంబులుం గా త్రి
కంబునక్, భానుతనూజ! యొక్కట శుభస్థితిఁ గోటిమునుం
[గూడై తగున్ 63

సీ. శ్రీతులసీవన శ్రీవితరణము తులా
పురుషదానసమగ్ర పుణ్య మొసఁగు
శ్రీతులసీప్రదక్షిణ మశ్వమేధాధ్వ
రానేక ఫల మిచ్చు నతిశయముగ
శ్రీతులసీతీర్థసేవ గంగాతీర్థ
శతగుణంబుల నిచ్చు సంతతంబు
శ్రీతులసీదళాంచితధారణము నిఖి
లావనీద త్తసౌఖ్యంబు సేయుఁ

తే. దులసిపూసల జపమాలికల జపంబు
లొకటి కోటిమునుంగు లై యొనరుచుండుఁ
దులసికిని ముగ్గువెట్టిన జలజముఖుల
కిందిరాదేవిసామీప్య మందఁ గలుగు. 64

వ. అని పలికి మఱియును. 65

తే. ధరణి నెన్నంగఁ దగు మహాదానచయము
లెన్ని గల వన్నిటికి నెక్కుడన్నదాన
మర్కనందన! యది యెవ్వఁ డాచరించు
నతనిజన్మంబు జన్మంబు మతిఁ దలంప. 66

సీ. అధికదూరాయాతు నక్షాతిథులుఁ బథ
శ్రమసముద్భవఘర్మజలసమగ్రు

ధూళిధూసరితగాత్రుఁ క్షుధానుధ్వాధ్వ
కాలసమాగతక్ష్మాసుపర్వ
నల్లంతటను జూచి యతినికులాచార
వర్తన లరయ కేమూర్తినున్న
శ్రీవిష్ణు వని యాత్మఁ జింతించి యత్యంత
భయభక్తి వినయసంభ్రమము లెసఁగ

తే. నెదురుగాఁ దోడుకొనివచ్చి యుదక మిచ్చి
యాసనం బిచ్చి యన్నపానాదు లొసఁగి
విశ్రమింపంగ ననువు గావింపవలయుఁ
బగటివేళయు మాపు నభ్యాగతులకు. 67

క. శ్వానమునకుఁ జండాలున
కైనను నాఁకొన్నఁ బెట్టఁ దగు నన్నము తా
నైనను మానితుఁ గాఁ గ
జ్ఞానమునం గడప మిగులఁ గల్మష మొందున్. 68

క. జలమొండె తక్రమొండెను
ఫలమొండెను శాకమొండె భయభక్తి నిడన్
వలెఁగాని యతిథి నూరకె
నిలయము వెడలింపరాదు నిర్దయుఁ డగుచున్. 69

క. ఏగృహపతిచే నటు ల
భ్యాగతుఁడు తిరస్కరింపఁబడుఁ దనదురితం
బాగృహపతికిం జను న
భ్యాగతుఁడుఁ దదీయసుకృత మంతయుఁ గొనుచున్. 70

క. మాపటియతిథిం గడపిన
పాపమునకు మితములేదు భానుజ! యతనిం

గోపింపక భోజన శయ
నోపేతముగాఁగఁ బూజ యొనరింప నగున్. 71

క. వాకిట నిలిచిన యతిథికి
నాఁకలిఁ దీర్పక భుజించు నజ్ఞుఁడు నరకా
నేకశతంబులలో నతి
శోకంబున మలము మెసఁగుచున్ వసియించున్. 72

క. కావున నతిథిని గడుపఁగ
వావిరి నిరతాన్న మొసఁగు వాని ల్లిల్లా
పావనజన్మము జన్మము
భావింపఁగ వానిబ్రతుకు బ్రతుకు ధరిత్రిన్. 73

క. ద్విజుఁడైన నన్నమిడఁ డే
కుజనుం డని తలఁపవలదు కుజనుం డైనన్
ద్విజులకు నన్నం బొసఁగిన
ద్విజవంశశ్రేష్ఠుఁ డనుచుఁ దెలియఁగవలయున్. 74

సీ. పనిలేదు కులశీలభావంబు లెఱుఁగంగ
నన్నదానముసేయు నధికపుణ్యుఁ
దగవుగా దాచారధర్మంబు దలపోయ
నన్నదానముసేయు నధికపుణ్యు
సత్యశౌచములు విచారింపఁ బాటిగా
దన్నదానముసేయు నధికపుణ్యు
వర్తనం బడుగంగ వలువ దేక్రియ నున్న
నన్నదానముసేయు నధికపుణ్యుఁ

తే. బరుసమును సోఁకి లోహంబు పసిఁడియైన
పగిది నిరతాన్నదానసౌభాగ్యమహిమఁ

బాపములు వాసి పుణ్యసంపదఁ దనర్చు
నతికృతార్థుని మార్గంబు లరయఁ దగదు. 75

సీ. అన్నదానముసేయు ననఘుఁ బ్రాతర్గకాల
మునఁ దలంచిన దోషములు నశించు
నన్నదానముసేయు నమలచారిత్రుని
గనుఁగొన్నఁ గలుషవర్గము లణఁగు
నన్నదానముసేయు నతికృతార్థునితోడ
భాషింపఁ దొలఁగుఁ బాపవ్రజంబు
నన్నదానముసేయు నధికపుణ్యునిపాద
ధూళి సోఁకినఁ బాయు దురితచయము

తే. నన్నదానంబు నిరతంబు నాచరించు
పరమపావనశుభగాత్రుపంక్తియందు
భోజనము సేయువారికి భూప్రదక్షి
ణం బొనర్చినయట్టిపుణ్యంబు గలుగు. 76

సీ కడజాతివాని యాఁకలి దీర్చినయతండు
కర మర్థి స్వర్గలోకమున నుండుఁ
గృపఁ జతుర్థునకు నోగిర మిడ్డ ధన్యుండు
తపనలోకమున మోదమున నుండు
నన్నంబు వైశ్యున కర్థిఁ బెట్టినవాఁడు
చంద్రలోకమునఁ దేజమున నుండు
నృపకులోద్భవున కన్నిక భుక్తి యొసఁగిన
ఘనుఁడు వైకుంఠలోకమున నుండు

తే. బ్రాహ్మణుని భోజనమున నాప్యాయనంబు
నొందఁజేసిన పుణ్యాత్ముఁ డూర్జితముగ

సమర గంధర్వ యక్ష సిద్ధార్క సోమ
కామహార సత్య విష్ణులోకముల నుండు. 77

క. నిరతాన్నదాన మొసఁగెడు
నరునింట జనించుపరిజనమ్ములు కూడన్
నరకముల తెలవు చూడక
హరిలోకమునందు నుందు రధికవిభూతిన్. 78

మ. గ్రహవక్రత్వము మాను పీడలణఁగున్ గర్మక్షయంబొందు
వి, గ్రహముల్ రా వపమృత్యుదోషములు వేగం బాయు
భూపత్యను, గ్రహము ల్గల్గు ననిందయుం బొదవు లోకఖ్యా
తి చేకూరుఁ బ్ర, త్యహముఁన్ దీనుల కన్నదానమిడు పుణ్యా
|ప్రాణికిన్ సూర్యజా!. 79

చ. శరధితరంగమాలికలు సైకతజాలము లభ్రసింధుశీ
కరములు వర్షధారలు జగన్నుతతారకముల్ గణింపఁగా
నరిది యనంగ వల్వ దవిధ్యైనగణింపఁగ వచ్చుఁగాని యో
తరణిజ! యన్నదానసుకృతంబుగణింపఁగరాదు లేశమున్.

చ. కపిలలు కాలచక్రములు కాంచనశైలము లశ్వమేధముల్
తపములు స్వర్ణధేనువులు దైవనివాసము లీశ్వరార్చనల్
జపములుకూపముల్ నిధులుసామజఘోటకముఖ్యదానముల్
తపనజ!యన్నదానసుకృతంబుశతాంశముఁబోలవెన్నఁగన్.

చ. వరుణుఁడు వంపెఁ బంపె గిరివైరి కుబేరుఁడు వంపె భా
స్కరుఁడుడురాజువంపెఁబురశాసనుఁడంపెనజుండువంపెమం
దరధరుఁడంపెనంచును బ్రధానవిమానము లన్నదాతకున్
బరువడిఁ జూపియెక్కుమనిపల్కుదురంత్యమునందు దేవతల్

క. ఇనతనందన! నీలోకం
బునకుం జనకుండునట్టి పురుషుల నిఁక నే
వినిపించెదఁ దెలియంగా
వినుమని శమనునకు విశ్వవిభుఁ డిట్లనియెన్. 83

శా. కాంచిస్థానము కుంభకోణమును గంగాద్వారముల్ సేతుత
త్పంచాస్యాచలముల్ గయావటము నంతర్వేదియుల్ మా
యయుం, బంచారామము లయ్యహోబలము బ్రహ్మక్షేత్ర
ముం గాశిఁ ద, ర్శించం గల్గినవారు నీనగర మీక్షింపంగ
[రా రెన్నఁడున్. 84

శా. శ్రీకుల్యంబును నైమిశంబును గురుక్షేత్రంబుఁ గేదారముల్
గోకర్ణంబునవంతియుల్ మధురయుల్ గోణార్కమున్ద్వారకా
ప్రాకారం బరుణాచలంబును హరగపాపంబు శ్రీశైలముల్
సాకేతంబునుజూచి చూడరుమనుష్యశ్రేణినీ సూర్యజా!.

తే. చంపకారణ్య బదరికాశ్రమములందు
నూర్జితంబుగ శ్రీపురుషోత్తమమున
శ్రీహరిద్వారమున నొకరేయి నిద్ర
సల్పి నీలోక మీక్షింపఁ జనరు నరులు. 86

చ. సరయువునందు వేగవతి జాహ్నవి వర్మద తుంగభద్రఁ బు
ష్కరణులఁజంద్రపుష్కరణి గౌతమి బాహుద కృష్ణగండకీ
వరుణల గోమతిన్ యమున వంజులసాగరసంగమంబులన్
బురుషుఁడుతీర్థమాడిననుఁబూనికనుంగొనఁదర్కనందనా!.

సీ. సత్యమేమియు లేని జగతీసురార్భకుఁ
జేపట్టి యుపనీతుఁ జేసినతఁడు

ధనహీనుఁడైన యుత్తమవంశసంభవుఁ
జిరకృపామతిఁ బెండ్లిఁ జేసినతఁడు
వృత్తిహీనుఁడైన విప్రవర్యునకు సత్
క్షేత్రంబు దానంబుఁ జేసినతఁడు
తీర్థంబులకు నేఁగు దీనమానవులకు
నెమ్మైనసంబళం బిచ్చినతఁడు
తే. చంపఁ దెచ్చిన ప్రాణిఁ బ్రసన్నబుద్ధిఁ
జంపకుండంగ సంరక్ష సలిపినతఁడు
చక్రహస్తుని వ్రతములు సలిపినతఁడు
వనజహితపుత్ర! నీపురంబునకు రాఁడు. 88

సీ. సాధ్వసంబున రిపుల్ శరణంబు వేఁడిన
నభయదానం బిచ్చునట్టివారు
ఘర్మకాలమున గోగణమున కుదకంబు
చేఁదిపోయించిన శిష్టజనులు
దేవసద్మములు భూదేవసద్మంబులు
జీర్ణత్వ ముడిపిన సిద్ధమతులు
తల్లిదండ్రుల నిరంతరము జరావేళ
నరసి పోషించిన యార్యహితులు
తే. నృపతికడనుండి యాగ్రహ నిగ్రహంబు
శాంతమును నొందఁ జేసిన సదయహృదయు
లంబురుహమిత్రపుత్ర! నీయామ్యదిక్కు
స్వప్నమున నైనఁ గనుఁగొంట సందియంబు. 8

శా. ఓకంజాప్తతనూజ! నీమదకరాళోగ్రక్రియాసైరిభో
త్సేకగ్రీవతలప్రకల్పితభయోద్రేకస్ఫురద్ఘంటికా

నీకానేకఘణంఘణప్రళయనిర్ణిద్రధ్వనుల్ వీనులం
దాకర్ణింపఁడు పద్మనాభుపదపద్మారాధకుం డెన్నఁడున్.

సీ. నడువఁడు నీపట్టణప్రాంతమునకు మం
దరధరధ్యానతాత్పర్యనిరతుఁ
డరుగఁడు నీవేలుయాంచ్యదేశమునకు
బలిభిత్ప్రసాదైకభాజనుండు
చనఁడు నీపురికి నై జలశాయిశ్రీపాద
వనజాతతీర్థసేవారతుండు
కనుఁగోఁడు నీలోకఘంటాపథశ్రేణి
హరినామసంకీర్తనాన్వితుండు
తే. చూడఁ డెన్నఁడు నీలోకశుభ్రహర్మ్య
కల్పితోత్కటబహుపతాకవ్రజంబు
పద్మవనవాసినీమనఃపద్మనిలయ
సకలసేవాన్వితుం డైన సజ్జనుండు. 91

క. జలజాక్షు శంభు పూజన
లలరించు కృతార్థులకుఁ బ్రియంబునఁ బుష్పం
బులు ధూపంబులు దెచ్చిన
చెలువుఁడుఁ దానకపురంబు చెందఁడు జగతిన్. 92

క. దేవాలయంబు దుడిచిన
పావనునకు నందు నెన్నిపాంసువు లెగయున్
వైవస్వత! యన్నేఁడులు
శ్రీవైకుంఠమున నతఁడు చెలఁగి వసించున్. 93

తే. జలము లొాకకొన్ని చిలికించి చెలువుమిగుల
హరినివాసంబు నునుపుగా నలుకు నెవ్వఁ

దతఁడు నిన్నుఁ దక్క వసియించు హరిపురమున
వేయుకల్పంబు లత్యంతవిభవ మలర. 94

ఆ. హరునిమందిరంబునందైన మ్రుగ్గు శ్రీ
హరినివాసభూమియందునైన
పద్మ మొక్క టిడిన భాగ్యుండు పద్మాబ్ద
ములు ముకుందలోకమున వసించు. 95

ఆ. ఆలపాల నారికేళోదకంబుల
నిక్షురసముచేత నీరు నైన
నబ్జనేత్రు నైన నభిషేక మొనరించు
జనుఁడు నీపురంబుఁ గనుఁగొనండు. 96

సీ. ఎట్టైన నొకపుష్ప మిందురేఖామౌళి
యుత్తమాంగమునందు నునిచినతఁడు
చల్లఁగా మందువేసవిఁ ద్రియంబకునకు
వసుధారబిందెయు నొసఁగినతఁడు
భవుశరీరమ్ము వాయువు సోఁకునట్లుగా
ధృతిఁ దాళవృంతంబు ద్రిప్పినతఁడు
కర్ణద్వయము కరాగ్రములందు ధరియించి
నృత్య మీశ్వరునెదుట నెరపునతఁడు
తే. హరునిసముఖంబునందుఁ బ్రయత్న మలర
నిమిషమాత్రంబు దీపంబు నిలిపినతఁడు
శివునిగేహంబునకుఁ బ్రదక్షిణము సలిపి
నతఁడు నీపట్టణము చూడఁ డర్కపుత్ర!. 9

క. గొడుగులును బాదరక్షలు
జడపాత్రలు వేసవులను సద్ద్విజతతికిన్

కడుభక్తి దాన మొసఁగినఁ
బుడమిజనుల్ రారు నీదు పురమున కనఘా!. 98

క. అనలముఖంబునఁ బతితోఁ
జనిన వధూమణులు సర్వసంగత్యాగం
బొనరించిన సంయములును
గన రెన్నఁడు నీపురంబు కంజాప్తసుతా!. 99

క. ప్రజ లేఁగుత్రోవఁ జప్పరము శీతలముగాఁ
గట్టించి యుదకంబు వెట్టినతఁడు
పులికి లోఁబడి చలింపుచునున్నచోట బె
బ్బులిఁ దోలి ధేనువుఁ బ్రోచునతఁడు
దుర్భిక్షవేళలందునఁ బట్టెఁ డన్నంబు
కృపఁ బెట్టి యతిథి రక్షించు నతఁడు
కుంఠితం బైనచోఁ గురుబుద్ధి మైకొని
ధృతి విచారంబు హత్తించినతఁడు

తే. అగ్నిభయమైనతఱి నాలయంబు సొచ్చి
ద్రవ్యములతోడఁ బ్రాణుల దహనమునకుఁ
జిక్కకుండఁగఁ దెచ్చిన చిరయశుండు
చూడఁ డెన్నండు నీమోము సూర్యపుత్రి!. 100

సీ. పసులకై కుయివోయి పరులశస్త్రములచే
ననిలోన సమసిన యట్టివాఁడు
పరువ దోఁచఁగ నడ్డపడి దురాత్ములబిట్ట
దెఱలించి వారిచేఁ దెగినవాఁడు
ద్విజులబాధింపంగ వెఱవకుండని వాఱి
బందికారులచేతఁ బడినవాఁడు

చెఱఁబట్టుకొనిపోవ నుఱికి భూప్రజఁ గాచి
రిపులచేఁ గెడసిన విపులయశుఁడు
తే. దళము విరిగినచోటను ధవునిపిఱుఁద
నిలిచి శత్రుల కెదురేఁగి నృపతి మెచ్చఁ
బోరి రణవీథిఁ దునిసిన పుణ్యయుతుఁడు
దినకరాత్మజ! నీపురంబునకు రాఁడు. 101

శా. ఆచంద్రార్కముగా మహాకృతులు నెయ్యంబారఁగా నందియీ
క్ష్మాచక్రంబున నిత్యకీర్తులఁ బ్రశస్తం బొందుదాతల్ కళా
ప్రాచుర్యస్థితి శంకరాచ్యుతకథాభంగుల్ ప్రబంధంబులన్
వాచాప్రౌఢిని నొనర్చు సత్కవులు నిన్నర్థింతు రెక్కాలమున్.

సీ. కలకాలమును బరాంగనలఁ జెల్లెండ్రఁగా
నాత్మలో భావించు నార్యహితులు
పరుల యర్థములు స్వప్నంబులో నైనను
నంటఁగా నొల్లని యమలమతులు
మఱచి తప్పియును ధర్మంబునందుఁ దొలఁగి
యనృతంబు లాడని ఘనవివేకు
లఖిలజీవులయందు ననుదినంబును గృపా
రసభావ మెడలని యసమసుకృతు
తే. లాశ్రితుల బంధువర్గంబు నతిథిజనుల
నరసి సంరక్ష యొనరించు నఘవిదూరు
లాత్మశుద్ధి దనర్చు మహానుభావు
లర్కనందన! నీపురి కరుగు దేరు. 10

### కవిరాజవిరాజితము.

పనసలు నిమ్మలు మామిడిఫలంబులు
పాటలముల్ వకుళంబులు కాం
చనములు నారికెళంబులు నీడలు
చంపకముల్ సురపొన్నలు చం
దనములు తాల రసాల తమాల క
దంబ సురంగము లంగముగా
వనములు వెట్టిన ధన్యులు నీదుని
వాసముఁ గన్గొన రర్కసుతా!. 104

సీ. నైవేద్యములు లేని దైవంబులకు నుప
హారముల్ గల్పించునతఁ డొకండు
పగవానిరాజ్యంబుపై దండుచన్నచో
భూమిఁ గారింపని పుణ్యుఁ డొకఁడు
వ్యాధిచేఁ బలవించువారి కౌషధ మిచ్చి
యారాట ముడిపిన యతఁ డొకండు
గోగణంబులలోన గోవు నొక్కటి నేర్చి
జన్నచేసిన ధర్మశాలి యొకఁడు
తే. గ్రహణసంక్రాంతి ముఖముఖ్యకాలములను
పితరులకుఁ బూజ గావించు నతఁ డొకండు
కన్నసా మ్మిందమని యిచ్చు ఘనుఁ డొకండు
కనఁడు నీ వేలుపట్టణం బినతనూజ! 105

సీ. చలమనీరున నదీజలములందైన స్నా
నంబు మాఘమునం దొనర్చినతఁడు

సంతతంబును విశేషముపదార్థము నిజా
చార్యసద్మమునకు జరిపినతఁడు
స్థితిఁ దప్పి యరుగుదెంచిన భూవిభుని దొంటి
స్థితి దృఢంబుగఁ బ్రతిష్ఠించినతఁడు
కాశి గయా ప్రయాగల ముఖ్యమగునట్టి
మహిమసుంకంబులు మాన్పినతఁడు

తే. అమర నొకరేయి తగిన ప్రయత్న మలర
నిజగృహంబున ధారుణీనిర్జరునకు
శయన మర్పించినటువంటి సజ్జనుండు
చూడఁ డెన్నండు నీమోము సూర్యపుత్ర!. 106

క. చెఱువులు గట్టినపుణ్యులు
దరపక ధాన్యమ్ము లమ్ము ధన్యులు ప్రజలన్
జెఱ విడిపించిన సుకృతులు
నెఱి నర్కతనూజ! రారు నీపురమునకున్. 107

మత్త. తాళవృంతము లాతపత్రవితానముల్ ధ్వజచామరాం
దోళికల్ రథదర్పణంబులు తూర్యతల్పచయంబు హే
గ్గాళియుల్ బహువస్త్రభూషణగంధముల్ హరికర్పణం
బోలిఁ జేసినవారు నిన్గన నొల్లకుందురు దర్కజా!. 108

వ. మఱియు నగ్నిష్టోమ వాజపేయా తిరాత్ర యాప్తోర్యా
మములను సప్తతంతులు నాచరించిన కృతార్థు లాపురుష
తిలపర్వత శ్వేతాశ్వ మహామేరు సప్తసాగర హిరణ్యగర్భ
కార్పాసాచల కపిల ధేను రజతశైలాగ్ర హారార్ద్రకృష్ణా
జిన సాలగ్రామ శివలింగ శయ్యా శకట గృహ మహిష
గుడ లవణాజ్య కన్యా విద్యా దానంబులు మొదలైన మ

హాదానంబు లొనర్చినపుణ్యులు శ్రీలక్ష్మీనారాయణానం
తోమామహేశ్వర కృష్ణాష్టమీ కృష్ణచతుర్దశీ చాంద్రా
యణ సోమవార శనివారాది వ్రతపరాయణులును, దేవ
బ్రాహ్మణప్రతిష్ఠాపనావనాపరులునునీపురంబునకరుగు దేరరని
భారతీజాని ధర్మరాజున కెఱింగించి మహాత్మా! యిపుడు నా
చేతం జెప్పంబడిన శ్రీవిష్ణుమాహాత్మ్యంబును నామలకతులసీ
కార్తికవిశేషంబులు నన్నదానప్రభావంబును సకలధర్మా
దికంబును నిరంతరంబును దాత్పర్యంబునం బఠియించు
వారికి వినువారికిం బుస్తకంబున లిఖించువారికి నాయు
రారోగ్యైశ్వర్యాభివృద్ధియుఁ బుత్రపౌత్రసమృద్ధియుఁగైవ
ల్యలక్ష్మీసౌఖ్యంబునుం గల్గునని యానతిచ్చి. 109

ఉ. ఎన్నఁగఁ గల్గుదానము లనేకము లిద్దర నందులోన న
త్యున్నతభోగమోక్షమహిమోదయలక్ష్ముల నెల్లనాఁ డవి
చ్ఛిన్నవిభూతితో నొసఁగు శ్రీహరివాసరసద్వ్రతంబు వి
ద్వన్నుత! భాగ్యహీనునకుఁ దానొనగూడఁగ నేరదెన్నఁడున్.

క. పితృనాయక! హరిదివస
వ్రతమే యుక్తంబు భూమివలయంబున నా
వ్రతమున కితర వ్రతములు
మతిఁ దలపోయంగ హస్తిమశకాంతరముల్. 111

చ. అని తెలియంగఁబల్కి వినయంబున నంతకు వీడుకొల్పి య
వ్వనరుహసంభవుండు చెలువంబుగలంతయునొక్కరూపుగా
మునుకొని కూర్చి తా భువనమోహినిమోహినినాఁగ నొప్పు
నం, గన సృజియించె నిర్జరనికాయము లద్భుతమంది
[చూడఁగన్. 112

సీ. తలిరులు ఘులులు రత్నములు తారలు వట
 ఫలములు దొన లనంటులు పులినము
గావాకు సుడి బయల్ రాహు తరంగలు
 కరికుంభములు తూండ్లు కనకగుహలు
జలజముల్ పెసరుగాయలు కల్య రేకులు
 కంబు వద్దంబు బింబంబు మల్లె
మొగ్గలు శ్రీకారములు చంపకము మీలు
 చాపముల్ నెల యలుల్ చందుగుండు
తే. తమము మరున త్తపలకనఁ గ్రమముతోడ
నమరి ముప్పదిరెండంగకముల వెలసె
సమదగజయాన కలకంఠి స్వర్ణవర్ణ
నీరజామోద యమ్మోహినీవధూటి. 113

సీ. పదతలంబుల కెంపు పద్మరాగప్రభా
 సముదయంబుల నెకసెక్క మాడఁ
దెలిగన్నుఁగవడాలు తొలుకారు మెఱుఁగుఁదీఁ
 గెల మాలికలతోడఁ గలసి మెలఁగ
ముద్దుఁజెక్కులకాంతి నిద్దంపుటద్దంబు
 చెలువుతోడుతఁ బొత్తు సేయుచుండ
గురుకుచంబుల తళుక్కులు మేల్మిబంగారు
 నిగ్గుల నొకయింత సిగ్గుపఱుపఁ
తే. కుటిలకుంతల రుచులుగాఁ గొనుచు నింద్ర
నీలపంక్తుల నెఱరంగు గేలిగొనఁగ
నఖిలమోహనసౌందర్య మలర నజుని
కబ్బెదుర నిల్చె మోహినీకాంత యపుడు. 114

సీ. చంద్ర చంపక మదేభేంద్ర వజ్రావర్త
వదన నాసా యాన రదన నాభి
బిసకాండ పాఠీన పిక సైకత స్వర్ణ
కర నేత్ర భాషా జఘన శరీర
చక్ర చాపాకాశ జలరుహాదర్శప్ర
బలకుచ భ్రూ మధ్య పద కపోల
అలి పుష్ప బింబఫ లాంబుజ శ్రీకార
కచ సౌర భాధర కంఠ కర్ణ

తే. బర్హి శశిఖండ కర్పూర భంగి కమఠ
కచభరా లిక హాస రేఖా పదాగ్ర
తార కాశ్వత్థదళ సఖ మారసదన
కనుఁగొనఁగ నొప్పె మోహినీకాంత యపుడు. .15

చ. వనితమొగంబుచందురుఁడువట్రువగుబ్బలుచక్రవాకముల్
తనువుమెఱుంగునేత్రములుదామరులుందడబాటునొందునా
ననియజుఁడిందుకొక్కచపలాబ్జములందునుగందుబక్షముల్
తనురహితంబు కేసరివిశానముఁ గల్గఁగఁ జేసె నేర్పునన్.

తే. మోహినీకన్యసుందరమూర్తిఁ జూచి
శిరము లోకయింత గదలించి చెలువుతోడ
జలజసంభవుఁ డద్భుతస్వాంతుఁ డగుచు
నాదరంబున నిట్లని యానతిచ్చె. 117

క. విను మోహిని! రుక్మాంగదుఁ
డనుభూపతి ధాత్రియందు హరివాసరశో
భనపుణ్యవ్రత మనిశము
జనులును బంధులును దాను జలుపుటవలనన్. 118

లయగ్రాహి.

పాపములు దోఁగఁ బరితాపములు జన్మభయ
రూపములఁ బాసి పెనుదీపలగు శ్రీలం
జూపరకు నెక్క యపురూపబహుభోగముల
తీపుల సుఖించి తుది శ్రీపతిపదంబుల్
వే పడసి యవ్విభుని ప్రాపున యశశ్శుభక
లాపముల నుండుదురు కాపురుషులున్ సా
టోపభయదోగ్రజమకూపము లఁ గాలరు మ
హాపరమభాగవతు లై పరఁగు వేడ్కన్. 119

ఉ. కావున నమ్మహీశ్వరుని గాదిలిసువ్రత మద్భుతంబు నీ
వావిదిశాధినాథు హృదయాబ్జములోని వ్రతిం బెడల్పు మే
భావమునందునైన నొకపాటిమనుష్యునిఁబోలెఁ జూడరా
దావసుధాధినాథుఁడు మహాత్ముఁడు ధైర్యసమగ్రసంపదన్.

సీ. కలికిచూపులచేత గర్వంబు వదలించి
ముద్దుమాటలచేత మోద మొసఁగి
దరహాసములచేతఁ దమకంబు వొడమించి
సయ్యాటముల ధైర్యసరణి వాపి
వీణారవంబుచే వేడ్కలు నిగుడించి
మధురగానమున మర్మములు గలఁచి
పరిరంభణములచే భావంబు సొగయించి
యధరామృతమున మోహంబు నిలిపి

తే. పద్మ సాగర సర్వతోభద్ర కూర్మ
చక్ర సింహావలోకన చాప ధేను

కార్ధచంద్రాసనము లాదియైనబంధ
భేదముల నోలి వలపించు బిసరుహాక్షి!. 121

క. ఘన విరాపని కొంచముగా
దని ప్రస్తుతిచేసి సరసిజాసనుఁ డిట్లా
డిన మచ్చరించి మోహిని
తనమది గర్వం బెలర్పఁ దా నిట్లనియెన్. 122

చ. కటకట భారతీశ! యది కారణమై భువనైకమోహన
స్ఫుటనవరూపురేఖలను సొంపు సహింప జనింపఁజేసి నేఁ
డిట పెరభామలంబలె నొకించుకవెల్తిగఁజూచిభూవిభుం
బటుతరధీరమానసుఁ డభంగదృఢవ్రతుఁ డంచుఁబల్కెదే.

క. దివసములను నవకోమల
యవసాదను లై నితాంతయమదమఖేలా
సువసను లైనను మోహావ
రవశుల్ ననుఁ గనిన సవతె రాజుల్ గీజుల్. 124

సీ. చక్రవాకలమించు సవతు రా దనిపించు
వలిగుబ్బచనుదోయి చెలువుఁ జూచి
నిండుచందురుకాంతి నిరసించునలతీవె
మొలకనవ్వుల ముద్దుమోముఁ జూచి
యింద్రనీలపురంగు నెత్తుసేయఁ గడంగు
కుటిలకుంతలముల కొమరుఁ జూచి
మరుబాణముల నేవు మాపుసేయఁగ నోపు
నిడువాలుకన్నుల కడిమిఁ జూచి
తే. పొలుపుమీఱిన నెలవంకబొమలుఁ జూచి
రమణఁ దళుకొత్తు బింబాధరంబుఁ జూచి

తలిరులను మీఱు మృదులహస్తములఁ జూచి
వలవకుండంగ నెంతటివాఁడు నృపతి. 125

క. పటుతరమగు మద్వీణా
స్ఫుటమధురరవంబు చెవుల సోఁకినమాత్రన్
విటరాయఁడైనఁ గానీ
ఘటదాసుఁడు గాఁడె యొక్కఘడియటిలోనన్. 126

క వారిరుహాగర్భ! నాదగు
చారువిలోకనమునందు జనపతిఁ గరతున్
నేరుపు లేటికిఁ జూపను
గోరం గడ తేరుపనికి గొడ్డలి యేలా!. 127

క. వైపడి ప్రియుఁ గరపింపఁగ
నోపని జవరాలిరూపు నొరవు నదేలా?
రూపును గన్నులు చన్నులు
పాపటయును మురువు రాతిప్రతిమకు లేవే!. 128

చ. విభవము లేని సంపదయు వేదము లేని మహీసురుండు సౌ
రభమును లేని సూనములు రాజులు మెచ్చని విద్యయు న్మ
హీ, ప్రభువులు లేని రాష్ట్రమును భావమునన్ దమి లేని
కూటమిన్, విభు వశుఁ జేయ లేని యలివేణియు నేల త్రి
[లోకవందితా! 129

వ. అని యివ్విధంబునం బంతంబు లాడిన మోహినీకాంత
చతురవాక్యంబులకుఁ జతురాననుండు సంతుష్టాంతరంగుండై
నిజపుత్త్రియైన యమ్మోహినికి సహాయంబుగాఁ గొంద ఱం
దువదనలం గల్పించి నవరత్నకీలితంబైన తనక్కు నొక్కవీణ

యనోసంగి కామినీనివహంబుతోడంగూడ దివ్యవిమానా
రూఢంగావించి పంచిన నదియును సత్యలోకంబుగదలి తపో
లోక మహర్లోక సువర్లోక భువర్లోకాది లోకంబుల నుత్త
రించి భూలోకంబున కరిగి యనేకపట్టణారణ్యగిరిసమూ
హంబులు గడచి సర్వర్తుకిసలయ కుసుమవిసరమకరందరస
ఫలభరితంబులగు ఖర్జూర కదంబ కర్ణికార కదళికా
కర్పూర కాంచన క్రముక కపిత్థ కర్కంధు కరంజ కరవీర
పనస పాటల పారిభద్ర పలాశ మాలూర మధూక మదన
మాకంద మాధవీ మల్లికా మాలతీ మదన బాణ తాల
హింతాల నారికేళ సారంగ చందనా శోక జంబు పున్నా
గాది నానాతరులతాశోభితంబును, దదున్నతశాఖాప్రదేశ
మదకోకిల కీర శారికా కూజితంబును, దన్మధ్యకాసార కై
రవోత్పల కనక కహ్లార శతపత్ర విరాజితంబును, రాజమ
రాళ సారస క్రౌంచ బక కారండవ చక్రవాక పరిస్ఫుట
క్రేంకారరావంబులును, దదగ్రభాగచంద్రకాంత చింతా
మణి శిలావేదికాసార కైరవోత్పల కనక హర్మ్య గోపు
ర సప్తయోజనవిస్తార ప్రాకారశోభితంబును నగు నిష్టకా
మేశ్వర శ్రీమహాదేవభవనంబునుం గలిగి యొప్పారు
మందరం బను భూమీధరంబుఁ గదిసి యమ్మోహిని చెలు
లుం దానును విమానంబు డిగ్గి చనునవసరంబున. 130

సీ. కిన్నరకిన్నరీక్రీడావినోదాభి
రామానుమోదవిశ్రామసీమ
హారిణీహారిణపోతకానీకనిధువన
వ్యాపారలీలానివాసభూమి

మర్కటీమర్కటోన్మాదఖేలనకలా
కర్షణాకంపశాఖాకులంబు
కలభికాకలభఘీంకారప్రతిధ్వని
స్ఫురితగంభీరగహ్వరసమృద్ధి
తే. సిద్ధగంధర్వఖేచరస్త్రీనఖాగ్ర
ముఖరితాతోద్యవాద్యసముదితగాన
పులకితాశేషతరులతావిలసితంబు
సానువిభ్రాజమంథానశైలభూమి. 181

ఉ. ఆనగవీథిఁ గాంచెఁ దుహినాద్రిజభర్తఁ ద్రిలోకకర్తసం
ధ్యానవతాండవప్రియు సుధాకరపావకభానునేత్రుబిం
బాననునాదిదేవుఁ గరుణామృతసింధువు భక్తలోకసం
తానమహీరుహంబుఁ బ్రమదంబున రత్నసువర్ణలింగమున్.

క. నిండినవేడుకతో నా
ఖండేందుకిరీటిపాదకమలంబులకున్
దండప్రణామశతము ల
ఖండితభయభక్తి నొసఁగి కామిని కడఁకన్. 183

సీ. అంభోజభవసురేంద్రార్చితచరణాయ
మరణదూరాయ నమశ్శివాయ
పద్మాప్తకోటిప్రభాదివ్యదేహాయ
మఖసంహారాయ నమశ్శివాయ
డమరుత్రిశూలఖడ్గకపాలహస్తాయ
మథితదోషాయ నమశ్శివాయ
గగనకల్లోలినీకలితోత్తమాంగాయ
మౌళిచంద్రాయ నమశ్శివాయ

తే. మానిసంసేవితాయ నమశ్శివాయ
మదనదర్పహరాయ నమశ్శివాయ
మధువిరోధిశరాయ నమశ్శివాయ
మంత్రరూపాయ తుభ్యం నమశ్శివాయ. 134

సీ. కదలిపాఱని తేరు వదలఁజాలని పేరు
పఱపఁగా నెఱపఁగా నెఱుఁగఁ డేని
పానఁబట్టనియమ్ము మేనఁ బెట్టనిసొమ్ము
పట్టఁగాఁ బెట్టఁగా ముట్టఁ డేని
కంతుగంధవుఁబూఁత వింతచందవుమేఁత
పూయఁగా మేయఁగా డాయఁ డేని
మింటఁ బుట్టినిధార యొంటఁ గట్టని చీర
తలయందు మొలయందు నిలుపఁ డేని

తే. మెఱవువిల్లు విలాసంబు నొఱుపువిల్లు
గలుగు నుతికెక్కు జేని నాకరము లెత్తి
మ్రొక్కనటువంటి దైవసమూహములకుఁ
గ్లేశభవభంగ! యిష్టకామేశలింగ!. 135

సీ. సమదవారణదైత్యచర్మాంబరమె కాని
పైఁ దాల్ప వొకపాటి పచ్చడములు
కమలసంభవుమస్తకముల పేరులె కాని
పూన నొల్లవు వజ్రభూషణములు
అంగసంభూతభస్మాంగరాగమె కాని
యలఁద నొల్లవు మేన మలయజంబు

కాలకూటమె కాని కడిచేసికొన నొల్ల
వింతవండినబోన మిచ్చగించి
తే. జగతి నెవ్వరి కిటువంటి సరణి చెల్లుఁ
జర్చసేయంగ దేవతాచక్రవర్తి
వై తనర్చిన నీకె కా కాదిదేవ!
క్లేశభవభంగ! యిష్టకామేశలింగ!. 186

క. ఘనములు ధనధాన్యవివ
ర్ధనములు నమృత్యుభయనిధనములు భక్తా
వనములు భక్తినిధానాం
జనములు శివ మీపదాబ్జసంపూజనముల్. 187

క. శూలిగ గపాలి మస్తక
మాలిగ నయశాలిఁ జంద్రమౌళిగ గ్రతుని
ర్మూలిగ సుగుణాలిగ శుభ
శీలిగ గరకేలిఁ జర్మచేలిగ గొలుతున్. 188

వ. అని యయ్యుర్వీశ్వరుం బ్రస్తుతించి యమ్మహాదేవు పాదో
దకప్రసాదంబులు గైకొని యహర్నిశంబు లిష్టకామేశ్వ
రుని సేవించి మోహినీకన్య దనచేతి రత్నవిపంచి మ్రో
యించుచు షడ్జ పంచమ స్వరంబుల ననేకరాగతాళసం
కీర్తనంబుల సుధాదిగీతంబులు పాడుచుండ నవ్వు డప్పుడ్వా
త్మీ నిజవయస్యలు దమకు మనోహరంబులగు తావుల మంద
రపర్వతంబునం జరియించుచుండి రని సూతుండాలింగించిన
విని నైమిశారణ్యవాసులైన మునీశ్వరు లటమీఁది వృ
త్తాంతం బెట్టి దనిన. 189

శా సంసారార్ణవతార! తారమహీభృత్సంకాశ! కాశావళీ
హంస క్షీర పటీర హార బిసకీర్త్యాకల్ప! కల్పప్రజా
ధ్వంసిప్రాభవకాల! కాలమదజిత్సంరంభ! రంభాధిపో
త్తంసశ్రీకరభోగి! భోగివరసౌందర్యాంఘ్రిమంజీరకా!.

క. గౌరీఘనస్తనాగ్రవి
హారా! హారాంగుళీయకాభరణరణా!
చారుభుజదండ! దండక
తారావళిగద్యపద్యతత్పరహృదయా!. 141

మాలిని. కనకశిఖరిచాపా! కాలనాశప్రతాపా!
జననభయవిదూరా! శైలజాచిత్తచోరా!
దినకరశశినేత్రా! దివ్యకాంతాకళత్రా!
వనజనయనబాణా! వర్ణితాంభోధితూణా!. 142

గద్యము.

ఇది శ్రీమత్పార్వతీశ్వర వరప్రసాదలబ్ధ కవితాపవిత్ర పోత
యామాత్యపుత్ర సకలజనానందచర్య ప్రౌఢకవిమల్లనా
ర్య ప్రణీతంబైన రుక్మాంగదంబను మహాపుణ్యకథయందు
దండధరుండు సత్యలోకంబునకరిగి కమలగర్భు సమ్ముఖంబు
న గాలదండ కాలపాశాది నిజసాధనమ్ములు ముందటం బె
ట్టి తనలోకశూన్యవృత్తాంతంబు విన్నవించుటయు, నద్దేవ
తాసార్వభౌముండు ధర్మరాజునకు శ్రీహరిభక్తిప్రకారంబు
ను నామలక తులసీ కార్తిక విశేషంబులను నన్నదాన మ
హిమంబును నఖిల ధర్మాదికంబును నెఱింగించి భవదీప్సితం

బొనర్తు నని మనోమోదంబుగాఁ బలికి యతని వీడుకొల్పి కమలసంభవుండు మోహినిం బుట్టించి రుక్మాంగదుం డొనర్చు నేకాదశీవ్రత ప్రభావం బెఱింగించి తద్వ్రతంబున కంతరాయం బొనర్చుమని నియోగించి యనిపిన నమ్మోహినీకాంత మందరపర్వతంబున కరిగి యందు నిష్టకామేశ్వర శ్రీమహాదేవుని సేవించి నిలుచుటయు నన్నది ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# రుక్మాంగదచరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీలోకలోచనాంబుజ!
ప్రాలేయకరాగ్నిభూమిపవనాకాశ
స్థూలాత్మమూర్తియుత! నుత
భూలలనాధీశ! దక్షపురభీమేశా!. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని యె. 2

చ. వనజజునాజ్ఞ పంపున నవారణఘోరమృగావలుల్ ధరన్
జననమునొందిక్రొవ్వి పరుషధ్వనులిచ్చుచు గుంపులై వడిన్
జనినలుదిక్కులన్ గలయఁజాఁగిమనుష్యులఁదోలిసస్యముల్
మునుములుగట్టిమేసి నుఱుముల్ క్షణమాత్రమ యందునే
[యుచున్. 3

క. మా తెందు లేక నిరతముఁ
గారియవెట్టంగ బెగడి కనుములు సందుల్
దూరుచుఁ బ్రజ లందఱు నొక
యారంబున గుంపుగూడి యిట్లనిరి వెసన్. 4

తే. ఈక్షణమె భూమిఁ గలవార మెల్ల నరిగి
పార్థివేంద్రుని గని మనపాటు లెల్ల
విన్నపము సేయ కూరకయున్న నిండ్ల
పట్ల నుండంగరా దంచుఁ బలికె నపుడు

సీ. పసిఁడిపువ్వులు పట్టుపచ్చడంబు లధిక
చీరలు గుజ్జరిపారువములు
చమురుకావళ్ళు రాజనపుబియ్యంబులు
చెఱకుకోలలు కంద చిరుగడములు
మినుములు పెసలు మామిడి తాండ్ర టెంకాయ
లల్లంబు తమలంపుటాకుకట్లు
దంతపుఁబ్రతిమలు దానిమ్మఫలములు
ఖర్జూరములు తేనె కలువుచమురు

తే. దోమతెఱ మంచమును సంపదొనలు విండ్లు
పనసపండ్లును బెల్లంబు పంచదార
గసగసలు చారపప్పు ద్రాక్షాఫలములు
గొనుచుఁ బ్రజ లేఁగి రవనీశు గొలువునకును. 6

తే. సరవి రుక్మాంగదక్షితీశ్వరుని గాంచి
తారు దెచ్చిన బహుపదార్థంబు లెల్ల
నవనినాయకు సముఖంబునందుఁ బెట్టి
చక్కఁ జాఁగిలి మ్రొక్కి హస్తములు మొగిచి. 7

తే. అవధరింపుము రుక్మాంగదావనీశ!
నీవు రాజ్యంబు సేయంగ నేటిదాఁకఁ
జల్లనై యున్న మీపదాబ్జముల నీడ
బ్రతికియుంటిమి పిన్నపాపలము మేము. 8

చ. నరవర! నీవసుంధర వినంగను నద్భుత మేమి చెప్ప నేఁ
డురువడిదున్నపోతులుమదోద్ధతసామజముల్ వరాహముల్
గురులగుదుప్పిలేదులెలుఁగుల్ హరిణంబులుఁగోట్లసంఖ్యభీ
కరరవముల్ చెలంగ నరికట్టుకయున్నవియొందుఁజూచినన్.

సీ. చేలకావలివారిఁ జించిచిందఱ రేఁగి
పండినసస్యముల్ పరుముచేసి
గుండుగూలఁగఁ గొట్టి గుంపులు గోరాడి
ఫలమహీరుహములు పడఁగఁ ద్రోచి
తోఁటల కురికి నిర్ధూమంబు గావించి
కమలాకరంబులు కలఁచి విడిచి
జనపదంబులు గూల్చి సంహార మొనరించి
పసులమందల కేఁగి యసవు లణఁచి
తే. నేఁటకాంద్రను దేశంబు వెడలఁ దరిమి
పువ్వుఁదోఁటలు తీఁగెలు భూమిఁ గలిపి
చెఱకులును నారికెడములు విఱుగఁ ద్రోచి
మంద లై యున్న వవి యెందు మాఱు లేక. 10

మాలిని. వేఁటలకుఁ దగుసాధనముల్ పృథివీవర! గైకొని
యాటవికుల్, గాఁటముగాఁ జన ముందట నీకరకౌశల
మొప్ప మృగావలులన్, దూఁటలుఁగట్టమహోగ్రశరావలిఁ
ద్రుంపుము ద్రుంపక తక్కిన మా, కేటికి నీవ్యవసాయము
లెందులఁ కేనియు నేఁగెన మిందఱముల్. 11

క. వేఁటన్ మృగములఁ బోరిగొని
నూటిన్ మముఁ బ్రోచుటేమి చోద్యము పటుశౌ

ర్యాటోప! నిందుబండికి
చేట బరువె! యవనినాథ! చింతింపంగన్. 12

కవిరాజవిరాజితము.

భయమున భూప్రజ లాడినమాటలు
పార్థివశేఖరుఁ డాదరణన్
గయికొని యేలవిచారము నేఁ గలు
గన్ మృగకోటులఁ ద్రుంచెద నే
భయమును వద్దు సుఖంబున నిండుల
పట్టున నుండుఁ డటంచు మహో
దయ నిగుడన్ బ్రజ నంపి విభుండు ప్ర
తాప మెలర్పఁగ నాక్షణమే. 13

చ. తనయుని మోముఁజూచి ప్రమదంబున నిట్లను నీవుభూమిపా
లన మొనరింపు మేనడవులం గజసింహాలులాయ ఖడ్గసం
హనన మొనర్చి క్రమ్మఱ రయంబున విక్రమరేఖమీఱ శ్రీ
దనరఁగ వచ్చునంతకు బుధస్తుతనీతిపథంబు మీఱఁగన్.

క. నరనాయకుండు నీతి
స్ఫురణన్ ధర యేలెనేని సురపతికరణిన్
జరియించు నీతిశూన్యతఁ
దిరిగిన సిరులందుఁ బాసి దీనత నొందున్. 15

క. పగతురఁ బగతురచుట్టలఁ
దగువారలఁ గానివారిఁ దగమును దనచే
నొగిలినవారి దృఢంబుగ
జగతీపతి విశ్వసింపఁ జన దెయ్యెడలన్. 16

క. తొల్లింటిసేవ నొకభూ
వల్లభునకు నెగ్గుసేసి వచ్చినతులువన్
వెల్లింపంగాఁ దగుఁ దగ
దుల్లంబున హితుఁడటంచు నూరడియుండన్. 17

క. వివిధాన్నము లొరు లంపిన
నవనిని నొరుఁ గుడువఁబెట్టి యతనికి జీర్ణం
బవు టెఱిఁగి భుక్తిఁ గొనఁదగుఁ
బ్రవిమలమతి భక్ష్యభోజ్యపానీయాదుల్. 18

క. జనపతి యన్యనృపాలుఁడు
పనిచిన భూషణసుగంధపరిధానంబుల్
మునుమున్న పూనఁగాఁ దగ
దెనయఁగ విషయంత్రభంగు లెఱిఁగినదాఁకన్. 19

క. పతియు నమాత్యుఁడు దుర్గము
క్షితియును మిత్త్రుండు ధనము సేనయు ననఁగా
నుతి కెక్కును సప్తాంగము
లతులితగతి రక్ష సేయ నగు నరపతికిన్. 20

మ. వనకేళిన్ జలకేళి భోజనమునన్ వాహ్యాళి దేవోత్సవం
బునఁ గాంతారతి వేఁటలాడు నెడలన్ బోట్లాడుచో సాముచో
గనుమల్ సొచ్చినచో మొనల్ నడుపుచోఁ గాంతారవీథిన్
గజాశ్వనృసంఘంబులఁ జూచుచో వలయు రక్షాభంగి
[భూభర్తకున్. 21

క. శుద్ధియు బుద్ధియు శాంతియు
వృద్ధాచారమును నయవివేకముఁ గర్మ

శ్రద్ధయు ధైర్యము గలుగు ప్ర
బుద్ధినిఁ బతి మంత్రిపదవిఁ బూన్పఁగవలయున్. 22

క. హరునకు రజతాద్రియు శ్రీ
హరి కమృతాబ్ధియును నామహాదుర్గంబుల్
ధరణీరక్షకు భూమీ
శ్వరునకు వలె నుగ్రశైలవనదుర్గంబుల్. 23

మ. జలముల్ కాష్ఠములున్ దృణంబుఁ జమురున్ శాకంబులున్
ధాన్యముల్, బలమున్ యంత్రము లట్టడుల్ పరిఘలున్
బ్రాకారముల్ సాధనా, వలియున్ ధర్మసమగ్రతన్ గలిగి
దైవత్మౌజనాసాధ్య మా, స్థలనీరాచలదుర్గముల్వలె మ
[నుమ్యస్వామికిన్ బుత్రకా!. 24

క. న్యాయమునఁ బ్రజలఁ బెనిచినఁ
బాయక సిరి నొందు భూమిపతి యతనికి నా
దాయంబు లేనితఱిఁ తమ
శ్రీ యిడి ప్రజ రాజుప్రోచుఁ జెలఁగును రతితోన్. 25

క. పరభూమి ప్రజయుఁ జేరును
దిరముగ ధర యేలురాజు దేశంబునకున్
సురుగుదు రెప్పటిప్రజలును
నరపతి న్యాయంబు దప్పి నడచినయేనిన్. 26

క. అక్కఱ కలదని ప్రజపతి
యెక్కువగా ధనముఁ గొనుట యిలపైఁ జెఱువుల్
వ్రక్కలుగఁ ద్రవ్వి మీలను
గ్రక్కునఁ బట్టుకొని తింట గణుతింపంగన్. 27

క. తనభూమి ప్రజల నిరతము
జననాయకుఁ డరయుకుండి సచివుని నిలుపన్
ధనహానియె కా దామీఁ
దను రాజ్యము చెడుఁ బ్రధాని దా స్వామి యగున్. 28

క. ధరణి యభివృద్ధి నొందిన
ధరణీనాయకుఁడు సకలధనయుక్తుఁ డగున్
ధరణీరక్షయె నిరతము
ధరణీపతి సేయవలయుఁ దత్పరమతి యై. 29

క. పొదు గోత్తి పితికి క్రేవుల
మొదలార్చుట ప్రజలఁ నధికముగ నరిఁ గొనుటల్
కదుపులఁ బెనుచుట తగ నరి
యదనం గొని ప్రజలఁ బ్రోచు టవనీపతికిన్. 30

క జగతీపతి యధికారులు
తగనిధనం బొక్క చోటఁ దారము గొన్నన్
మగుడంగ నొసఁగి నెయ్యము
మిగులన్ మన్నింపవలయు మేదినిఁ బ్రజలన్. 31

క. చోరులచే సుజనుల సం
సారంబులు చెల్లుఁగానఁ జనుఁ దలవరులన్
ధారుణిఁ బ్రజల భయంబులు
వారింపఁగ నవనిఁ గాచువారుగ నునుపన్. 32

క. చోరుల హింసింపక పతి
కారుణ్యముచేసెనేని కలతురు ప్రజలా
చోరులచేత ననేకులు
కారణ మటుగానఁ దగదు కరుణ యొనర్పన్. 33

క. తెరవాటుగొట్టి భూప్రజఁ
బరిమార్చెడు చోరవితతిఁ బతి దునిమెడిచో
వెరవున మాన్పఁగఁ బూనిన
దొరలన్ దక్షిణమె వెడలఁ ద్రోపింప నగున్. 34

ఆ. నమ్మఁబలికి రైన నరపతిసమయింప
నగు ధరిత్రి చెరుచునట్టి ఖలుల
నెర యొనర్చి పులి నహీనబలంబునఁ
జదిపి పశుగణంబు చనదె త్రోవ. 35

క. గోరక్షయు వాణిజ్యము
నారంభము నరియు సుంక మప్పనములు శృం
గారవనంబులు గనులును
గారణములు ధనముఁ గూర్పఁగా నగుఁ బతికిన్. 36

క. శిక్షింపరాక మిక్కిలి
పక్షంబున మెలపువారి బహుధనధాన్యా
ధ్యక్షులఁ జేయంగాఁ దగ
దక్షిణకృపాసమృద్ధి నవనీపతికిన్. 37

క. వివిధములగు విత్తనములు
కువలయపతి సంగ్రహించి కోరినప్రజకున్
వ్యవసాయబహుళతకు నై
యవిరళముగ నొసఁగవలయు నయ్యైవేళన్. 38

క. జనపతి తనపనిపాటల
జనముల ఖరదండనముల సమయింపక మె
ల్పున ధనముఁ గొంట తుమ్మెద
వనజమరందంబుఁ గ్రోలు వడుపు దలిర్పన్. 39

క. సామము సమునందు నతి
వ్యామోహితునందు భేద మధికునియందున్
గామితదానము దుర్బల
భూమీశునియందు దండమును జేయఁ దగున్. 40

క. నరనాథుని నిజగేహము
పరిఖాప్రాకారవీరభటగజతురగో
త్కరనానాయుధరత్నా
కరణంబులచేత నగరుఁ గావఁగవలయున్. 41

క. పాయక రాజద్వారం
బాయతమతిఁ గాచువారి కన్నిభయంబుల్
పాయును మలినం బెడలును
శ్రీయును దేజంబు యశముఁ జెందుఁ గుమారా!. 42

క. అవసరము గానివేళల
నవనీపతి గారవించు నాత్మజుఁ డైనన్
గువలయపతిభవనంబులు
జవమున భయమేది చొరఁగఁజన దెన్నండున్. 43

క. ఎంతటిమాన్యుల కైనన
నంతైశ్వర్యార్థసంచయము లొసఁగంగాఁ
బంత మగుఁగాని యాజ్ఞ యొ
కింతయు నీరాదు పతికి నేకార్యములన్. 44

క. కానివ్యయ మెన్నఁడును నొక
కానియుఁ జేయంగఁ దగదు కార్యము గలచో
మానక ధనము తృణంబుగ
మానవపతి సేయనగు సమగ్రవిభూతిన్. 45

క. మన్నీలబలిమి గలదని
యున్న మహీపాలుకడిమి యుండదు రాజ్య
భ్యున్నతికి మూలబల మా
సన్నం బై యుండవలయు సమధిక మగుచున్. 46

క. సామంతు లహర్నిశమును
భూమీశ్వరునకు ద్వారములు గావక యి
చ్ఛామార్గమునఁ జరించిన
స్వామికి రాజ్యంబు తిరము చాలక యుండున్. 47

క. బలువగు దుర్గముపైఁ జని
బలములువొలియంగఁ బోరఁ బాడియె ధరణీ
తలపతి ముట్టడి చేసిన
దళసంపదతోడఁ గోట తానే చేరున్. 48

క. దూరమునందే శాత్రవుఁ
డారయ నధికుఁ డని యుంట యంటినచోటన్
భూరిపరాక్రమమునఁ గా
కూరక గర్వితునికడిమి యుడుగునె యొంటన్. 49

క. నిలిచి యదల్చిన శునకము
దలఁగి చనున్ బంచనేని తా వెను తగులున్
గలనం బగతుని నట్లే
చలియింపక యోర్వవలయు సాహసభంగిన్. 50

క. అరి తనపై వచ్చినఁ దగు
నరిగాని సమరముఖమునందునఁ గానీ
మరలింపక తా మరలిన
నరపతిరాష్ట్రంబు తక్షణంబునఁ బొలియున్. 51

క. అదనైనదాఁక శాత్రవుఁ
గదలింపక యుండి యదరు గలిగినచోటన్
మొదలార్పవలయుఁ గొక్కెర
యుదకములో మీనుఁ బట్టునోజ దలిర్పన్. 52

క. పగఱపయిఁ బరఁగ విడిచిన
బగఱఁ దొరలి పాసి చనినఁ బగఱకుఁ బ్రజకున్
బగ యొదవినఁ జయ్యన నిజ
పగఱధరిత్రియును సిరియుఁ బతి గొనవలయున్. 53

క. తనదుర్గంబులు భూమియుఁ
గనుములు బదిలములు సేయఁ గానక గర్వం
బునఁ బగఱమీఁద నడచిన
జనపతి రాజ్యమును సిరియు శత్రునిఁ జేరున్. 54

క. కుజనుల శిక్షింపమియును
సుజనులఁ గ్రోధించి చంపఁ జూచుటయును భూ
భుజునకుఁ బాతకమూలముఁ
బ్రజచే నాతనికి భంగపా టొనగూడున్. 55

క. బలవంతులు బలహీనులఁ
బొలియింతురు వర్ణధర్మములు దప్పును జా
రులు చోరు లేవుమీఁదు దు
రిలఁ బతి దండింపకున్న నేచినకడిమిన్. 56

క. తెలియందగు నాయవ్యయ
ముల రాష్ట్రములోని వార్త మొనసినరిపునిన్
గొలిచినవారిని వాకిట
నిలిచిన యర్థులను ద్విజుల నిరతముఁ బతికిన్. 57

క. వీసము విడువక కొన నది
భాసురముగ న్యాయధనము పతి దనప్రజచే
భూసురునిచేత నరయక
కాసును గొనఁగూడ దెడరుగలచో నైనన్. 58

క. బలవంతుఁ డైన శాత్రవుఁ
జలమున సాధించుచోటఁ జను నితరమహీ
శులతోడఁ జెలిమి సేయఁగ
నిల తేఁ డశ్వాంబరార్థహితవచనములన్. 59

ఆ. మంత్రగోపనంబు మర్యాద నిజరాజ్య
తంత్రరక్ష దానధర్మధైర్య
శౌర్యవృత్తి విప్రసంతర్పణము సత్య
భాషణంబు భూమిపతికి వలయు. 60

క. బలధర్మపరాక్రమములు
గలభూపతితోడ మైత్రిఁ గావింపంగా
వలయు బడి యొండుపాయం
బొలసినచోటను సహాయ మొనరించుటకున్. 61

చ. మనవులు సెప్పినన్ విని ప్రమాదము గల్గినఁ గాచి జీతవ
ర్తన లలయింప కిచ్చి తలిదండ్రులబత్తెము పెట్టి లావుచే
సినబిరుదార్థభూషణవిశేషపదంబులు నిల్పి మన్ననల్
దనరఁగ స్వామిపాలకుఁడు దాఁ బరివారము నేలఁగాఁ దగున్.

క. పరివారంబునకును భూ
వరునకు హృదయంబు గలసి వర్తింప నగున్
బరివారము నిలిపెడుచో
ధరణీపతి సేరు వాడి తా నునుపఁదగున్. 63

క. కలవడిమాటలు ప్రియమున
నలయింపక యీవులందు నాదరణమునన్
గలకాలంబు పదాతుల
నలవున వశగతులఁ జేయ నగునరపతికిన్. 64

క. శరణన్నవారిఁ గాచుట
దురమున వీరారివరులఁ దునుముట ప్రజలన్
బరిపాలనంబు సేయుట
ధరణీపాలునకు ముఖ్యధర్మం బెపుడున్. 65

క. కృతు లిచ్చినసుకవుల నా
శ్రితుల ధరాప్రజల భటులఁ బ్రియబంధుల భూ
పతి యవసరమున సమసిన
హితుల కుటుంబములఁ బ్రోవ నిలపతి వలయున్. 66

ఆ. అనుచు బుద్ధి సెప్పి యవనీశ్వరుఁడు కుమా
రకుని ననిపి యాటవికులఁ జూచి
సాధనములు పూని చనుదెండు నావెంట
విపినములకు వేఁట వెడల వలయు. 67

క. క్షితినాథుఁడు తమ కిట్లా
నతి యిచ్చినఁ జని పుళిందనాథులు భయవా
ద్యతిఁ జేర్చి సారమేయ
ప్రతతుల నొండొండి యేర్చి పట్టిరి బలిమిన్. 68

సీ. గడికోట బసువ శంకరుఁడు చోప్పరికాఁడు
కాత్రేఁడు జగజెట్టి గాలిపడగ
కొండీఁడు పులియమాకోల్కులు గండండుము
దురుగాలి మార్పీఁడు దొంగ బొజుగు

బండిమల్లఁడు వెండిగుండు చిచ్చరుగోల
పట్టుగొల్లైన భూతభైరవుండు
కోదమసింగము వెండిగుదియ కోటలగొంగ
డాదిభైరవుఁడు మోహనమురాలి
తే. చలిపిడుగు విక్రమార్కుఁడు బలుదలారి
యనెడు నామంబులను జేర్చి నవనినాథు
నగిరిజాగిలముల నేర్చి తగినరీతి
గొలుసులను బట్టి చని రొక్కకొంద అపుడు. 69

సీ. పలలకావళ్లు చివ్వంగులబండులు
తిరుచుట్టుబొంగు కాలురులు చీరె
తెరులు నుగ్గంబులు దీమముల్ మారము
లైకదారికత్తులు మొకములొను
లొఆపైనగొడ్డండ్లు మెఱుఁగుబల్లెంబులు
తట్టగొమ్ములు పులిచెట్టుమందు
బలువిండ్లు బొట్టగోలలు తోలుమోకులు
గొరక త్రళమ్ములు కరకణేలు
తే. నాదిగా వేఁటలకు యోగ్యమై తనర్చు
సాధనంబులు సవరించి సరభసమున
నాటవికసైన్య మేతెంచి యధిపుఁ గాంచి
దండములు పెట్టి నిలిచి ప్రతాప మలర. 70

తే. వేఁటలకు భూమిపాలుఁడు వెడలఁదలఁచు
టెల్ల సంధ్యావళీదేవి యిష్టసఖుల
వలనఁ దెలియంగ విని కళవళము నొంది
జనవరుం డున్న యాస్థానసదనమునకు. 71

సీ. కందుఁ జెందని సుధాకరపూర్ణబింబంబు
మెఱసి పాయకయున్న మెఱుఁగుఁదీఁగ
పంకంబునందు గీడ్పడనిమృణాళముల్
కవవిచ్చి చనని జక్కవయుగంబు
వికసించి మొగడని విమలాంబుజాతముల్
కర్కశంబులుగాని కరికరములు
చిలుకముక్కంటని వలఁతిబింబఫలంబు
దాంపత్య మెడలని దర్పణములు

ఆ. ననఁగ నాననమ్ము నంగంబు హస్తముల్
చన్నుదోయి వాలుగన్ను లూరు
లలఁతిమోవి చెక్కు లలర నయ్యారవింద
గంధి భూమిపాలుఁ గదియ నరిగి. 72

క. వినయమును భయము భక్తియు
మనమునఁ బెనఁగొనఁగ నాతిమానాయకునిన్
గనుఁగొని మృదువాక్యంబులఁ
దనరఁగ బింబాధరోష్ఠి దా నిట్లనియెన్. 73

క. జననాథ! వేఁట కరిగెద
నని తలఁచినవాఁడ వఁట మహాద్భుత మిట్లా
పని యెన్నఁడు మీవలనన్
గనియును వినియును నెఱుంగఁ గలుమను గాదే. 74

మత్త. వేఁటలాడఁగ దూషితంబులు వేఁట లార్యవిరోధముల్
వేఁట లూర్జితధర్మహీనులు వేఁట లక్రమమార్గముల్
వేఁట లుగ్రతరాఘుశీలలు వేఁట లత్యపవాదముల్
మాటలేటికి భూప! వేఁటలు మాని యుండుము సుస్థితిన్.

తే. వేఁట జూదంబు పానంబు మాటబిరుసు
కఠినదండంబు తరలాక్షి కానియీవి
యనెడి వ్యసనంబు లేడింటియందు మమత
తగదు కావింప ధారుణీతలవిభుండు. 76

సీ. వేఁటఁ బాండుక్ష్మావిభుఁడు శాపము నొందె
ద్యూతసంగతి నైషధుండు నొగిలెఁ
బానంబునను యాదవానీక మిలఁ గూలెఁ
బరుషోక్తిఁ గౌరవవ్రతతి సమసెఁ
గఠినదండమున మాగధుఁడు మేను దొఱంగె
భామినీరతి సింహబలుఁడు గెడసెఁ
దగనియీవిఁ ద్రిశంకుధరణిపాలసుతుండు
తలపోయరాని దుర్దశఁ జరించెఁ

తే. గాన వ్యసనంబు లేడును గానివగుట
యెఱిఁగి మనమున నందులో నించుకైన
దగులొనర్పక నిల్చిన ధరణి యెల్ల
నేలు నిష్కంటకముగ భూమీశ్వరుండు. 77

క. అని సంధ్యావళి పలికిన
విని భూపాలుండు పలికె వినుమా వేఁటల్
ఘనపాతకమూలము లని
వినవే? యీ పాపపుణ్యవిధు లెఱుఁగనొకో!. 78

ఉ. ఊరక వేఁట వెళ్ల వికచోత్పలలోచన! దుష్టసత్త్వముల్
ధారుణి నేపు రేఁగి బెడిదంబుగ మూఁకలుగట్టి గ్రామముల్
మారిమసంగి నట్లయి సమస్తముఁ జూర్ణము చేసినప్పు డా
క్రూరమృగంబులన్ దునిమి కుంభిని నిల్పుట ధర్మహానియే!.

చ. వలదు దలంక నూరడిలు వామవిలోచన! కాననంబులన్
గలయఁగ వేఁటలాడి తిరుగన్ జనుదెంచినదాఁక నీవు నా
వలన మమత్వ మొప్ప ననివారణ శ్రీహరివాసరవ్రతం
బలవుగఁ జర్పుమంచుఁ బ్రియ కర్మిలినప్పనఁ జేసిచయ్యనన్.

మ సుతు ధర్మాంగదు రాజ్యపాలనకు నై చూపట్టఁగానిల్పియా
క్షితినాథుండు ప్రధానులుందొరలుఁ దేజీలున్మ దేభంబులున్
హితులున్ దేరులుదండనాథులుభటానీకంబు లెన్నేనియున్
బ్రతిభంగోల్లమహావిభూతినరిగెన్ బాలార్క తేజంబునన్.

ఉ. మాళికిరీటరోచులు సమగ్రతటిల్లత లింద్రచాప మా
ఖీలశరాసనంబు గుణభీషణరావము గర్జితంబు శ్రీ
జాలము లోలిఁజల్లు వికసత్కుసుమంబులు వృష్టిగాఁగ భూ
పాలనవాంబుదంబు గనుపట్టె మహారథశైలసంగతిన్. 82

ఉ. పచ్చనిపట్టుచేలమును బచ్చనికుంకుమపుష్పగంధమున్
బచ్చనిపట్టుసింగిణియుఁ బచ్చనిజోడును రాగవల్లులున్
బచ్చనిరత్నకీలితవిభాసితభూషితముల్ దలిర్పఁగాఁ
బచ్చనివింటిజోదుక్రియఁ బార్థివశేఖరుఁ డొప్పె నయ్యెడన్.

వ. ఇవ్విధంబున నమ్మహీవల్లభుండు గట్టాయితం బై కదలి మహారణ్యంబులు దరియ నడచె నప్పుడు మున్నాడి యనేక సహస్రసంఖ్యాతసమేతంబగు శాబరబలసమూహంబు గహనంబుఁ బ్రవేశించి ఘోరమృగసంఖ్యంబులకందువలరసి యరికట్టుతిరిగిరాఁ బొంగువారియు నొండొరులం జీఱియుఁ దెఱలుచుట్టియు వస్తులు వెట్టియుఁ దమకంబు లమర్చియు విక్రమంబులు పేర్చియు దీమంబు లునిపియు గాలురులు నేసియు నోదాలు దీర్చియు వలకుం దార్చియు మృగంబుల

నొత్తియు నంతంతకు హత్తియు నీరంబులు దూఱియు
వెనువెంటం బాఱియుఁ దరువులు నఱికియు ద్వీపంబుల నురి
కియు బహుప్రకారంబుల వర్తింపుచుండి రంత భూమీశ్వ
రుండు కథంబు రయంబునం గదియఁబఱపి. 84

క. కోపంబున శరవర్షము
చాపంబునఁ దొఱఁగఁ జేసి జనపాలకుఁ డా
టోపంబున శరభంబుల
రూపంబు లణంచి యార్చె రోదసి పగులన్. 85

క. అడిదంబు పెఱికి భూపతి
బెడిదంబుగ బలిమి నొక్క భేరుండంబున్
మెడఁ దునిమివ్రేయ నెత్తురు
వడిఁ దనియక భూమిమీఁద వఱదలువాఱెన్. 86

క. రదనములు దునియ నేసిన
సదనములకుఁ బాసి పాఱె జవమున లాలల్
వదనములఁ దొరఁగఁగా న
య్యదన మృగేంద్రములు భయసమాకులమతులై. 87

క. అదలించి యుత్తళముచేఁ
గదలించి విభుండు భిల్లగణవల్లభులన్
మదలించి ఖడ్గమృగముల
విదళించెఁ బ్రతాపరేఖ వినుతింపంగన్. 88

క. ఆలములు విడిచి మదశా
ర్దూలములు మహాభయంబుతోఁ బరువిడఁగా
వాలములు తలలు పటుశర
జాలముల మహీవిభుండు జగతిం గూల్చెన్. 89

క. వైరంబునఁ బఱతేఱఁగ
దూరంబున మస్తకంబు దునియఁగ నేసెన్
ఘారమ్మున భల్లుకముల
ఘోరంబున భూవరుండు పృథివి చలింపన్. 90

క. వనములఁ జొరఁగొట్టి మృగా
దనముల నరికట్టి బెట్టిదంబగు పటుసా
ధనములఁ దునిమి యిడెన్ భో
జనములు గోమాయుకాకసముదయములకున్. 91

క. అమ్ములు వడిఁ దునిసి లులా
యమ్ములు ఝుఱ్ఱనుచుఁ దిరిగి యవనీస్థలిపైఁ
గొమ్ములు క్రిందుగఁ బడె వా
లమ్ములు వడినేయ ఘోరాటవిలోనన్. 92

క. శ్రీకరములు రణరంగజ
యాకరములు నిఖిలశాత్రవానీకమనో
భీకరములు నగుశరముల
సూకరములు సమసె భూభుజుఁడు వడి నేయన్. 93

క. సారంగంబుల రయమునఁ
జేరంగ దురంబునఱపి చిత్రముగ జవం
బారంగఁ జాపవిద్యా
పారంగతుఁడైన భూమిపాలుం డేసెన్. 94

క. కట్టలుకఁ గొండగొఱియలఁ
గట్టలుగాఁ దునిమి తలలు కాననభూమిన్
గుట్టలు వెట్టి వృకంబుల
చట్టలుకం బాపె నృపతి శరవర్షమునన్. 95

క. త్రిప్పులు వెట్టుచుఁ బాఱఁగ
నిప్పులు వెదఁజల్లు బాణనికరంబులచేఁ
గుప్పలుగొలఁదిగ నేసెను
దుప్పుల నవనీవిభుండు దోర్బల మెసఁగన్. 96

క. బాణము విభుఁ డరివోసిన
నేణము గని పాఱి కుముదహితబింబలస
త్కోణమున దాఁగి రయమునఁ
బ్రాణము రక్షించుకొని శుభస్థితి నిలిచెన్. 97

క. ఏకలమును నరనాథుఁ డ
నేకలవంబులుగఁ జేసి యేనుఁగులను బె
వాస్సకలరి కట్టి కొట్టెను
మేఁకలవలెఁ దరుల నపరిమితశౌర్యమునన్. 98

తే. మేదినీశుండు కస్తూరిమృగచయంబుఁ
జమరికామృగజాలంబు సముదరేఖఁ
బేర్చుజవాదిపిల్లులఁ బ్రియము మెలర్పఁ
బట్టి పదిలంబు గావించెఁ బరిఢవించె 99

వ. మఱియు సింహ ఋషభ శార్దూల గండభేరుండ భల్లూక వరాహాది మృగంబుల నఖండపరాక్రమంబున ఖండించి కస్తూరిచమరికామృగంబుల సమయించి యొండొండం బట్టి పదిలంబు గావించి పరిఢవించె. 100

సీ. వింధ్యానలప్రాంతవిపినమార్గములందు
సహ్యభూమీధరసానువులను
మలయపర్వతపాదమహితాటవులయందుఁ
గ్రౌంచశైలమహోగ్రకాననములఁ

పారియాత్ర గ్రావపటువనాంతరముల
గంధమాదనగిరికందరములఁ
ద్ర్యంబకావనిభృన్నితంబదేశంబుల
ఘనమాల్యవద్గిరికటకములను
తే. గనక దర్దుర ధరణీంద్ర గహ్వరముల
ఘోరమృగముల వేఁటాడి కుంభినికిని
హర్ష మొదవించి చాలించి యవనినాథుఁ
డరుగుచోఁ గాంచె వామదేవాశ్రమంబు. 101

సీ. పనస పిప్పల నింబ పాటలి దాడింబ
రాజభూజ కదంబ రాజితంబు
తింత్రిణీ రుద్రాక్ష తిలక జంబూవృక్ష
బహుసా దశోకాక్ష భాసురంబు
కర్ణికా సురరంగ కదలికా నారంగ
చంప నామ్ల లవంగ సంకులంబు
తిందు కార్జున సాల దేవదారు తమాల
వకుళ చంపక తాల భాసితంబు
తే. నారికేళ పలాశ పున్నాగ పూగ
కుటజ కర్పూర ఖర్జూర కోవిదార
ముఖతరువ్రాతబహులతా మోది యగుచు
మహిమఁ దనరారుపుణ్యాశ్రమమ్మునందు. 102

క. సామాగమసుస్వరపటు
భూమిసురానేకమంత్రపూతాహుతివి
స్తోమసముజ్జ్వలపావక
ధూమవ్రాతములు నిఖిలదోషము లణఁచున్. 103

సీ. మత్తిల్లు వ్యాఘ్రసింహములతోఁ జెరలాడు
లేడిపిల్లలగుంపు గూడికొనుచు
బాలమృణాళవిభ్రాంతిఁ దొండము సాఁచి
కరభంబు హరిదంష్ట్రికముల నిమురుఁ
గొండముచ్చులు కొండగోఁటియులఁ గొనగోళ్ల
నొయ్యనొయ్యన గోఁకు నెయ్యమెసఁగఁ
గేలిమై జిహ్వకాకిసలయాగ్రము సాఁచి
నాగుఁబాము ఫణంబు నాకు ముంగి
తే. యడవిపిల్లుల నెలుకలు నాడుఁ గూడి
జాతివైరంబు లుడిగి ప్రసన్నబుద్ధి
సకలమృగములు ననురక్తి సంచరించు
వామదేవుని యాశ్రమవనమునందు. 104

క. ఆవనము గాంచి యేముని
పావనుఁడో యిచట నున్న భవ్యుఁడు చూడం
గావలయు ననుచుఁ జని యా
భూవరుఁ డవ్వామదేవుఁ బుణ్యుని గాంచెన్. 105

క. శుకశౌనకాదిసన్ముని
నికరంబులు గూడి నిఖిలనిగమోపనిష
త్ప్రకరము లదుగం దెలిపెడు
నకలుషచిత్తునకు మ్రొక్కి యతివినయమునన్. 106

క. పుణ్యుండవు శాస్త్రప్ర
వీణ్యుండవు నిఖలమౌనివిసరంబులలో
గణ్యుండవు బహుపుణ్యశ
రణ్యుండవు భారతీశ్వరప్రతిమానా!. 107

క. ధన్యుండవు కామార్థవ
దాన్యుండవు నిఖిలశాస్త్రతత్త్వమనీషా
మాన్యుండవు నిర్జితభవ
మన్యుండవు బ్రహ్మబోధమయ! శాంతనిధీ!. 108

చ. పరుసముసోఁకి లోహము శుభస్థితిఁ గాంచనమైనరీతి మీ
చరణసరోజవందనవశంబున దేవ! మదీయదేహముం
బరమపవిత్రవాగ్గరిమఁ బ్రస్తుతి కెక్కెఁ గృపారసోదయ
స్ఫురదురులోచనాంబురుహ! భూరితపోధన! శాంతసాధనా!.

వ. అని యివ్విధంబున సంస్తుతించిన రుక్మాంగదభూమిపాలకుం
జూచి యవ్వామదేవుండు. 110

ఉ. సేమమె! భూవరేణ్య! సరసీరుహమిత్రకులాగ్రగణ్య! నీ
భూమికి నీకు భార్యలకు భూసురకోటికి నాప్తమంత్రికిన్
శ్రీమహిళాధినాథపదసేవక! భాగవతాగ్రగణ్య! నీ
నామముసంస్మరింపఁగ వినంగలవారలఁ బొందుఁ బుణ్యముల్.

క. ఉన్నాఁడా? నీపుత్త్రుఁడు
విన్నాఁడా? సకలశాస్త్రవిశదముఁ దెలియన్
గన్నాఁడా? హరితత్త్వము
మన్నాఁడా? బంధుజనసమాజం బలరన్. 112

క. సేవించునె సత్పురుషులఁ
గావించునె భక్తి విప్రగణముల నెపుడున్
గావించునె పెద్దలఁ గని
భావించునె విష్ణుదేవుపదపద్మంబుల్. 113

వ. అని మఱియును. 114

క. ఏలితివి ధర్మమున నిలఁ
బోలితివి భగీరథాదిభూనాయకులన్
దోలితివి గర్వితారుల
వ్రాలితి వఖిలైకభాగ్యవైభవగరిమన్. 115

ఉ. విష్ణుపరాయణుండవు పవిత్రచరిత్రుఁడ వప్రతీపస
ద్వైష్ణవధర్మమార్గపదవర్తివి నిచ్చలు నిత్యసత్యవ
ర్తిష్ణుఁడవైన నిన్ను నుతింపఁగ వేడుక నాదుజిహ్వకున్
దృష్ణదొలంగ దెప్పుడు సుధీజనపోషణ! సత్యభాషణా!.116

ఉ. పూజ్యుఁడ విప్పు డీనిఖిలభూధరముఖ్యులలోన నీదుసా
మ్రాజ్యముపావనంబుగుణరత్నసుధానిధి యచ్యుతుండు సా
యుజ్యము నీకు నిచ్చు సదయోజ్జ్వల! తథ్యముధర్మనిర్మల
ప్రాజ్యరమావిశేష! బుధపద్మవిరోచన! చారులోచనా!.

సీ. పుత్రికారత్నంబు భూషణాన్వితముగాఁ
బుష్పతల్పమునందుఁ బొందుపఱిచి
ప్రణుతింపఁదగిన శ్రావణమాసశుక్లప
క్షద్వాదశిని వేదశాస్త్రములను
ఘనుఁడైన ధరణీసురునకు దక్షిణపెట్టి
దానమిచ్చిన నీవ్రతంబు మాన్య
శయనవ్రతంబనఁ జను నీవ్రతము నీవు
సలిపినాఁడవు తొల్లి జనవరేణ్య!

తే. తత్ఫలంబునఁ బుణ్యకాంతాలలామ
భామ సంధ్యావళీదేవి భార్య యయ్యె
నఖిలరాజ్యంబునకు రాజవైతి వచ్యు
తాంఘ్రివరభక్తియును గల్గె నంతమీఁద. 118

క. నాయుజ్జ్వంబును గలిగెడు
నాయచ్యుతు కరుణచే మహావ్రతనియతిన్
శ్రీయుత! కీర్తివిభూషణ!
నీయట్టి కృతార్థు ధారుణిన్గలి నెఱుంగన్. 119

ఆ. అనుచు వాసుదేవుఁ డమ్మహీపాలక
సార్వభౌము నిట్లు సంస్తుతించి
విమలచరిత! మంగళమునందు విష్ణుకా
మేశ్వరుండు పార్వతీశ్వరుండు. 120

సీ. చీనాంబరంబులు సేవకాలికి నిచ్చి
కరటిచర్మములు చొక్కముగఁ గట్టు
ఘనసారగంధసంఘము భృత్యులకు నిచ్చి
భసితాంగరాగ మేర్పడ నలందుఁ
డారహారము లాశ్రితవ్రాతముల కిచ్చి
భుజగభూషణము లేపున ధరించు
నమృతదివ్యాన్నంబు లంఘ్రిభక్తుల కిచ్చి
కాలకూటమ్ము వేడ్కను భుజించు
తే. నాత్మరక్షయు నొల్లఁ డత్యంతభక్తి
హితుల రక్షించు చో సాటి యెన్నఁగలరె
దైవకోటులు దైవతోత్తంసమునకు
నెందుఁ జర్చింప విష్ణుకామేశ్వరునకు. 121

ఉ. కోరినయిష్టసంపద లకుంఠితభక్తి నిరంతరంబు ని
ద్ధారుణి నిచ్చు మర్త్యులకుఁ దత్పురతం జననాథచంద్ర! నీ
వారుచిరేందుమౌళిచరణాంబురుహంబులు గొల్చిరమ్మునం
సారభవైకసౌఖ్యశుభశాశ్వతలక్ష్ములు నీకుఁ గల్గెడిన్. 122

క. ఆపర్వత మీచోటికి
భూపాలక! నికటమందుఁ బొమ్మనియనుపన్
భూపాలుఁ డరిగి సేనల
నాపర్వత మొద్ద నిలిపి యచలం బెక్కెన్. 123

సీ. కిన్నరగంధర్వగీర్వాణకాంతావి
హారహాటకగుహాభ్యంతరములఁ
బద్మరాగారుణప్రకటప్రభాశోభి
ఘనమైన శృంగసన్యాకంధరముల
శృంగసంజనితవిస్తీర్ణనిర్మలనీర
నిస్సరద్బహుసానునిర్ఘరముల
చమరీమృగవ్రాతసంచారకమనీయ
పుష్పశోభితకుంజపుంజములను
తే. మత్తబర్హిప్రజానందమయనవీన
నృత్తమంటపనానామహీరుహములు
గండశైలోపరిస్థలక్రౌంచహంస
నిచయదీర్ఘికలనుఁ జూచె నృపవరుండు. 124

క. చింతామణివేదులు శశి
కాంతశిలలు పరుసవేదిఘనరసకూపా
భ్యంతరకస్తూరాగరు
సంతానమహీరుహములు జనపతి చూచెన్. 125

మానిని. ఆసమయంబున మన్మథమాధవులంబుజగర్భునియాన
తి నుల్లాసమునం జనిమందరశైలవిలాసవనంబులనిల్చిరిభా
మాసఖులున్ జనుఁ దెంచిమనంబునమక్కువలీరికలెత్తఁగన
వ్యాసవసన్నిభు డాసిచరించి రవారణవారణయానములన్. 126

వ. అప్పుడు. 127

క. పుక్కిట మందారవుమధు
వక్కజముగ నునిచి యమరి యలరంగ గుత్తుల్
క్రిక్కిరియం జేసి బొగడకు
గ్రక్కున నొక కలువకంటి గర్వం బెసఁగన్. 128

క. గురుకుచకుంభము విరియఁగఁ
బరిరంభణ మాచరించి భామాతిలకం
బరుదార నొకతె పువ్వులు
కురవకముసఁ గలుగఁ జేసెఁ గొల్లలు మీఱన్. 129

ఉ. క్రొన్ననవిల్తు హేతియనఁ గోమలి యొక్కతె గండపాలికల్
వన్నియ వెట్ట లేనగవుల న్విరు లొక్కట యుప్పతిల్లఁగాఁ
బొన్నకుఁ జేసె వాసనలు పుణ్యము నాలుగుదిక్కులందు న
త్యున్నతలీలఁ బర్విమురదమొందజవంబునఁ జేయుచుండఁగన్.

క. మదరాగవేగమున నొక
మదిరాయతనేత్ర పుష్పమంజరు లెన్నే
న్నదలించె షట్పదంబులు
బెదరి చనఁ జనుపకమునఁ బ్రియ మలరారన్. 131

క. కొనగోరఁ జెనకి యొకసిత
వనరుహదళనేత్ర వింతవాసనతోఁ గ్రొ
న్నన లొత్తఁ జేసె నిమిషం
బున మామిడిమోకఁ బికసమూహం బలరన్. 132

క. క్రొవ్వాడిచూపుగమిచేఁ
బువ్వులు వొడమించె నొక్కపూఁబోఁడి కడుఁ

ముస్వాముసఁ దిలకతరువున
నువ్వున మకరందధార లుప్పతిలంగన్. 133

ఉ. పల్లవకోమలంబయిన పాదసరోజ మొకింత సాఁచి ఘల్
ఘల్లుననందియల్ మెఱయఁ గామినియొక్క తెదా నశోక
ముల్, గెల్లుమనంగఁ దన్నికలిగించెనుగోరకరాజి నేర్పుసం
ధిల్ల ననంగుకొల్వు జగతిందగు దీపచయంబులో యనన్.

క. మలయజకస్తూరీపరి
మాళమును గలయూర్పుగముల మన మలరఁగఁ బా
టలభూమీరుహమునఁ బు
వ్వులు గలుగఁగఁ జేసె నొకచివురుఁబోణి దగన్. 135

ఉ. పంచమసుస్వరంబున విపంచికమ్రోయువిధంబుమీఱఁగాఁ
జంచలనేత్ర యొార్తు వినసన్నధురధ్వనితోడఁ బాడి క
ల్పించెఁ బ్రసూనమంజరులు ప్రేంకణమునొనగయించితధ్వ
నుల్, ముంచివ్యగ్ర ప్రతానముల మోహావళంబును నొందఁ
జేయుచున్. 136

క. అందియలమ్రోఁత నొక యర
విందాయతచారునేత్ర విరహులు గలఁకన్
దుందిలసుమన స్తబకము
లందున సురపొన్నవొసఁగునట్లుగఁ జేసెన్. 137

ఇవి దశవిధదోహదములు.

క. చిగురులు జొంపమ్ములు పువు
మొగడలు దరవికచపుష్పములు పుష్పెళ్లన్
జిగిదక్కిన భూరుహముల
నిగుడించెను మాధవుండు నిముసములోనన్. 138

సీ. మల్లీమతల్లికామాధవీమకరంద
సౌరభ శ్రీ మించెఁ జల్లగాలి
పరిపక్వకదళికాఫలరసంబులు గ్రోలి
కలకలంబులు చేసెఁ జిలుకపిండు
మాకందపల్లవోన్మాదమోదంబునఁ
గూఁక లేయఁ దొణంగెఁ గోకిలమ్ము
బహువుష్పమంజరీ ప్రకరాగ్రములయందు
మొకరితుమ్మెదగీతములు చెలంగెఁ
తే. జికిలిచేసిన క్రొవ్వాడిచిగురుములుకు
లలరువిలుఁ బూని చనుదెంచె నంగభవుఁడు
మాధవుఁడు తోడఁ జను దేర మనుజవిభుఁడు
నరుస జనియించు శృంగారవనమునందు. 139

తే. అవుడు మోహిని రుక్మాంగదావనీశుఁ
డమ్మహాపర్వతమునకు నరుగుదెంచు
టాత్మ నీక్షించి వక్షోరుహాంబు గదియ
రత్నవల్లిక నిల్పి ప్రయత్న మలర. 140

సీ. తంత్రులనూని చేతఁబిగించి జీవాళిఁ
బొందించి సారెలు పొందువఱచి
స రి గ మ ప ద ని స స్వరసప్తభేదసం
గతులను లక్ష్యలక్షణము లెఱిఁగి
మంద్ర మధ్యమ తార మధురిమ శ్రుతు లెత్తి
గరిమ స్త్రీపురుష రాగములఁ దెలిసి
భావసంకీర్ణ వేళావేళ వీక్షించి
జంత్ర గాత్రము లొక్కసరణిఁ బనర

తే. వీణె మ్రోయించెఁ బరిపరివిధములందు
నానతులు చేసి మృదురీతి నాలపించి
యమృతలహరీవికాసంబు లతిశయిల్లఁ
బాడె సమ్మోహినీకాంత భవుని మ్రోల. 141

క. శంకరుని శుద్ధసాళగ
సంకీర్ణప్లుతలయప్రసారణలీలన్
బంకజగంధియుఁ దరులత
లంకురముల నొందఁ బాడె నభినవలీలన్. 142

క. వీణాదండ మిగుర్పఁగ
రాణగ నలువదియు నాల్గు రాగంబులు స
త్ప్రాణములై వర్తింపఁగ
నేణంబులు సొగయ నామృగేక్షణ పాడెన్. 143

ఉ. మానవనాథుఁ డం దమరమంజులగానరవంబు వీనులన్
బానము చేసి మైమఱచి పన్నగ కిన్నర సిద్ధ కామినీ
గానముఁ గానమిట్టు త్రిజగంబుల నెయ్యెడ నంచు మాధురీ
గానము పజ్జ గా నరిగి కామినిఁ గాంచె శివాలయంబునన్.

సీ. కలికి కన్నులు చూపు కమల విద్యుల్లతా
ప్రభల నీనుచు నేత్రపర్వ మలరఁ
గస్తూరితిలకంబు ఘర్మాంబువుల జారి
యలికభాగమునఁ జె న్నలవరింపఁ
ముత్యాలతాటంకములకాంతి మెఱుఁగుఁ జె
క్కులమీఁద నిండు వెన్నెలలు గాయ
జిలుగుపయ్యెదలోని వలిచన్నుఁగవ తళు
కులు కుందనంపునిగ్గుల నొనర్పఁ

తే. కుచభరంబున విలసిల్లు కల్పవృక్ష
సూనసౌరభ మఖిలంబు జోడుముట్ట
విశ్వమోహనరూప మై వీణె మీఁటు
నతివ మోహిని వీక్షించె నవనివిభుఁడు. 145

క. వలరాయఁ డపుడు కోవెల
బలములు దుమ్మెదలు మందపవనుఁడు గొలువన్
జిలుకల తేరెక్కి మహీ
తలనాథుని నంటనార్చెఁ దక్షిణమాత్రన్. 146

సీ. అలరులు విలుచేసి బలిమితుమ్మెదనారిఁ
బుష్పచాపమునందుఁ బొందుపఱచి
వడి గుణధ్వని చేసి వలఁతిపువ్వులకోల
నేర్చి చక్కఁగ వంకఁదీర్చి పూని
చెఱకుసింగిణివింట నొఱపుగా సంధించి
తెగనిండుగాఁ దీసి దృష్టి నిలిపి
మనుజనాయకుని మర్మంబులు గుఱిచేసి
సరిగోల వడి నేసె సరభసమున
తే. భావభవసాయకమున నప్పార్థివుండు
పరవశతఁ బొంది మూర్ఛతోఁ బవ్వళించెఁ
బాట చాలించి మోహినీభామ యప్పు
డవనినాథునిఁ గాంచె నెయ్యంబుతోడ. 147

చ. తనదు నిజాంకపీఠమున ధారుణినాథుశిరంబు నిల్పి చం
దన ఘనసార కుంకుమ ఘనస్తనదీప్తులు చౌకళింపఁ బా
ఱ నిధృతిఁ బట్టుపయ్యెద చెఱంగుఁ గరంబునఁ బూని వీచెనం
గన నవరత్నచారుకటకధ్వను లొక్కట ఘల్లుఘల్లనన్.

తే. ధారుణీనాథుఁ డాకళాంతతడవునకును
దెలిసి యమ్మోహినీకాంతదిక్కుఁ జూచి
పులకితానందగాత్రుఁ డై కలయ దంత
జనితదీప్తులు పర్వ ని ట్లనుచుఁ బలికె 149

ఉ. కిన్నర సిద్ధ సాధ్య సుర ఖేచర లోకములన్ జరించు నా
కన్నియలందు నిట్టి త్రిజగన్నుతరూపవిలాసరేఖ లేఁ
గన్నది లేదు నేఁడు తుదగా నలినాయతచారునేత్ర! నీ
విన్నగమధ్యభూమిఁ జరియించుట కేది తెలుంగు సెప్పుమా.

ఉ. ఎక్కడ జన్మభూమి తరళేక్షణ! నీతలిదండ్రు లెవ్వ రే
దిక్కున నుండు దీవు నినుఁ దేరి కనుంగొనినంతమాత్రనే
యక్కటికింత లేక యలరమ్ముల పాలుగఁ జేసె మన్మథుం
డొక్కక్షణంబు నిల్వనికఁ నోపను నీదయ గల్గ కుండినన్.

శా. నాతోడం బ్రియభాష లాడఁగదవే నన్నేటి కీక్షింపవే
ప్రీతిన్ కౌఁగిలనుంచి నాకొసఁగవే బింబాధరోద్యద్రుచుల్
నీతారుణ్యపయోధి నాతనువు పై నేఁడుబ్బి రాఁజేసి నా
చేతోజాతదవానలం బుడుపవే సీమంతినీ! మాటికిన్. 152

సీ. వివిధమాధుర్యముల్ చెవులపండువులుగాఁ
బూని నీమృదువాక్యములు వినంగ
వింతయుంతయు లేక వేడుకవిలసిల్లుఁ
జనవుమై నీపదాబ్జములతోడ
వరకుచద్వయము నావక్షస్స్థలము గాఢ
గరిమతోడుత నిన్నుఁ గౌఁగిలింపఁ
బరిపరిగతుల వ్యాత్తవక్త్రంబు వికసింప
నీదు వర్ణశ్రీల నీకుఁ జూప

తే. సంతసం బయ్యె నీవంటి సౌమ్యమూర్తి
కగు ననందగు మృదువాణి! జగతి నెఱుకఁ
గాన సామ్రాజ్యపట్టంబు గట్టి నన్ను
భక్తి నిగుడంగఁ బాలింపు పద్మనయన!. 153

చ. మొకరిపిసాళితుమ్మెదలమూఁకకు గంధపుగాలిరాకకుఁ
బికరిపతాకుడాకకును మామిడిమోకకుఁజంద్రుకాఁకకుఁ
బికములవీఁకకుఁ సిరులఁ బేర్చినయామనియూఁచునూకకుఁ
జకితకురంగాక్షి! యోర్వనిఁకజాలఁగృపామతి నాదరింపుమా

క. ఆలింపుము నామాటలు
చాలింపుము వేఱె యొకవిచారము రతులఁ
బాలింపుము పుష్పాస్త్రుని
నేలింపుము నీదుకౌఁగి లిచ్చి లతాంగీ! 155

క. మరునిశరంబులచే మే
నెరియుచు నుండంగ నోర్వ నేక్రియ నచ్చుఁ
గరుణించు నను "నహింసా
పరమో ధర్మ" యను పలుకు భామిని! వినవే!. 156

ఉ. భువనరాశివేష్టితమహీవలయంబున కెల్ల రాజ నా
దేవులు నూర్వు రందు సుదతీమణి పట్టపుదేవి యొప్పు సం
ధ్యావళి యన్వధూటికి నిజాత్మజుఁ డొక్కరుఁడింతి! నాపురం
బావిదిశామహానగర మంబుజమిత్రకులాగ్రగణ్యుఁడఁ.

క. నా నామము రుక్మాంగద
భూనాథుఁడు నాకుఁ గల్గు భూచక్రంబుఁ
సేనలును నన్ను నీకును
గానుకగా నాత్మలోనఁ గైకొను మబలా!. 158

సీ. సకియ! నీ నెమ్మోము చంద్రబింబముతోడ
వలతి నెత్తమ్మితోఁ జెలిమి సేయుఁ
గలికి! నీనేత్రముల్ గండుమీనములతో
మరుని బాణములతో మచ్చరించు
నెలనాఁగ! నీకురు లింద్రనీలములతో
మొకరితుమ్మెదలతో ముద్దుగులుకు
భామ! నీ చనుదోయి పసిఁడికుంభములతోఁ
గరటికుంభములతో నొరయుచుండుఁ
తే. త్రిభువనంబుల లావణ్య మభినవముగఁ
బద్మసంభవుఁ డొనగూర్చెఁ బడఁతి! నీదు
భువనమోహనరూప మద్భుతముగాఁగఁ
జేసెఁ గాఁబోలుఁ దప్ప దీక్షించి చూడ. 159

ఆ. పార్థివేంద్రుఁ డిట్లు పలికిన పలుకుల
కాత్మ మోద మంది యామృగాక్షి
నాథ! నావిధంబు నలిలేక యింతయు
విన్నవింతు విను సవిస్తరముగ. 160

సీ. నలినసంభవుని మానసపుత్త్రిఁ గమలజుం
డనురాగమున నన్ను నాదరించు
నతనిసమ్మతి నిమ్మహాద్రి నేఁ జరియింతు
నీకామినీమణుల్ నాకు సఖులు
పగలు రేయును భయభక్తితోడుత నిష్ట
కామేశ్వరుని సముఖమున నుండి
పూజసేయుదు నాకుఁ బురుషు లెవ్వరు లేరు
నాపేరు మోహిని భూపతిలక!

తే. స్వేచ్ఛ విహరింతు వల దని హితవు చెప్ప
వార లెవ్వరు లేరు శృంగారలీల
మనసునకు వచ్చి కనుపట్టు మగని నెఱుఁగ
నెఱుఁగఁ పదివేలమాటలు నెఱయ నాథ!. 161

మ. ధరణీనాయక! నిన్వరింపు మని తాత్పర్యంబుతోఁ బల్కె దే
కరణిం గూడఁగవచ్చు భార్య లెసగంగా నూర్వురున్నారునీ
వరపుత్రుండు మహాఘనుండు మహిషిన్ వారింపఁగావచ్చునా?
పరితోషంబులు గానివాక్యములు భూపా! పల్కఁగా నేటికిన్.

క. మానినులు నూర్వు రుండం
గా నను నేరీతి మేలుగా నేలెదవో
భూనాథ! జరుపవచ్చునె
గానుగనదలాబ్ధికంప్రిగల్పము తోడన్. (?) 163

క. స్త్రీనెప్పటియట్లయ నీ
దేవులసన్నిధికిఁ బొమ్ము ధృతిఁ బదిలుఁడ వై
నావుడు నన్నరనాథుఁడు
దేవుఁడు వినఁ బల్కె నాసతీమణితోడన్. 164

ఉ. కామిని! నిన్నుఁ బాసి చనఁగా నిముసంబునుఁ జాల మన్మథుం
డేమియు నిల్వనీఁడు తపియించుచు నున్నది మేను భామినీ
స్తోమము నొల్ల నగ్రసతితో నొకనాఁడును గూడియుండ నీ
స్వామియు సాక్షిగాఁ దరుణి! సత్యము పల్కితి నమ్ము నీమదిన్.

తే. అతివ! నీ వేమి చెప్పిన నట్ల సేతు
దాఁట నీమాట కడిగెడుతత్పరతను
నీకు వశవర్తి నై యుండి నీమనంబు
సంతసము నొందఁ జేయుదు సంతతంబు. 166

ఉ. నామహిలోపలంగల జనంబులు నాప్రియనందనుండు నా
కామిను లేను నీకుఁ గలకాలముఁ దప్పుము సర్వసంపదల్
భామిని! నీవశంబ యని పార్థివముఖ్యుఁడు చంద్రశేఖర
స్వామికిఁ జెయ్యిఁ జాఁచి మగువన్ ముద మొందఁగఁ జేసెఁ [జయ్యన్.

క. గంధగజాసురమదని
ర్గంధనుఁ డగు శివుని మౌలిఁ గాంతామణితో
గాంధర్వవివాహము నృప
గంధేభం బవధరించెఁ గౌతుక మలరన్. 168

వ. తదనంతరంబ 169

క. తరుకోటరముల ఖగములు
తరుణుల కౌఁగిళ్లఁ బతులు తామరలను ష
ట్చరణములు నుండెఁ బశ్చిమ
శరనిధి రవి గ్రుంకునంత సరభసలీలన్. 170

ఉ. అంతట సూర్యబింబ మపరాచలశృంగముఁ జేరె దిక్కులం
తంతట నుద్భవించెఁ దఱచై గగనస్థలి మించెఁ గాంతిచేఁ
గాంతలతావితానములు గానఁగ నయ్యె స్తైలదీపికా
కాంతిసమున్నతిప్రభలఁ గల్గునంబులవాఁడె గ్రక్కునన్

ఉ. కాయజు మేనమామ కఱకంఠునియౌదలపువ్వు వాహినీ
నాయకపుత్త్రుఁ డానలిననాభుని ముద్దుమఱంది కౌముదీ
ప్రాయపుదుంప యంబురుహబంధునియొడ్డె చకోరజీవనో
పాయమహౌషధంబుసితభానుఁడు గానఁగఁబర్వెఁదూర్పు

క. ఫణిరాజమస్తములపై [న్.
మణులరుచుల్ చించి తూర్పు మహి వెడలెనొకో

క్షణమాత్ర మనఁగఁ జంద్రకి
రణముల్ పూర్వాద్రిపైఁ దిరంబై తోఁచెన్. 173

క. అంతకుమునుపే యాభూ
కాంతుఁడు సంధ్యాదినిత్యకర్మంబులు ని
శ్చింత నొనరించి గౌరీ
కాంతుని దర్శింప నరిగెఁ గౌతుక మలరన్. 174

సీ. కపిలాఘృతస్వచ్ఛకరదీపనివహముల్
తపనీయపాత్రికాదీప్తుల నలర
మహిసాక్షి కర్పూరసహజకాలాగురు
ధూపముల్ నడసి రీతులఁ దలిర్పఁ
గల్పనూనకదంబకహ్లారమాలికా
వివిధగంధంబులు వెడలఁజల్లఁ
బ్రాకారగోపురాగ్రద్వారగేహాళీ
ఖచితరత్నప్రభాగరిమ నిగుడ

తే. దివ్యవైభవవిస్ఫూర్తిఁ దేజరిల్లు
నమ్మహాదేవు శ్రీనిలయంబులోనఁ
దరియఁగా నేఁగి ధాగుణీతలవిభుండు
సహజభయభక్తిఁ బార్వతీశ్వరునిఁ గాంచి. 175

క. నందారుభక్తజనతా
మందారంబైన యయ్యుమానాథున కా
నందమున భూమిపాలక
కందర్పుఁడు మ్రొక్కె మోడ్పుఁగరములతోడన్. 176

ఉ. దేవ! త్రిలోకనాథ! భవదీయపదంబుల నెవ్వఁడేని రా
జీవదళంబు కం డిదు విచిత్రము వాఁ డమరావగాతట

స్థావర పారిజాత హరిచందన కల్పకదామ శోభిత
స్త్రీవిలసత్కుచాగ్రములఁ జెందిసుఖించు నహర్నిశంబులన్.

మ. భవబంధంబులు వాయు రోగచయముల్ భస్మంబులౌ దు
ష్కృత, వ్యవసాయంబులసే రణంగు శుభముల్ వర్ధిల్లు సౌ
ఖ్యంబు లొం,దు వివేకంబును గూడు సంపదలుఁ బొందున్
గీర్తి శోభిల్లునో, శివ! గౌరీశ్వర! నీపదాబ్జములనీక్షింపన్
[మదిన్ గల్గినన్. 178

సీ. దంభోళిధరసతీతాంబూలపేటీషు
దహనబింబాధరీ స్తనభరేషు
శమనశుద్ధాంతయోషాఫాలభాగేషు
నిర్ఋతిసాధ్వీముఖనీరజేషు
కంధినాయకబాలికాకర్ణపత్రేషు
గంధవహాంగనాకచభరేషు
రాజరాజాంతఃపురస్త్రీకరాగ్రేషు
కరకంఠభామినీకటితటేషు

తే. చంద్రశకలంతి హారంతి చందనంతి
విశదహాసంతి హీరంతి విచికిలంతి
దర్పణంతి దుకూలంతి తవ యశాంసి
క్లేశభవభంగ! యిష్టకామేశలింగ!. 179

అచ్చతెనుంగు.

ఉ. మేనిసగంబుతూపు పసిమిన్ మెఱుఁగెక్కినవిల్లు తేరునున్
బూనుపరాని గుఱ్ఱములు పుట్టఁ దనర్చిన వారిజోడు గా
నాననిబండికండ్లు నడియాడనివెన్నరదంబుగూర్చి నీ
వేనటిమూఁడుప్రోళ్ళు సికయెత్తునవోర్చితి వేల్పురాయఁడా!.

వ. అని యివ్విధంబునఁ బ్రస్తుతించి యమ్మహాదేవు ప్రసాద స్వీకారం బొనర్చి పరమేశ్వరావాసంబు వెడలి మహీపాల శేఖరుండు పుష్పితాకుంజమంజుమంటపాంతరపల్లవసం స్తరంబున నమ్మోహినీకాంతకుచాలింగనచుంబనభాషణం బుల సాత్వికోదయం బొనరించి యనంతరంబ. 181

సీ. భద్రుని రతికళాప్రౌఢిమ నిరసించి
దత్తకుఁ గలయికల్ ద్రస్తరించి
కూచిమారుని పెనుకువ లాత్మలో రోసి
పాంచాలు సంభోగభంగిఁ దెగడి
నందపుత్రునిరతానంద ముద్వాసించి
యింద్రనందను కేళి నెరవుచేసి
నలకూబరుని మన్ననలు వింత లొనరించి
పంచాస్త్రురీతిఁ బ్రాభవ మెలర్పఁ
తే. దమకమునఁ గొంకులను వహాతహాలు నిగుడఁ
దరుణిఁ జాకితిబంధభేదములఁ గలసి
వలచి వలపించి సౌఖ్య గర్వంబు దక్క
యున్నప్రాణేశుఁ జూచి సముత్సుకమున. 182

క. సతి సలిపె నుపరతిని బ
ర్వతములు చలియింప నభము వణఁకఁగఁ దారల్
గతిఁ దప్ప శశి స్రవింపఁగ
మతి నురగము దలక వసుము మైకొనిపొదువన్. 183

వ. తదనంతరంబ. 184

సీ. ఒదికిలి శయ్యపై నునిచిన మేనులు
తలగడ నిడిన హస్తద్వయంబుఁ

కటులపైఁ గట్టిన కట్టంశుకంబులు
వన్నెగా మోడ్చిన కన్నుఁగవయుఁ
గలయఁగ నిమిరిన కస్తూరిచెమటలు
తలఁపులు వెలిసిన తత్తరములు
చవులానుటీగిన చక్కెరమోవులు
చదురొప్పఁ బెనచిన మృదుపదములు
ఆ. కటులు వదలియున్న కౌఁగిళ్ళఁ జిటిలిన
గంధములు వెలుఁగ గరిమతోడ
నిధువనాంతమందు నిద్రలఁ జెందిరి
పతియు సతియు వేడ్క లతిశయిల్ల. 185

వ. అయ్యవసరంబున. 186

చ. వెలవెలఁబాఱెఁదూర్పుదెసవిల్లుమనోభవుఁడెక్కుడించెఁదా
రలు పొదివిప్పఁజొచ్చె నరుణ క్రిఁజెలంగెరథాంగదంపతుల్
జలజము లుల్లసిల్లె విలసద్గతి వీచెఁ బ్రభాతవాయువుల్
కలకలఁబల్కెఁ బక్షులు వికాసముకల్వలఁబాసెనయ్యెడన్.

చ. కుముదినితోడి రాత్రియనుకూలతఁగూడిన భృంగవల్లభుల్
బ్రమదమెలర్పఁ దోడుకొని పద్మినికై మలయానిలుండు నె
య్యము విలసిల్లఁదెచ్చిపొలయుల్కలు ప్రాణసఖుండుదీర్చె
మోహము విలసిల్లఁగాఁ బ్రియుఁ బ్రియాంగనతోడను
[గూర్చుకై వడిన్. 188

సీ. కిరణంబు లొకకొన్ని తరుమండములయందు
నలరు పల్లవభాతి నలరుచుండఁ
బ్రభ లొక్కకొన్ని గోత్రమహీధరములందు
ధాతుబలస్ఫూర్తిఁ దనరుచుండ

నంశువు లొకకొన్ని హారిదంతకరులందు
సిందూరపత్త్రక శ్రీలఁ దనర
రుచు లొకకొన్ని చారుసముద్రములయందు
విద్రుమావళిఠీవి విస్తరిల్లఁ
తే. గరము లొకకొన్ని సౌభాగ్యకరణు లగుచు
భూనభోభాగపరిపూర్ణభూతిమహిమ
జూడ నొప్పారె బుధజనస్తుతులు చెలఁగఁ
బ్రాజ్యగాగ్రంబుపైఁ దోఁచె భాస్కరుండు. 189

వ. తదనంతరంబ. 190

ఉ. భూవరుఁడింతినెచ్చెలులుపుష్పసుగంధియుఁగొల్చితోడరాఁ
గా విభవంబెలర్పఁ జని గాంచెఁ దదగ్రమునన్ సువర్ణరా
జీవసితాబ్జషండము నశేషభయాపహయదుఃఖఖండమున్
బావనకాండమున్ సుకృతపాలనశౌండము ముక్తికుండ
[మున్. 191

[illegible]. కని మహీవిభుండు కడుభక్తితోఁ దీర్థ
మాడఁ దలఁచుటయు మృగాయతాక్షు
లవనినాథుఁ గూడి యపుడు జలక్రీడ
సలుపఁగోరియున్న సమయమందు. 192

మానిని. వారిజలోచన యొక్కతె మున్నుగ వారివిహారము
సల్పమదిన్, గోరివినూత్నవిభూషణజాలము గొబ్బున నూడి
చి భామలతో, వారక కన్గొని యింపెసఁగన్ జెలువంబున
మన్మథుపువ్వుదొనన్, శ్రీరమణీయరుచుల్ నిగుడన్ విల
సిల్లెడు నబ్బరిగోల యనన్. 193

ఉ. వారివిహారముల్ సలుప వారిజలోచన లుత్సహించి కా
సారతటంబునందు విలసన్మణికాంచనభూషణావళుల్
వారకయూడ్చి పెట్టి చెలువంబున నొప్పిరి పండుటాకు లే
పారఁగ నూడ్చి కాంతిఁ జెలువారెడి పుష్పలతాలికైవడిన్.

ఆ. సతులు గొలని కరుగ శశికాంతసోపాన
ములను నీడ లధిపుమూర్తిఁ జూడ
సంభ్రమంబెలర్పఁ జనుదెంచిన జలాధి
దేవతలవిధమునఁ దేజరిల్లు. 195

చ తనయుపకంబునం దొకసుధాకరబింబముఁ గల్గఁజేసె న
ప్పవనిధి యేమిచిత్రమని వారిరుహాకర మంబురాశిఁ గా
దని సితచంద్రబింబముల నప్పుడు గల్గఁగఁ జేసెనో యనన్
వనితలమోము లింపెసఁగ వావిరిగుబ్బలబంటినీరునన్ 196

చ నరపతిగాఁ గన్గొని మనంబున నుబ్బి ప్రమోదనృత్తముల్
సరసియొనర్చెనో యనఁగఁ జారుతరాభినయోర్మిహస్తముల్
దరవికచాంబుజాక్షములు దద్దయు షట్పదనాదగీతముల్
పరిశ్రుతకంఠకాహళులు భాసురమై విలసిల్లె నల్లెడన్. 197

క. పొరిఁబొరి నుడుగక తోఁగెడు
తరఁగల రోమోద్గమంబు దళమై నిగుడన్
ధరణీపతి తరుణులు దా
సరసిని దోయముల నపుడు స్నానముసేసెన్. 198

చ. అలికులవేణియొక్క తె ప్రియుంబునఁ జారుసహస్రపత్రముల్
మొలవునవైవ రేకు లవి మేనున నంతట నిండి యవ్విభుం
డలవునఁజూడనొప్పెనవుడత్తులు వేయునుసొంపుమీఱఁగా
నలరు శచీమనోహరుని యాకృతికిం బురుడింపఁ బాడియై

క. వలుఁదకుచకుంభములయం
దలఁదిన మలయజము గరఁగ నంగజముద్రల్
వెలిఁ గనుపట్టిన క్రొక్కునఁ
గలకంఠి యొకర్తు గప్పెఁ గచనిచయమునన్. 200

తే. అంగనల చన్నుఁగవలపై నలఁదియున్న
కప్పురము కస్తురియు నీటఁ గరఁగి తెలుపు
నలుపునయి గంగయును యమునయును గలసి
నట్టిచోటునుబోలెఁ బద్మాకరంబు.   201

ఉ. ఆజలకేళి సల్పుచు లతాంగులు జక్కవముద్దుమోము లం
భోజములంచుఁ దుమ్మెదలు పూనికతోఁ జనుదెంచి నీలవి
భ్రాజితకుంతలద్యుతులు పన్నుగఁ గ్రన్నన యన్యపట్పద
వ్యాజమెలర్పఁ బాసిచనినాఁటనొండొకపువ్వుదోఁటకున్.

చ. వదనసరోజవాసనకు వావిరిమూఁగెడు తేఁటిమొత్తముల్
చెదరఁగఁదోలలేక యొకచేడియ భామలసందుదూరి తా
నుదకము లోమునింగి యసమొప్పఁగ నొండొకచోటఁదేలి
యూ, సుదతుల షట్పదంబులను జోకఁ గనుంగొని నవ్వు
[దవ్వులన్. 203

ఆ. వనజకర్ణికలు సువర్ణతాటంకముల్
పుష్పరజము గంధములు బిసములు
తారహారములునుగా రాజముఖులను
సరసి చెలువొనర్చె సంభ్రమమున. 204

కలశాబ్ధియందు లక్ష్మీ
లలనం గనుఁగొని వెడలు విలాసంబున న

యిర్యలవతి మోహినియును దాఁ
గొలని వెలికి వచ్చి యాత్మఁ గుతుకం బలరన్. 205

చ. అగుణములై నకస్సుఁగ నలంచితమౌ పులకాంకురంబులున్
గరఁగినయంగరాగములు గానఁగఁబడ్డ యనంగముద్రలున్
విరిసినక్రొమ్ముడుల్ దనర వెల్వడి రంగన లాసరోజినిన్
సురతసుఖావసానవరసుందరులం బురడింపఁ బాడియే.

క. తరుణులు మోహినియు నవాం
బరగంధము పుష్పములును బహుభూషణముల్
ధరియించిరి సుందరశ్రీఁ
బరఁగిరి మన్మథుని సాలభంజిక లనఁగన్. 207

తే. జనవరుండును ధవళవస్త్రములు గంధ
పుష్పములు రత్నభూషణములును దాల్చి
దివసముఖకృత్యములు సల్పి దేవదేవు
నిష్టకామేశ్వరునిఁ బార్వతీశుఁ గాంచి. 208

సీ. మందారములయందు మందాకినీజూటుఁ
బద్మంబులను బద్మభవశిరణ్యుఁ
గాంచనంబులయందుఁ గాంచనాచలచాపు
నాగకేసరముల నాగభూషుఁ
బున్నాగములయందుఁ బున్నాగవిధ్వంసు
నర్కసూనములఁ గోట్యర్కతేజుఁ
బుండరీకములందుఁ బుండరీకాజినుఁ
గరవీరములను సుధాకరకిరీటు

తే. రాజరాజంబులను రాజరాజసఖుని
బాణకుసుమంబులను బంచబాణవిజయుఁ

బాటలంబులఁ బాటలప్రస్ఫురజ్జ
టాకలాపుని బూజించె లోకనుతుఁడు. 209

శా. అంభోజాక్షియుఁ దానుభూరమణుఁడిట్లా దేవుఁ బూజించి సం
రంభం బొప్పఁ బ్రణామముల్ సలిపి తోరంబైన సద్భక్తితో
శంభో! శంకర! శాంత! శాశ్వత! శివ! స్థాణో! భవో మా తే!
శుంభద్భక్తుల మమ్ముఁ బ్రోవఁ దగు నంచుం సన్నుతుల్
[సేయుచున్. 210

తే. తత్ప్రసాదంబు గైకొని తత్క్షణంబ
యమ్మహాదేవు శ్రీనిలయంబు వెడలి
గోపురద్వారమున నిల్చి కువలయేశుఁ
డతివ మోహినిఁ జూచి యిట్లనుచుఁ బలికె. 211

ఉ. ఓ వనితాలలామ! వికచోత్పలలోచన! నా బలంబు లీ
గ్రావసమీపధాత్రి సుకరంబుగ నున్నది తద్బలంబులన్
శ్రీవిలసిల్లఁ గూర్చుకొని శీఘ్రమె పోవలె రాజధాని కే
లా వనభూములం దిడుములంబడ రాజ్యసుఖంబు గల్గఁగన్

క. అని పలికి యతివఁ దోడ్కొని
జనపతి శైలంబు డిగ్గి సరభసలీలన్
జను దెంచుచోట దవ్వులఁ
గనుఁగొని యుర్విభునిఘోటకము ముద మొదవన్. 213

క. హేషారవములు మృగకుల
భీషణముగఁ జేసి యంఘ్రిఁ బృథివీస్థలి సం
తోషమునఁ ద్రవ్వి భువి న
న్వేషింపఁగ నపుడు ధారుణీవిచరమునన్. 214

ఆ. బల్లియొక్క టుండి పడపాతి వీఁపుతో
వెల్లి నగలి పడి మహీస్థలమునఁ
బొరలి యాడుచుండ భూపాలకుఁడు గాంచి
కరుణ నెమ్మనమునఁ గడలుకొనఁగ. 215

ఆ. పాణిపంకజమునఁ బైతోలుఁ గదియఁగా
నిమిరి చల్లనౌజలములఁ జిలికి
శీతలస్థలమునఁ జెన్నొందఁగా నుంచి
పల్లవముల నివ భామ చూచి. 216

మత్త. దీని నీక్రియ ముట్ట నేటికి దీని ముట్టినమాత్రనే
స్నాన మాడకి కాదు పాపవుజాతివు ర్వీది దేవ! నీ
జ్ఞాన మెక్కడఁ బోయె ధర్మవిశారదుండవు దీని నీ
కాననంబున వైచి యీతురగంబు నెక్కు రయంబునన్.

చ. కరుణ యొకింతలేక గజగామిని నిష్ఠురభాషలన్ ధరా
వరుఁ బలుమాఱుదూర నృపవంద్యుకరాబ్జము సోఁకినంతనే
దురితమువాసి బల్లి సతితో నబలా ' యిది పాపమా మహా
ధ్వరములు ప్రాణిరక్షకు సదా సరిగావని పల్కు వేదముల్.

క. ధరఁ గల పుణ్యఫలంబునఁ
గరుణారతిఁ బ్రాణి నొకటిఁ గాచిన ఫలముల్
సరిమాన్పఁ బ్రాణిరక్షా
పరతఫలమె ధర్మములకు బలువై తూఁగెన్. 219

చ. కరుణనుమీఱఁ బుణ్యసుధికారముబోలను బాపముల్ హరి
స్మరణనుమీఱఁ దీర్ఘముఁ బ్రజాపరిపాలనమీఱయజ్ఞముల్
విరహముఁబోలరోగము వివేకముఁ బోలవిభూషణంబు మ
చ్ఛరమునుఁ బోలదుర్గుణము చంద్రనిభానన కల్గ నేర్చునే.

వ. అని మనుష్యవాక్యంబులం బల్కి బల్లి పూర్వజన్మంబునం
దా నొనర్చిన దురితంబునం దనకు గృహగోధికాజన్మంబు
ప్రాప్తమైనవిధంబును వినుపించెద వినుమని మహీపాలతిల
కంబుతో ని ట్లనియె. 221

క. నృపవర విను మేఁ గొంపి
ల్యపురంబున ననఘుఁడగు ధరామరుతనయుఁ
గృపమాలి నావిభుం డొక
చపలాక్షిం గూడి నన్ను సరకుం గొనమిఁ. 222

సీ. ప్రాణేశ్వరుండు చేపట్టునా నన్నంచు
గ్రహబలంబులు ద్విజప్రతతి నడిగి
చెలువుండు నను నిరీక్షించునా ప్రియముతో
ననుచుఁ బోచిళ్ళు నిత్యమును బోసి
పతి నన్నుఁ జనవుమైఁ బాలించునాయని
ధైర్యంబు వదలి సోదనలు చూపి
నాథుండు నన్ను మన్నన నేలునా యంచు
శకునంబు వేమఱుఁ జాల నరసి

తే. బలులకై నాకిటకు వచ్చుబడుగుజోగి
జంగమయ్యలఁ బూజలు సలిపి సలిపి
యెందు నొకయింత విశ్వాస మే నెఱుంగ
కున్నచో వచ్చె సిద్ధురా లూరి కొకతె. 223

సీ. పండువెన్నెలనిగ్గు పరిఢవించినభూతి
సర్వాంగకములఁ దేజం బెలర్పఁ
బచ్చవన్నియలఁ జూపట్టు పచ్చనిబొంత
గుబ్బచన్నులమీఁదఁ గొమరుమిగుల

వజ్రాంకురప్రభావళిఁ జేర్చు ధవళరో
మాగ్చులు కర్ణద్వయమున నమరఁ
బద్మరాగచ్ఛాయఁ బ్రహసనం బొనరించు
యోగదండము కేల నొఱపు దనర
తే. వలుఁదము త్రియముల సాటి వచ్చు సంకుఁ
బూసపేరులు గళమున భాసురముగఁ
జండికామూర్తికరణిఁ బ్రసన్నబుద్ధి
భైరవస్థానమున నున్న భామకడకు. 224

క. పానకము ఫలచయములుఁ బ్ర
సూనంబులుఁ దమ్ములములుఁ జూపట్టంగాఁ
గానుక నేఁ గైకొని య
జ్ఞానవకడ కేఁగు దేర నంగన లచటన్. 225

సీ. జంబీరనీరసర్షపతైలములతోడఁ
బరిపక్వమై పేచ్చు నుండివాల్లు
మరిచికాధూళి రాముర జీరకామిశ్ర
మై తీనర్చిన కుక్కుటాంశచయము
బహుళసద్యోఘృతప్రకరాభిషేకార్ద్రి
సంయుక్తమైన మత్స్యవ్రజంబు
నీరువెల్లఁగనొత్తి నిప్పుల నంపంవఁ
గమ్మఁగాఁ గాల్చిన కట్టుకుట్లు
ఆ. పేల్చుముదుసువంట పిట్టలతాలింపు
సన్నగూర గాలి జంబుక్రొవ్వ
మొదలుగాఁగ మాంసములు సుఖంబున వండి
రంబుజాతగంధు లనువుపఱిచి. 226

ఆ. శార్కరంబు నూనజము గుగ్లు సుమఘృత
జంబు నారికేళజంబు మాధ్వి
కంబు ఫలమయంబు గౌడతాళమయంబు
నాదిగాఁ దనర్చు నాసవములు 227

క. స్ఫాటికపుగుండు గిన్నెల
హాటకకళశి కాంతిమయము లగు ఝషకములన్
వాటముగ వారివారికిఁ
బాటలగంధులు ధరించి పరమప్రీతిన్. 228

క. తద్దయు శుద్ధిప్రసాదము
ముద్దియ లందుకొని దిస్సమొల వేల్పునకున్
నిద్దపుమధు విడె యంబిక
కద్దెసఁ బెట్టించి మ్రొక్కి హర్షం బొదవన్. 229

ఆ. ఖజ్జములును మాంసఖండముల్ కర్పూర
శకలసంచయమును జవులుగొనుచు
నక్క! గుక్కెఁ డింద యబ్జాక్షి! చవిచూడు
మనుచు నోలిఁ గ్రోలి రాసవంబు 230

సీ. దుగ్ధాబ్ధి గిలుకరింతుర నిలింతుర నిలింపులు చల్లి
యీయాసవము చవి యెఱిఁగిరేని
పాలు వెన్నలు గ్రోలఁ బాఱునే కంసారి
యీయాసవము చవి యెఱిఁగెనేని
తిన్నడిచ్చినకఱ్ఱ తేనియఁ ద్రావునే
యీయాసవము చవి యెఱిఁగెనేని
యన్యాంగనాధరం బానునే జంభారి
యీయాసవము చవి యెఱిఁగెనేని

ఆ. వనజవదనలార! మనపాలిభాగ్యంబు
లందుఁ జేసెవేల్పు లాసవంబు
నందు రుచు లొకింత యైననెఱుంగని
కతన బోఁడిగొల్ల గలిగె మనకు. 231

క. పులఖండంబులు దేనెయు
ఫలరసమును శర్కరయును బానకములు నో
చెలియా! యీవారుణియెం
గిలితుంపురు కైన సరియె కేవలరుచులన్. 232

క. ఈలాటిమధువు గలుగక
జాలింబడి రమగు లమృతసాగర మనుచున్
బాలేఱు వాఱుచుండఁగఁ
బోలునె వారగొడ్డు వెంటఁ బోవఁగఁ దమకున్. 233

చ. తమముఖదర్పణంబులు ముగంబున నాసవపూర్ణపాత్రలం
దమరఁగఁ దోఁచినం జలరుహాక్షులు గన్గొని రోహిణీసతీ
రమణుని గంటిరే మనకరంబున సింధురసంబు గ్రోలఁగాఁ
బ్రమదమెలర్పనిందుఁబడిపాయఁడుమన్మథుఁడప్రమత్తుఁడై.

ఉ. నాచెవిచేరుచుక్క మదవారసలోచన యొప్పియున్నదే
చూచితెగుబ్బచెక్కులను సొంపునుగాటుకతీరు కొప్పునున్
జూచితెయందియల్ మెఱుఁగుచొక్కటఁ బొల్చునె తారహార
ము, లాచ్ఛవిచూచితేనయనవల్లభఁగస్తురిపువ్వుపాన్పునన్.

క. అని వనజముఖులు సొక్కునఁ
దనువెఱుఁగక పలుకుచుండఁ దాఁ జని వినయం

బున మ్రొక్కి సిద్ధురాలిం
గని కరములు మొగిచి భక్తి గడలుకొనంగన్. 236

చ. పతి ననునొల్లఁ డవ్విభునిఁ బాయుటకోర్వఁగఁజాలనక్కటా
గతియిఁక నాకు నెద్ది గజగామిని! యానతియిమ్మటంచు దు
ర్గతమున సిద్ధురాలికి గ్రమంబునఁ జెప్పినఁ బెట్టుమందునీ
పతి కిదిపాలఁతోనిడుము భర్తవశుండగునంచుఁ బల్కఁగన్.

క. ఆమందు వల్లభునకున్
బ్రేమంబునఁ బాలతోడఁ బెట్టిన నధికం
బై మాత్ర దప్ప దప్పియుఁ
దామసమును మేనఁ బొడమెఁ దత్క్షణమాత్రన్. 238

క. పలపులమం ది ట్లిడ మొ
క్కలమునఁ బతి సమసెఁ జెమరకాయలు పర్వన్
దొలఁకిరివానం దడియఁగ
నలయఁగ నిర్ఘాతపాత మాననుకరణిన్. 239

తోటక వృత్తము

కపటౌషధ మీక్రియఁ గాంతున క
త్యపరాధముతో నిడినందున కే
నపుబల్లివి గమ్మని వాక్పతిపా
పపుజన్మముఁ బొందఁగఁ బంచె ననున్. 240

మ. ధరణీశా! యిదికారణంబున ననాథత్వంబునం బల్లినై
ధరపైఁబుట్టి యనేకదుఃఖములచేతం జిక్కి నే నీపదాం
బురుహాస్పర్శనభుంబులందొలఁగివిస్ఫూర్తిన్ సురావాసమున్
గరిమన్గాంచెదనంచుఁబల్కి చనియెన్ గాంతాశిరోరత్నమై.

వ. అని నైమిశారణ్యవాసులైన మునీశ్వరులకు సూతుం డెఱిఁగించె నని యటమీఁది వృత్తాంతం బెట్టి దనిన. 242

శా. ద్రాక్షారామవిహార! హారఫణికాంతా! కాంతచంద్రాగ్నిసూ, ర్యాక్షా! యక్షయపుణ్య! పుణ్యజనసేవ్యా! సేవ్యకాకోలకో, ఱక్షాత్రైకవిదార! దారసురబాలా! బాలవాచాలచా, రుకక్షుంకరభావ! భావభవగర్వగ్రాననిర్వాపణా!.

క. పురదైత్యదర్పసంహర!
హార!పర్వతనిలయ! పాపహార! నిర్మలహృత్
సరసీరుహాభవ! సనకసు
వరదా! వరదానసదన! వారితమదనా!. 244

అంగజాస్త్ర మనువృత్తము.

అంగజాంగభసితాంగరాగసా
రంగధారఫణిరాజభూషణా
భృంగిహార్దసుభృత్యశిష్యమా
తంగదైత్యభుజదర్పభంజనా. 245

గద్యము ఇది శ్రీమత్పార్వతీశ్వర వరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనానందచర్య ప్రౌఢకవిమల్లనార్య ప్రణీతంబైన రుక్మాంగదం బను మహాపుణ్యకథ యందు పద్మగర్భు నియోగంబున ననేకక్రూరమృగంబుల నుద్భవించి సకలజనమనోభయంకరంబుగా వర్తించుటయుఁ దద్రాజ్యంబునం గల మానవు లెఱుంగ రుక్మాంగదాపనీశు

నకుఁ దద్వృత్తాంతంబు విన్నవించుటయు నమ్మహారాజశేఖ
రుండు జగదుపకారార్థంబుగా వేఁటచని యందు ననేకదు
ష్టసత్వంబుల వధించి వేఁటసాలించియరుగుచో వామదేవ
సంయమిం గాంచుటయు నమ్మహామునియనుమతంబున నిష్ట
కామేశ్వరదేవదర్శనార్థం బా నీశ్వరుండు మందరనగంబు
న కరిగి యందు శంకరావాసంబునందు నిందురేఖామౌళి
సమ్ముఖంబున నమ్మోహినికన్యకఁ గాంధర్వవివాహంబునఁ
వరించి యద్దివ్యలింగంబు సేవించి మోహినీసహితుండై
శైలంబు డిగ్గి చనుటయు గృహాగోధికాఖ్యానంబును నన్న
ది తృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# రుక్మాంగదచరిత్రము

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీధరకుంతలసతతా
రాధకవాణీశ యోగరమణీయకళా
నాధసుమందిర హిమవ
ద్భూధరతనయేశ దక్షపురిభీమేశా. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె
నట్లు గృహాగోధి తనపూర్వజన్మప్రకారం బెఱింగించి శాప
విముక్తయై దివ్యకాంతాసహస్రంబులు గొలువ దివ్యవి
మానారూఢయై నాకంబున కరిగినపిమ్మట నమ్మహీపాల
శేఖరుండు చతురంగబలసమేతుండై. 2

సీ. అగ్రభాగమునఁ బాండ్య విదర్భ కేరళ
పాంచాల బలములు బలసి కొలువ
వెనుకదిక్కున నాటవిక కళింగ పుళింద
యవన సైన్యంబు నెయ్యమున నడువ
నుభయపార్శ్వముల గౌళోత్కళ మగధాంధ్ర
ఘూర్జర బలములు గూడి నడువ
నడుమ నానాచమూనాయకుల్ భద్రేభ
ఘటలతో ననురక్తిఁ గదసి చనఁగఁ

తే. పార్థివేంద్రుఁడు మోహినీభామతోడ
వరరథారూఢుఁడై మహావైభవమునఁ
గదలెఁ దమ్మట భేరీముఖస్వనములు
చెలఁగి యొక్కట దిశలెల్లఁ జెవుడుపడఁగ. 3

సీ. చరణఘట్టనలచే సర్వంసహాచక్ర
మరవరలై యల్ల నాడుచుండ
గమనవేగముచేతఁ గదిరిన పెంధూళి
యరుణాంశుమండలం బస్తమింపఁ
గరిఘటప్రపై స్రేలు ఘంటారవములచేఁ
బేర్చి దిగ్భిత్తులు బీఁటవాఱ
ఘనతరాయుధసముత్కరదీధితులచేత
మెఱయుచూపులుమిఱుమిట్లు గొనఁగ

తే. నడుమనడుమఁ బదార్థముల్ గడిమిఁ దెచ్చి
సముఖమగు భూమిపాలుర సంతసమున
నాదరింపుచు గురుకరహాటమగధ
శకమహారాష్ట్ర పాండ్య దేశములు గడచి. 4

మ. చనుచోఁజాగులుమున్నగాఁజని నిజస్థాపాలుఁడే తెంచునేఁ
డనిధర్మాంగదుతోడఁజెప్పిన మహావార్తంబుతో మంత్రులన్
దనవారిన్ బిలిపించి రాజనగరుం దత్పట్టణంబున్ రయం
బునశృంగార మొనర్పఁ బంచికదలెన్ భూనాథునిన్ గానగన్.

సీ. నవరత్నమయసమున్నతరథావళులతో
గంధదంతావళఘటలతోడ
మానసాశుగవేగమహితాశ్వతతులతోఁ
బటులవిక్రమవీరభటులతోడ

మౌక్తికచ్ఛత్రచామరకేతనములతోఁ
సమరోగ్రబిరుదచిహ్నములతోడ
సచివ దండాధీశ సామంతనృపులతోఁ
గవి గాయ కార్థి మాగధులతోడఁ
తే. గదలి ధర్మాంగదుఁడు నిజజనకునకు
నెదురుగాఁ జని ధరణీశ యేంద్రుపాద
నలినముల కర్థి దండప్రణామశతము
లాచరించిన తనయుని హర్ష మొదవ. 6

ఉ. దీవన లిచ్చి రమ్ము కులదీపక! యంచును గౌఁగిలించి యా
భూవరుఁ డాదరం బెసఁగఁ బుత్రుని గాంచి తనూజ! సేమమే
దేవులకున్ ధరిత్రికి సుధీజన బాంధవ విప్ర దాస దా
సీ వివిధాశ్రితావళికిఁ జేయుదురే భవదాజ్ఞ భూప్రజల్. 7

వ. అని యెల్లవారల సేమంబులుం దెలియ నడిగి మోహినిం జూపి గాంధర్వవివాహంబున నిక్కన్యకారత్నంబు మందరాచలంబున వరియించి తెచ్చినవాఁడ ఇది బ్రహ్మమానసపుత్రి. నీకు జనయిత్రి యగుంగావున నివ్వధూమణికి దండప్రణామంబు లాచరించి భయభక్తితాత్పర్యుండవై తోడు కొనిపోయి నాగరసముచితం బగు తావునం బ్రయత్నంబున విడియింపు మని యప్పగించిన నతం డట్లకాక యని వినయమ్ముగా నమ్మహాదేవికి దండప్రణామంబు లాచరించి యక్కాంతాతిలకంబు గొని చనియె. అంత రుక్మాంగద మహీపాలుండు. 8

సీ. బిరుదప్రతాపవిస్ఫురితప్రబంధముల్
వందిమాగధులు చెన్నొందఁ జదువ

లలితస్వరమునఁ గల్యాణముల్ పాడుచుఁ
జేరి పుణ్యాంగనల్ సేసలిడఁగ
నగ్రజన్ములు మౌక్తికాక్షత ల్చల్లుచు
వేదమంత్రముల దీవింపుచుండ
వేత్రహస్తు లనేకవిధముల నుభయపా
ర్శ్వములందు సందడుల్ జరుపుచుండ
తే. భద్రదంతావళము నెక్కి పార్థివుండు
మౌక్తికచ్ఛత్రములనీడ మందయాన
మునఁ బురంబుఁ బ్రవేశించి కనకరత్న
హర్మ్యశోభితరాజగృహంబు గదిసి 9

తే. భద్రదంతావళము డిగ్గి పార్థివేంద్రుఁ
డపుడు పాంచాలభూపాలు హస్తమూఁది
యరిగి నవరత్నఖచితసింహాసనమున
విభవ మలరంగఁ గొలువున్న వేళయందు. 10

సీ. పద్మరాగనవీనపాత్రికాప్రభలకుఁ
గరనఖద్యుతులు శృంగార మొసఁగఁ
దిన్ననై విలసిల్లు దీపదీప్తులకును
గలికికన్నులడాలు చెలు వొనర్ప
ఘనసారవర్తికాకలితగంధమునకుఁ
దనుసౌరభంబు మోదంబుసేయ
మధురమంగళగీతమహితనాదములకుఁ
గరకంకణధ్వనుల్ గరిమ యిడఁగ
తే. మెఱుఁగుఁజెక్కుల కాంతులు నెఱయఁ బర్వ
వజ్రతాటంకరుచులకు వన్నెవెట్ట

వారిజానన లపుడు నివాళ్ళు లొసఁగి
రమ్మహీపాలునకుఁ బ్రయత్నమ్ము లలర. 11

క. అంతఃపురమునకుం జని
సంతసమున నాత్మసతుల సంధ్యావళి భూ
కాంతుండు చూచి వారల
నెంతయు గౌరవముఁ జేసి యిట్లని పలికెన్. 12

మత్త. ఓ సఖీమణులార! చెప్పెద నొక్కమాట వినుండు నే
నాసదాశివుమ్రోల మోహిని నంబుజాయతనేత్రి ను
ల్లాస మొప్ప వరించి దానితలంపులోన మెలంగఁగా
బాసచేసినవాఁడ మందరపర్వతాలయవేదికన్. 13

మత్త. పంచబాణుని సాయకంబుల బాధకోర్వఁగఁజాల కే
నంచయాన వరించువేళ నొకప్పుడున్ మిముఁగూడి వ
ర్తించఁ గాదని యింతి నన్నుఁ బ్రతిజ్ఞఁ జేసిన నట్ల కా
వించఁ బాల్పడినాఁడ నట్లొనరించఁగాఁదగు మీరలున్. 14

క. అని పలికిన ప్రాణేశుని
సునిశితవాక్యములు నాత్మ సోఁకఁగాఁ జిన నా
వనజాతపత్రనేత్రలు
తనువులఁ గంపమును భయముఁ దలకొని నిగుడన్. 15

సీ. కారుక్రొమ్మెఱుఁగులో కనకంపుబొమ్మలో
శంబరాంతకుఁ బుష్పసాయకములొ
కలికిరాచిలుకలో కంతుదీపంబులో
లలిమించు నవకల్పలతికలొక్కొ
రాయంచకొదమలో రతిపువ్వుబంతులో
శ్రీఁ దనర్చిన చంద్రరేఖలొక్కొ

నవ్యరత్నంబులో నననవిల్తునాతులో
శృంగారరసరూపజీవకళలొ
తే. యనఁగఁ జెలువారు రుక్మాంగదావనీశు
సతులు నూర్వురు నొక్కట ధృతి గలంగి
యువనినాయకుఁ జూచి నెయ్యంబుతోడ
ననధగింపుము దేవ! మహానుభావ!. 16

సీ. దరహాసముల నొక్కతరుణీలలామంబు
మధురభాషల నొక్కమచ్చకంటి
సయ్యాటలముల నొక్కచంద్రబింబానన
ననురక్తి నొకవిద్రుమాధరోష్ఠిఁ
కరుణాకటాక్షవీక్షణ నొకపువ్వుఁబోణి
జన విచ్చి యొక్క యబ్జాతగంధిఁ
గస్తూరిపంకమంగమునలం దొకయింతిఁ
దాంబూల మిడి యొక్కతరళనయన
తే. నర్మ లిగిరొత్త నీరీతి నాదరింతు
బహువిధంబుల మమ్ముఁ దాత్పర్య మెసఁగ
దేవ! నీకూర్మిభార్యలత్రోవఁ దక్క
దక్క నేటికి నొకసుధాధామముఖికి. 17

చ. పతియనురాగమొంది ప్రియభామలనెందఱఁ బెండ్లియాడి
నఁ, సతులకుసమ్మతింపఁదగుఁజంచలనేత్రలఁ దొంటిభాను
లఁ, క్షితివర!మానఁగాఁదగునెచి త్తమునఁ గృపలేక మా
మనో, గతులు గలంగుచున్నయవి కామినికై యిటుసేయు
ధర్మమే. 18

ఆ. నృపవరేణ్య! మోహినీకాంత మాకంటె
నెంత చక్కనిది యిదేల భ్రమయ
వింత యొక్కచూపు వేయొక్కచవి యగు
నన్నపలుకు నిక్కమయ్యె నేఁడు. 19

క. ఏమిటికి నీదు మతికిని
రామైతమి మమ్ము విడువరాదని యెంతేఁ
ప్రేమం జెప్పిన విన విటు
మామాటలు పెరటిచెట్టు మందగునె నృపా!. 20

క. రాజాధిప నీకగుణాళి
భాజనమగు నమ్ము నిల్లుపలికిన మే మే
యోజ నినుఁ బాయనేర్తుము
జాజులు పుంగళమునందుఁ జనునే వేఁచఁగన్. 21

ఉ. ఈయిగురాకుఁబోణిఁబలెనే మము నిందఱ గారవింపు భూ
నాయక! నీవు మమ్ము జతనంబున మాని చరించెదే తృణ
ప్రాయముగాఁగఁ బ్రాణములఁ బట్టి విసర్జన సేతు మిప్పుడే
యీయెడ నీవు కన్గొనము నీఁతకుమిక్కిలి లోఁతుగల్గునే. 22

క. అన విని సంధ్యావళి యు
వ్వనితలఁ గదియంగ నరిగి వసుధాధీశున్
జనునే యీ క్రియఁ బలుకఁగ
వినయంబును భయము భక్తి నీటిన్ బోవన్. 23

ఉ. భూపతి మందరాద్రిఁబువుఁబోఁడి వరించిట లేకమున్నె యే
రూపునఁబల్కనందగువరుండు ప్రియాంగనఁ బెండ్లియాడి కా
మోపనవీనభోగములఁ బొందెదుఁబో సతులార! మీరలీ
పాపపుమాటలాడుదురె పాటెఱునీళ్ళకుఁ గట్టవేతురే. 24

ఆ. ఆదరింప నొంప నంగనామణులకుఁ
గర్త భర్తగాక క్రమము దప్పి
సతుల కెట్లు సెల్లుఁ జూడఁ బ్రాణేశ్వరు
నాజ్ఞ లేక ధృతి నవజ్ఞ చేసి. 25

క. పతి వేఱొకసతిపైఁ బ్రియ
రతి నుండఁగ నోర్వ కంతరాయంబు మనో
గతిఁ దలఁచెనేని నాసతి
యతిశయనరకమునఁ గూలు నండ్రు మునీంద్రుల్. 26

క. పతిచిత్తము నొగిలించుట
పతిమాటకు మాఱుమాటపలుకుట కినుకన్
బతి నేమేనియు నాడుట
సతికిన్ గొఱగాదు దురితసంచయ మొదవున్. 7

క. కోరి కులస్త్రీ పతిఁ బ్రియ
దారాన్వితుఁడైనఁ గినుకఁ దక్కి మదిఁ బ్రియం
బారఁగఁ జరియించుట బం
గారమునకుఁ బరిమళంబు గలుగుట సుమ్మీ!. 28

క. ఈమానినిపై మోహం
బీమనుజాధీశ్వరునకు నెన్నాళ్లో సుఖా
ఱామహిమ లెన్నిచూచెద
రేమిటికిం దమకమంద నింతటిలోనన్. 29

వ. అని సంధ్యావళిదేవి పతివ్రతాధర్మంబు దెలియఁజెప్పి
యవ్వధూరత్నంబుల మనఃఖేదంబులు మాన్పి ధైర్యం బవ
లంబించి యుండునట్లుగాఁ బ్రబోధించిన సమ్మదం బంది

యిందువదనలు తమతమ నివాసంబులకుం జనినసమ
యంబున. 30

మానిని.

ఆవసుధాధిపుఁ డంగనలందఱు నాత్మగృహంబుల కేఁగిన సం
ధ్యావళిఁ బిల్చి ప్రియంబలరార సమంచితవస్తువిభూషణ వ
స్త్రావళియున్ ఘనసారసుగంధము నాదరణన్ గృపచేసిననిం
దీవరనేత్రియు భర్తయనుజ్ఞఁ జనెన్ భవనాంతరసీమలకున్.

వ. అంత 32

లయగ్రాహి. బంగరువు మేడలఁ బొసంగు మణివేదికలఁ
జెంగలువపానుపులనుం గదలికా నా
రంగ పనసామ్రతరులం గలయు నాలయము
లంగముల కైరవరథాంగ శుకచంచ
ద్భృంగ కమలాకరములం గుసుమమంజరుల
నంగనయు రాజకులపుంగవుఁడు గాఢా
లింగనముఖస్పృహదసంగసుఖతంత్రముల
నంగ సుఖించిరి తలంగ కనురక్తిన్. 83

క. చరియించిరి గోమేధిక
మరకత వైడూర్య నీల మౌక్తిక వజ్రాం
కుర పుష్యరాగ విద్రుమ
కురువిందవు మేడలందుఁ గోమలి పతియున్. 84

సీ. మంజిష్ఠ తెఱ పట్టుమంచంబు తలగడ
విగులపానుపు పట్టివెల్లసురఁటి
పట్టుచందువ జాలవల్లికే బాగాల
పెట్టె సంబెళగచ్చు పీఁట బరణి

నిలువుటద్దము పైఁడిజలపోసనము వీణె
సరిగొప్పపళ్ళెంబు సానగిండి
గాజుపింగాణిగిల్కులపావ లడపంబు
వన్నెలగిన్నె పాన్పెంబు చిలుక
తే. తమ్మపడిగెము దివ్వె చిత్తరువుకూట
మగరుధూపంబు పుష్పాలయగరుసార
పరిమళము లెల్లఁ గొల్లలై పరఁగుచోట్లఁ
బతియు సతియును గ్రీడించి రతులగతుల. 35

సీ. జలకంబునకు వాంఛ సలుపఁ డంగనమేని
కస్తూరిచెమటలఁ గలయఁదోఁగి
ఘనసారగంధపంకముఁ దేరిచూడఁడు
సతియూర్పుకమ్మవాసనల సొలసి
నీరాంజనంబు మన్నింపఁడు విద్యుల్ల
తాక్షిచూపునివాళులందు నలరి
వస్త్రసాన్నములకై చన డింతియధరామృ
తంబున నాప్యాయనంబు నొంది
తే. యఖిలభోగంబు లశ్రాంతిముఖియె కాఁగ
బాలికామణిఁ గూడి యప్పార్థివుండు
తెల్లవారుట రాత్రియే తెంచుటయును
మఱచి నిధువనకేళిసమ్మదము నొందె 36

సీ. జలరుహాయతనేత్రి చక్కఁగాఁ జూచినఁ
దిలకమై పులకించుఁ బొలుపు మిగుల
మెలఁతకస్తురియూర్పు మేనుసోఁకినయంతఁ
గలిగొట్టుకై వడిఁ గలికలొత్తుఁ

దలిరాకుఁబోఁణిపాదము చక్కఁదాఁకిన
గరిమ నశోకమై సిరుల నలరుఁ
గాంత గుబ్బలు మోవఁగాఁ గౌఁగిలించిన
గురువకక్రియ వేడ్కఁ గొనలుసాఁగు
తే. మగువ కొనగోరఁ జెనకిన మావిమోఁక
కరణి వికసించు సర్వాంగకములు నలర
రాగమున నున్నఁ గని యనురాగ మొందుఁ
జంపకములీల సతిఁ జూచి జగతివిభుఁడు. 37

క. అలుగఁ డొకనాఁడు భామిని
యలిగిన భయమందు మాట కడ్డం బాడం
దలివేణిఁ బాసి నిముసము
నిలువం డొకచోట నృపతి నెయ్యము పేర్మిన్ 38

ఉ. ఆసమయంబునందు శరదాగమమయ్యెనభంబు తారలున్
భాసురమైతనర్చె సితభానుఁడు కాంతివహించె నాలపో
తేసరరేఁగె బిల్లిబిస రేవువహించె ఘనప్రతాపముల్
పాసిచనన్ విభావరులఁ బర్వెఁదుషారచయంబు లెల్లెడన్.

ఆ. పండె దొండముక్కు పడి రాజనం బొప్పె
నితరసస్యసమితి యెన్న వంచె
నదులు డొంకె కాలినడలయ్యెఁ నయ్యెడఁ
బంక మింకె నీరు పలచనయ్యె. 40

ఆ. వరగఁ బెరిఁగె జెల్లు గరగరగాఁ బూచెఁ
గ్రముకతరువు లఱలు గడుగఁ బడియె
తామ్రపర్ణి శుక్తితతి ముత్యములగర్భ
ములు వహించెఁ జంద్రికలు దనర్చె. 41

క. కలువలు బంధూకంబులు
కలగొన వికసనము నొందె కాఁసరగాఁదేఁ
జలజవనంబులు దొగలును
బులినంబులు కొలఁకులందుఁ బొలుపు వహించెన్. 42

తరల. సకలధాన్యసమృద్ధిచేతఁ బ్రసన్నకౌముదిచే సుధో
దకముచే ననుకూలపర్ణవితానశీతహిమంబుచే
సెకలుచల్లనిలేఁతయెండలచేత వేడుక సేయఁగా
నకట సాటియె కాలముల్ శరదాగమంబున కెయ్యెడన్.

చ. జలనిధి నిద్ర మేల్కనిన శౌరి భజింప శరత్తు వచ్చెనా
నలికులగీతముల్ పృథుసముంచితసారసకంఠ కాహళుల్
జలజసితాతపత్రములు సన్నుతకీరవచోనుతుల్ మరా
ళతులితచామరంబులు విలాసములన్ విలసిల్లె నెల్లెడన్. 44

క. కార్తికమాసము ధరణిఁ బ్ర
వర్తిల్లె ననంతరంబ వసుధేశునిస
త్కీర్తికి నుపమింపఁగఁ ద
త్కీర్తికిఁ గనుపట్టెఁ గేతకీవిరు లమరెన్. 45

క. వేల్పులు మ్రొక్కఁగ ఫణిపతి
తల్పుఁడు మేల్కాంచె నారదస్ఫుటవీణా
కల్పసుగానము కర్ణా
కల్పంబై యమృతరసము గడలుకొనంగన్. 46

క. ఆకార్తికసితపక్ష
ప్రాకటదశమీప్రభాతభాసురవేళన్
జేకొని తలవరు లప్పురి
నేకాదశి యెల్లివచ్చె నిదె వినుఁ డంచున్. 47

ఉ. ఏనుఁగు నెక్కి భేరి మొరయింపుచు నిస్సహాణాదిభేరిని
స్స్వనము లుల్లసిల్ల జలజాతహితేందువిశాలవీథులన్
మానుగఁ జాటువాక్యములు మానవనాయకుఁ డాలకించిబి
ట్టూనినతిఁ గేల్వదలి యుక్కలికౌఁగిలి వీడెఁ గ్రక్కునన్.

క. శయ్య దిగివచ్చి భూస్థలిఁ
జయ్యనఁ గూర్చుండి విష్ణుసంస్మరణముఁ దా
నయ్యెడఁ జేయఁగ విని య
త్తొయ్యలి యలుకయును సిగ్గు దొట్రుకొనంగన్. 49

సీ. నిండుఁజెందురుమించు నెలఁత నెమ్మోముతో
రాజీవమును ముకురమును సరియె
పవడంబు నిరసించు బాలకెమ్మోవితో
బంధూకమును బింబఫలము సరియె
మరుబాణములమీఱు మగువ నేత్రములతోఁ
గలువరేకులు బేడిసలును సరియె
వజ్రకాంతి జయించు వనిత మేఛాయతోఁ
జంపకద్యుతియుఁ జంచలము సరియె

తే. పసిఁడికుండల సిరసించు పద్మగంధి
ఘనకుచంబుల సరియె జక్కవలు గిరులు
ననఁగఁ ద్రిభువనసౌందర్య మతిశయిల్లు
మోహినీకాంత యాత్మేశు మొగముఁ జూచి. 50

సీ. అడుగుఁదమ్ములు సోఁకి యవనీతలంబెల్లఁ
గుంకుమప్రభల నలంకరింప
ఘనకుచంబుల మించుగముల నెల్లెడలను
బంగారునిగ్గులు ప్రబలఁ జేయ

మెఱుఁగుఁజూక్కులదీప్తిమించి దిక్చక్రంబు
విద్యుల్లతాతతివిధ మెలర్ప
చికురభారమునఁ జేర్చినచిమ్మచీఁకటి
గగనంబు హరినీలగతిఁ దనర్ప
తే. శయ్య దిగివచ్చి నునుమేనిసౌరభంబు
జోడుపుట్టుచునుండఁ గస్తూరిమృగము
సంచరించువిధంబున సరసగతులఁ
బరిఢవింపంగ మోహినీభామ యపుడు. 51

క. ప్రిదిలినపట్టాంశుకమును
వదలినకబరీభరంబు వడి నిరుగేలన్
బదిలంబుగ సవరించుచు
సుదతీమణివచ్చె రాజసుందరుఁ గదియన్. 52

ఉ. వచ్చినృపాలుఁజూచి జనవల్లభ! నాదెసమోహమంతయున్
బొచ్చెముచేసి నన్నొకపోఁకకుఁగైకొన కిప్విధంబునన్
జెచ్చెర నేఁగుదెంచి హరిచింతనఁజేసెద విందు కాత్మలో
నచ్చెరువయ్యెడిన్ మొరగ కంతయు నాకెఱుఁగంగఁ జెప్పు [మా. 53

క. వల్లభ! రతితంత్రము శ్రీ
వల్లభుచింతనము సలుప వాంఛించెదు నీ
యుల్లంబునందుఁ గంటిని
విల్లు వెలఁగకాయఁ బూన వెఱవై యున్నే. 54

క. ఆమచ్చిక లాకలయిక
లామోహము లాప్రియంబు లాసౌఖ్యములున్
భూమీశ! తలఁపవలదో
నామీఁది మమత్వ ముడుగ నాయమె నీకున్. 55

వ. అనవుడు నా రాజశేఖరుండు మోహినీకాంత కి ట్లనియె.

క. ఓజలజానన! నీపై
నోజన్ బైకొనలుసాగి యొప్పినమోహా
శ్రీ జాఱ నింతవడిలో
జాజులపరిమళమొ? మెఱుఁగొ? జలదవ్రజమో?. 57

క. నా కేల దాఁచ వినుమా
నా కేలా మోహనాంగి నా కీదివసం
బే కాంతలఁ గవయుఁగ రా
దేకాదశి విష్ణుదేవు నెదలోఁ గొల్తున్. 58

క. ఓవల్లభ ! నీవును నా
శ్రీవల్లభు నాశ్రయింపు చిరతరభక్తిన్
భావింప నాకృపాసిధి
సేవించినవారి కబ్బుఁ జిరతరసుఖముల్. 59

చ. తలఁచినఁజాలు శ్రీవిభునిఁ దామరసాక్షుని నాత్మలోపలన్
నిలిపినఁజాలు నీలమణినీరదవర్ణుని నామవర్ణనల్
పలికినఁ జాలు శౌరిపదపంకరుహంబులు భక్తితోడుతన్
గొలిచినఁజాలుఁ జేకుఱు నకుంఠితసౌఖ్యము లంబుజాననా!.

మ. హరియే దైవము శౌరిఁ జెప్పినదియే యర్థంబు ధర్మంబు శ్రీ
ధరునింగూర్చిజపించునట్టిదియె మంత్రంబచ్యుతారాధనల్
చరియింపంగలదే వ్రతంబు కరిరక్షాశీలు నానాకథా
పరిపూర్ణంబగునట్టిదే చదువు శంపాభాసురాలోకనా!. 61

క. హరిభక్తిఁబోల భక్తియు
హరిభక్తులఁబోలఁ బుణ్యు లచ్యుతుఁబోలన్

బరత త్త్వం బగుదైవము
హరినామముఁబోల మంత్ర మవనిం గలదే. 62

వ. అనుటయు నమ్మోహినీకాంత మహీకాంతున కిట్లనియె.

క. కంసారిఁ గొలువ నేటికి
సంసారసుఖంబుకొఱకు శంబరమనుపి
ధ్వంస ఘస్యఁ డంగనాభిరి
రంసాసంశోభితులకు రాజై యుండన్. 64

క. ఈడెన్నరాని సురత
క్రీడాసౌఖ్యంబు లెడలి కృష్ణవ్రతచ
ర్యాడంబరములఁ దగులుట
యోడ విడిచి వదరుపట్టు టుర్వీనాథా!. 65

చ. ఇలఁగలమానవావలికి నెల్ల నొకప్పుడుఁ జర్చసేయఁగా
వలపులరాచవాఁడె కొలువందగుదైవము మేనుబాయుటే
సలలితమైన ధర్మమని చాటెడియాగమవాక్యపద్ధతుల్
వలదె తలంపఁ జిత్తమున వారిజబాంధవవంశవర్ధనా!. 66

క. గడియయు నినుఁ బాయంగా
నోడఁబడదు మదీయచిత్త ముర్వీశ్వర! నీ
పడఁతులకు వెఱచి దినములు
గడుపం బూనుటలు నాకుఁ గానఁగవచ్చెన్. 67

లయగ్రాహి. ఆలయములందు నిజబాలురు కుటుంబినియు
జాలిఁ బడుచుండఁగను శైలగుహలందున్
బేలవఁగనుండి కకపాలయుఁ గుశాసనము
కేల నొకదండమును వ్రేలితుద దర్భల్

పోల ధరియించి మృగజాలములఁ గూడి ఫల
మూలములు పర్ణములు గాలియు భుజింపఁగ
జాలి చరియించు మునిలీల నుపవాసముల
కేల మదిఁ గోరెదు నృపాలకులచంద్రా! 68

సీ. పసిఁడికోళ్ళపాన్పులందుఁ బన్నీటజలకంబు
లాత్మేశ! యిరుప్రొద్దు నాడఁగలిగి
ఘనసారకస్తూరికాగంధసారంబు
లవనీశ! నెఱయంగ నలఁదఁగలిగి
యమృతదివ్యాన్నంబు ననయంబుఁ దృప్తిగా
క్షితిశ లేశ్వర! యారగింపఁగలిగి
మృదుతల్పమున నన్ను గదియఁ గౌఁగిటఁ గ్రుచ్చి
నృపకులేశ్వర! శయనింపఁగలిగి
తే. మడుగులను గ్రుంకఁ దిరుసున్న మైనలంద
నుపవసింపఁగ జాగరం బుండఁ గోరె
దధిప! నామెచ్చు గాదు నీయడుగులాన
వలువ దుపవాసములమీఁది వాంఛ లుడుగు. 69

సీ. పట్టెమంచముమీఁదఁ బరిరంభణము సేయు
మమరంగ నీళ్ళలో ననువునెఱవు
ముపవనంబులయందు నిపుణత్వములు చూపు
మలరుఁబాన్పులయందు నాదరింపు
కేళీగృహములందుఁ గ్రీడించు చనవిచ్చి
పూఁజప్పరములలోఁ బుజ్జగించు
తూఁగుటుయ్యెలలలోఁ దొరకించు సౌఖ్యంబు
గచ్చుటోవరులలోఁ గలసి మెలఁగు

తే. మేలములు చూపు ముత్యాలమేడలందు
భావములరింపు మురువంపుఁబందిరులను
వేడుకలు చూపు శశికాంతవేదులందు
విరహమున కోర్వఁగాఁజాల ధరణిపాల!. 70

ఉ. ఎన్నఁడునన్నుఁబాసియొకయింతయునుండనటంచు బాసయు
ప్పన్నగరాజహారుపదపద్మము లొద్ద నొనర్చి తెచ్చి నా
కన్నతికంబుఁ జూరఁగొని కాముని బారికిఁ ద్రోచి నన్ను నీ
విన్నివిధంబులందుఁ జరియింపఁదలంచుట ధర్మమే నృపా!.

ఉ. ఆడినమాటఁ దప్పగు ధరాధిపు లెన్నఁడునంచు నమ్మి నీ
తోడ వివాహమై ప్రియముతో నరుదెంచితిఁగాక కల్ల లి
ట్లాడుట లేనెఱుంగుదు నె యక్కట సత్యమువీటిఁబుచ్చి నేఁ
డూడెదుజాడఁజొచ్చితి నృపోత్తమ! యేనిఁకనుండ నీకడన్.

క. పంచాననుసేవకు దూ
రించితి రతితంత్రములకు రిత్తకు రిత్తే
వంచనఁ బొందితి నిన్ను వ
రించుట రెంటికిని జెడ్డ రేవణకరణిన్. 73

క. ఏకతము మందరంబున
శ్రీకంఠునిపాదసేవ సేయక కట్టా!
నీకడ నా కేల వృథా
పాకం బిటు లెందు నా కుపాసము చెడఁగన్. 74

క. అలయింపఁగలంతియు న
న్నలయించితి చాలు మందరాద్రికిఁ జని య
మ్మలహరుఁ గొలిచెద నేలా
కలిపోసినవెనుక నుట్లు గనుఁగొనఁగ నృపా!. 75

ఆ. అనుచు విభుని దూరి యంగనామణి రాజుఁ
బాసి నాలుగైదుపదము లరుగ
భక్తియును భయంబుఁ బ్రబలఁ సంధ్యావళీ
చంద్రవదన సరభసంబుతోడ. 76

సీ. దవలిమస్ఫైలమ్రోఁత రవణించు మంజీర
మంజులరవముతోడం జెలంగఁ
గలితకంకణఝుణత్కారంబు మొలనూలి
మొరవంపు మురువుతో ముద్దుగురియ
నవరత్నకీలితోన్నతమైన రవికపై
వలిచన్నుఁగవ దీప్తు లలమికొనఁగఁ
దాటంకవజ్రసుందరరోచులను మించి
మెఱుఁగుఁజెక్కుల కాంతి మేలమాడ
తే. జఘనభరమునఁ గౌఁదీఁగె జలదరింప
నటనయానంబు కొదమరాయంచ గమికి
విందు సేయంగఁ జనుదెంచి వినయసరణిఁ
బలికెఁ జంద్రాస్య మోహినీభామతోడ. 77

క. నలినజుమానసపుత్రిని
తలఁపఁగ నీవెఱుఁగనట్టి ధర్మాధర్మం
బులు గలవె యితరభామల
వలెఁ బలుకఁగ నేల నీకు వనజదళాక్షీ!. 78

క. పతి భక్తితోడఁ జరపెడు
వ్రతములు వలదనెడునట్టి వనితలు గలరే!
పతిమాట కడుగు దప్పక
సతులకు ననుకూలబుద్ధిఁ జరియింపఁ దగుఁ. 79

క. ఏమియు నెఱుఁగనిభామిను
లేమేనియు నంద్రుగాక యెఱుకగలిగియుఁ
బామరభామలకై వడిఁ
గోమలి! యిట్లాడ నీకుఁ గూడునె యకటా!. 80

సీ. తలఁపులో నాత్మేశు దైవంబుమాఱుగాఁ
దరలాక్షి యనురక్తిఁ దలఁపవలయు
విభుఁడు చెప్పినమాట వేదమంత్రంబుగా
నెలఁత నెమ్మనమున నిలుపవలయు
నధిపతి నియమించినది నిజవ్రతముగా
జలరుహాయతనేత్ర సలుపవలయుఁ
జెలువుఁ డాదరణ నిచ్చిన పదార్థము పది
వేలుగా నాత్మ భావింపవలయు
తే. వలయుఁ బ్రియమునఁ బెనిమిటివంకవారిఁ
బ్రాణబంధులుగాఁ జూడ భామినులకు
వలవ దధిపతి పగవారివలన మైత్రి
సేయ నెన్నండుఁ జూడ రాజీవముఖికి. 81

సీ. అభ్యంగనముసేసి యాత్మేశు నుష్ణోద
కములఁ దీర్థం బార్పఁగానువలయుఁ
బతిచిత్త మెఱిఁగి యేర్పడఁ గూడుఁగూరలు
వేళతోఁడుత నె కావింపవలయు
వివిధపక్వాన్నముల్ వేర్వేఱ వండించి
ప్రియునకు భుజియింపఁ బెట్టవలయుఁ
దద్భుక్తశేషమై తనరు నుచ్ఛిష్టాన్న
మింపుతోఁడుత నారగింపవలయు

తే. శయ్య విడలించి పైచీరె చక్కఁబఱచి
పురుషుఁ బవళింపఁ జేసి తాంబూల మొసఁగి
యూరువుల నుంచి పాదంబు లొత్తి యొత్తి
పిదప నిద్రింపఁ దగుఁ జంద్రబింబముఖికి. 82

సీ. మందె మేలములైన మాటలాడఁగరాదు
యెదురుమంచము పూన్కి నెక్కరాదు
ముదలవెట్టక వీసమును వ్యయింపఁగరాదు
కోపించెనని మదిఁ గుందరాదు
సొమ్ము వెట్టఁడటంచు సొలసి వల్కఁగరాదు
చెలువుఁ గైకొని కాని కలయరాదు
సంభోగమునఁగాని చనవు సూపఁగరాదు
కులటతో ననురక్తిఁ గూడరాదు
తే. తెల్లవారినపిదప నిద్రింపరాదు
కుడువరా దధిపతికి మున్ గూడుగూర
యన్యపురుషులతో హాస్య మాడరాదు
మఱపుతోనైన నొకనాఁడు మానినులకు. 83

చ. వ్రతములు సల్ప వల్వ దుపవాసములం గృశియింపవల్దు సం
తతమును దీర్థసేవలకుఁ దాఁ జనవల్వదు దేవతార్చనల్
ప్రతిభ నొనర్పఁగా వలదు పంకరుహాయతచారునేత్రికిన్
బతినిజభక్తిఁ దా విడిచి పామరయై నరకంబునన్ బడున్. 84

తే. కనకశైలంబు తలయుంపిగా శయించి
చిదిపి దా తేరఁబోయిన చెలువుగాదె
యిహపరము లిచ్చు పతిభక్తి నెడలి యతివ
యొండువిధమున మోక్షంబు నొందఁ జనుట. 85

క. పతి లేమి నొందినప్పుడు
నతిశయరోగముల డస్సినప్పుడును జరా
న్వితుఁ డైనయపుడుఁ బాయక
సతికిం బతిసేవ భక్తిఁ జలుపఁగవలయున్. 86

సీ. పుష్పగంధికిఁ గల్పభూజంబు పతిభక్తి
సుదతికిఁ బ్రియపూజ శోభనంబు
ధవళలోచనకుఁ జింతామణి పతిభక్తి
యింతికిఁ బతిసేవ యిష్టసిద్ధి
సితపద్మముఖికి సంజీవని పతిభక్తి
సతికి నాథునికూర్మి జన్మఫలము
మానినీమణికి నిదానంబు పతిభక్తి
భార్యకుఁ బతిదయ పసిఁడిమూట

తే. కావున మృగాక్షి పతిభక్తికలిమిఁ జేసి
యమర గంధర్వ సిద్ధ విద్యాధ రోర
గాంబుజాస్యలకంటె నత్యంతమహిమ
నూర్జితైశ్వర్యశుభముల నొందు నెపుడు. 87

చ. పెనిమిటి యన్యకామినులఁ బ్రీతి వరించిన నాత్మలోపలన్
గినుకవహింపరాదు సతికిన్ బతికిన్ బ్రియమైన యట్లుగా
వనిత చరింపఁగావలయు నల్ల భుఁడల్క వహించియుండినన్
దనపతిశయ్యఁ జేరువను దాఁ దగు భూస్థలిఁ బవ్వళింపఁగన్.

మ. పరదేశంబు విభుండు చన్నపిదపన్ బ్రాణేశురాకన్ నిరం
తరమున్ గోరుచు మేనుమాసి చెవులన్ గ్కాకులున్ జేతులం
పొరిదిం గాజులు నల్లపూసలమతిన్ జూపట్టుచుండంగ సుం
దరియుక్షింతలబొట్టునుంబసపు మోదంబొప్పఁదాల్పంవగున్.

చ. పెనిమిటిలేనిభామినులఁ బ్రీతిఁగనుంగొన దోష మర్థితో
ననయముతీర్థసేవలుసుహావ్రతముల్ నుపవాసముల్ ప్రియం
బుననొనరించియుం విధవవోలదు నాథుఁడుగల్గియున్నయం
గనయరకాలిధూళి నధికంబగు పావనపుణ్యసంపదల్. 90

సీ. కామినీమణికి మంగళసూత్రమే చాలు
 శృంగారముల కెల్లఁ జెలువొనర్ప
ధవళలోచనకు నైదువతనంబే చాలు
 వైభవంబుల కెల్ల వన్నె వెట్ట
నంబుజాననకుఁ బుణ్యస్త్రీతనమె చాలు
 రాజసంబుల కెల్లఁ దేజమొసఁగ
సతికి నాథుఁడు దృఢస్థితి నుండుటయె చాలు
 భాగ్యలక్ష్ముల కెల్లఁ బ్రభ యొనర్ప
తే. నన్నిజన్మంబులందుఁ బద్మేక్షణలకుఁ
బతిహితంబునకంటె శోభనము గలదె
యిహపరము లిచ్చు హృదయేశుమహిమ దెలియ
కధిపుతో వాదు లుడువఁగా నర్హమగునె. 91

క. పతి నలిగించుట దోషము
పతితో నలుగుటయు మిగులఁ బాపము సతికిం
బతిగడచినఁ బతితోడనె
చితిలోఁ బడవలయుఁ దగదు జీవింపంగన్. 92

క. ధవుఁడుగల యన్నిదినములు
ధవళాక్షికి భోగ భాగ్య ధర్మము లొనరున్
ధవుఁ డెడలినపిమ్మట పతి
శవ మేటికి దా నిరూపసంపదగరిమల్. 93

క. చిచ్చురికినసతి కెదురుగ
వచ్చు విమానములు ప్రాణవల్లభుతోడన్
మచ్చుగ భోగించును దివి
నచ్చరలేమలు భజింప నజకల్పంబుల్. 94

సీ. బలభేదిసతు లాతపత్రముల్ ధరియింపఁ
బావకస్త్రీ లడపములు దాల్ప
శమనభామినులు వింజామరంబులు వీవ
దైత్యసుందరులు సందడుఁజడియ
వరుణకామినులు కైవారముల్ సేయుంగ
గాలిలేమలు పాదుకలు ఘటింప
ధనదకాంతలు రత్నదర్పణంబులు చూప
శూలిబాలికలు నివాళు లొసఁగ
తే. గరుడ గంధర్వ పన్నగాంగనలు గొలువ
నగ్నిముఖముల వెడలిన యాఁరుఁబోణి
మగనితోఁ గూడ దివ్యవిమాన మెక్కి
స్వర్గమున నుండు నత్యంతవైభవమున. 95

క. పెనిమిటితోఁ జితి నురికిన
వనజాననమహిమఁ బొగడవచ్చునె లక్ష్మీ
వనితామణితోడలపయిన్
జనువున వసియించు రాజసము తథుకొత్తన్. 96

క. పెనిమిటి చెప్పినకై వడిఁ
జనవొల్లనిభామ నరకశతములఁ గూలున్
వనజాతనేత్ర! చెప్పెద
వినుమా నీకొక్కకథ సవిస్తారముగన్. 97

సీ. పదియును రెండేండ్ల ప్రాయంబుదాననై
యింతి నే నాపుట్టినింట నుండ
మాతండ్రి పనిపూని మనుజుఁ డొక్కరుఁ డొక
కాష్ఠంబుఁ జీరఁ దత్కాష్ఠమధ్య
ముననుండి యెగసి గ్రక్కున నొక్కకీటంబు
భూమిపైఁ బడిన నాపుర్వుఁ జూచి
కాకులు పఱఁగి చీకాకు సేయంగ నేఁ
బఱతెంచి యాకాకిపదువుఁ దోలి
తే. కీటకముఁ దెచ్చి వేఱొక్కచోట నిలిపి
జలము లొకకొన్ని దానిపైఁ జల్లుటయును
వేదనలఁ బాసి యాపుర్వు సేదదేరి
పలికె ననుఁ జూచి మానవభాషణముల. 98

ఉ. ఓకరుణాకలాప! వికచోత్పలలోచన! యిప్పుడియ్యెడన్
గాకులు చంపకుండ ననుఁ గైకొని కాచిన నీకృపాగుణం
బేకరణిన్ వచింపఁదగు నేఁ దొలుపుట్టువునందు భర్తపైఁ
గాఁక నొనర్చినట్టి ఘనకల్మషముల్ విను నీకుఁ జెప్పెదన్.

తే. అంబునిధితీరమున నగ్రహార మొకటి
కలదు మాణిక్యపుర మన గణుతి కెక్కి
యాపురంబున వేదశాస్త్రాగమప్ర
వీణుఁ డననొప్పు నొప్పెడు విష్ణుశర్మ. 100

క. ఆవిష్ణుశర్మపుత్త్రుఁడు
భావజనిభమూర్తి నాకుఁ బతి యై యుండున్
శ్రీవెలయఁ బద్మనాభుఁడు
కేవలవిటచక్రవర్తి కీర్తింపంగన్. 101

సీ. చదువుతోడిదోసంగు చాలించె మునుమున్న
తీర్థమాడెద నన్న తెరువు వదలె
సంధ్యాద్యనుష్ఠానసత్క్రియల్ పోకార్చె
జపహోమతంత్రముల్ చక్కఁబెట్టెఁ
గామశాస్త్రము లనేకంబు లావర్తించె
నసమానగతి జూదమాడ నేర్చె
నటవిదూషకులతోఁ బటుమైత్రిఁ గావించె
వింట నేయంగఁ బ్రవీణుఁ డయ్యె
తే. మానినీవశ్యముల్ మందు మంత్రములును
మణులు మాయలు నెఱిఁగి భామామణులకుఁ
గన్నులార్పఁ దొణంగె బంగారు వెండ్లు
వెచ్చముల్ సేయఁగాఁ జొచ్చె విప్రవరుఁడు. 102

శా. ఆభూమీసురవంశసంభవుఁడు నెయ్యంబార నాప్రోలిలోఁ
దాభామాజనమందిరంబులకు నర్థంబుల్ సదా పంపుచున్
సౌభాగ్యస్థితినొందఁబుష్పశరపూజల్ సల్పుచుండెన్ మదిన్
'కోభోగోరమణీంవినా' యనుచుఁ గోర్కుల్ మీఱ నశ్రాం
[తమున్. 103

సీ. పోకార్చె మామగా రేకాలమును గప్పు
పట్టుపచ్చడ మొక్క ప్రౌఢసతికి
నాదరంబున నొక్కయలివేణి కర్పించెఁ
బూన్కతోఁ జిరుదాలపుస్తెపేరు
కాంత కొక్కతెకిచ్చెఁ గనకంబుక్రియ నింట
భాసిల్లు సరిగోవ పళ్లెరంబు

వృత్తులన్నియు నమ్మి వెలయాలి కొకతెకుఁ
జిత్రభూషణములు సేయవేసె

తే. దర్శనం బిచ్చెఁ దాతలతరమునాఁటి
కట్టుబండి యొక రైకు నెట్టనముగఁ
బరువుతోఁగూడ నుయ్యేల పట్టెమంచ
మర్పణముఁ జేసె నొక్క శీతాంశుముఖికి. 104

క. ఇంచుకయు నే వ్యయింపక
సంచితముగ ధనము విభుఁడు సానుల కొసఁగెన్
గుంచెన్న కూడ వెట్టఁగ
మంచన మాయంబుచేసె మర్యాద లెఁగన్. 105

క. చేపట్టఁడు న న్నెప్పుడు
పాపం బని తలఁచుఁ డాత్మఁ బగలును రేయున్
గాపురుషులసంగతి దు
ర్వ్యాపారములన్ జరించు వలసినకరణిన్. 106

మ. ఇదిపాపం బిదిలాఘవం బిదికదుర్ హీనంబు దుర్వర్తనం
బిది యన్యాయపుఁగీర్తనం బిదికదుర్ హేయంబి దే వంచనా
స్పదమజ్ఞానములోకనింద యని యోజంగానడొక్కింతయున్
మదనోన్మత్తమనస్కుఁడై తిరుగు నమ్మర్త్యుండుధాత్రీస్థలిన్.

చ. నిలయము చక్కఁగానలికి నిచ్చలు మ్రుగ్గులుదీర్తు నింటికిన్
జెలువుఁడువచ్చినక్షణమె సేవలుసేయుచుఁ గూడుఁగూరలాఁ
కలిఁగొనునంచుముందఱ నె కానొనరించి భుజింపఁ బెట్టుదున్
దలఁపఁడునన్ను నెంతయునఁ దానొకనాఁడుమగండు వేడుకన్.

క. కలసొమ్ము లెల్లఁ గాంతల
కలవడఁగాఁ బెట్టిపెట్టి యవి చెల్లినచో

బలువడ్డికి నప్పులుగొని
వలదువల దనంగ నధిక వ్యయములఁ జేసెన్. 109

క. అప్పులు పుట్టక పరపతి
దప్పి చరింపంగ వారతరళాక్షులు ము
న్నప్పిచ్చినవారలు మా
యప్పులు పెట్టు మని చాల నలజడి వెట్టన్. 110

ఉ. వారలబాధచే నవయువంబులు నొవ్వఁగనోర్వలేక మా
వారికిఁ జెప్పి మీరుణ మవశ్యముతీర్చెద నే నటంచు నం
భోరుహనేత్రి! నామగఁడు బోరుననప్పులవారు దానునన్
జేరఁగనేఁగుదెంచి తనచిత్తముదైన్యమునొంద నిట్లనున్.

ఉ. కట్టిరి కొట్టి రీడ్చి రధికంబుగ లాఁగిరి గుండు ఱొమ్మునన్
బెట్టిరి చెంగఁ ద్రోచిరి తపింపఁగ నెండల నిల్పి రంటఁగాఁ
జుట్టినపచ్చడంబు వడిఁజూడఁగఁదోఁచిరి పట్టుకారులన్
బట్టిరి నిట్టుపాసములఁ బాలుగఁ జేసిరి వీర లిందఱున్. 112

శా. కాంతారత్నము నీవు నీకు సరియే కంజాస్య లెవ్వారు నో
యింతీ! నీవరరత్నభూషణచయం బీవేళ నా కిచ్చి నా
యంతస్తాపము మాన్పఁగావలయు నట్లైనన్ బ్రియంబార జే
యింతున్ వీనికి రెట్టిసొమ్ములు నునంబెంతే వికాసింపఁగన్.

మత్తకోకిల. తల్లివన్న గురుండవన్నఁ బ్రధానివన్నఁ దలంప నా
కెల్లచుట్టము లెన్న నీవ సహింపు నాయపరాధముల్
పల్లవాధరి! నిన్నుఁ బోలినభార్యకున్ ననుఁబోలు దు
ర్వల్లభుండును లేఁడు చేసినవాఁడు నీయెడదోషముల్. 114

ఉ. మానితి వారభామినుల మానితి జూదములాడ నేఁటితో
మానితి దుష్టకర్మములు మానితి నప్పులు పుచ్చుకొంటమో

మానిని! నీమనంబలర మచ్చికతోఁ జరియింతుఁ గన్నులన్
గానక మోసపోయితి నికంబెడబాయఁగఁజాలనిన్ బ్రియా!.

క. పతి కిహపరసౌఖ్యంబుల
కతిశయదుఃఖము లణంప నావత్సంప
త్పత్తులకు నెల్లకాలము
సతియ కదా కారణంబు చర్చింపంగన్. 116

క. విడువఁదగు సతిఁ జలించిన
విడువంగారాదు ప్రాణవిభుఁ గులసతికిన్
బడఁతికిఁ బతిభక్తి కదా
తొడవాయఁగఁ జన్న వికచతోయజనేత్రా!. 117

ఉ. కావుననన్ను నిప్పు డధికంబగు సత్కృపమీఱఁ బ్రోవుమిం
దీవరనేత్ర! నీవనుచుఁ దెప్పున నాచరణద్వయంబుపై, వావి
రివ్రాలి యున్న నిజవల్లభుమస్తముఁ బాయఁద్రోచి నే,నా
విభుదోషముల్ దలఁచి యప్పుడుపల్కితి నాగ్రహంబునన్.

క. తామరసలోచనాధర
సోమరసాస్వాదమునను జొక్కుచు వింస
త్కామరతి యజ్ఞదీక్షా
ప్రేమరసోదయుఁడవైన పెద్దవు చాలున్. 119

తే. పుస్తెగట్టినయది మొద లొప్పెంతఁ బోవు
ధనముఁ బ్రాయంబు వారసుందరుల కొసఁగి
యాత్రసన్యాస మిపుడు నీ వగుగుదెంచి
సత్యములు పల్కుటలు విటచక్రవర్తి!. 120

సీ. సమదృష్టి నొకనాఁడు చక్కఁగాఁ జూడవు
పేరెత్తి చీరవు ప్రియ మెలర్ప

నన్నదమ్ములు లేని దని విచారింపవు
చెలువంబునకు మెచ్చి చేరరావు
చీరసొమ్ములువెట్టి చేపట్టవైతివి
నొంటినుండఁగ భయం బుడుపవైతి
ఋతుకాల మెఱిఁగి నీహితసౌఖ్య మీవైతి
వింతసేయక గారవింపవైతి
తే. పుణ్యపాపంబు లాత్మలోఁ బూనవైతి
వగ్నిసాక్షిగఁ గైకొన్న యాలియందుఁ
బడయవైతివి తనుజులఁ బాపజాతి
వేటిమగఁడవు నీకు నే నేటియాల. 121

మ. ఇవి నాసొమ్ములు వీనిలోన మగఁడా! యేమేమి నీ విచ్చినాఁ
డవు నాతల్లియుఁ దండ్రి బాంధవులు వేడ్కల్ మీఱఁ జేయిం
చిరీ, రవణంబుల్ విను వీనిలోన నొకతారంబైననీఁజాల నీ
చెవులాకుల్ వగసేయవచ్చితివి నీచేనింత నేనోర్తునే. 122

ఆ. అనుచు విడఁగనాడి యాప్రొద్దె తనపుట్టి
నింటికరుగు నప్పులిడినవారు
నతనిఁ గట్టి కొట్టి యాఁకలఁ బెట్టుచు
నుండి రప్పు వెట్ట రోరి యనుచు 123

ఉ. ఆయెడఁ గాలకారకుఁ డహార్పతియర్ కనకంబుపూదెవై
హాయసవీథియర్ కొలిమియందుల నెత్తుఁగఁగాఁచి నీటిలోఁ
బాయకద్రోచున ట్లినుఁడు పశ్చిమవారిధిఁ గ్రుంకె శీకర
ప్రాయవిధూమరేఖలనఁబర్వె నుడుప్రకరాంధకారముల్.

సీ. గగనపల్వలసముత్కటమహాపంకంబు
నందుఁ ద్రుళ్లెడు లులాయం బనంగ

రజనీవధూటి తారకహారశోభకై
రమణఁ దాల్చిన నీలిరవికె యనఁగ
బ్రహ్మాండపటుకర్పరమున నర్కానలా
ర్చుల నుద్భవించు కజ్జల మనంగఁ
గాలధాత్రీధరాగ్రమునందు నిబిడమై
కనుపట్టు నీలమేఘం బనంగ
తే. నంధకాసురగర్వాపహారణకంఠ
ఘటితహాలాహలప్రభ గగనరేఖ
బలిమి జగ మంతయును నింత బలసె ననఁగ
నంధకారంబు జగ మెల్ల నాక్రమించె. 125

క. ఆచీఁకటికట్లు దిగం
ద్రోచి ద్విజుం డప్డు వారిఁదొలఁగి యొకరికిన్
గోచరుఁడు గాక నగర మ
హాచల దుర్గములు గడచి యరిగెడు చోటన్. 126

మహాస్రగ్ధర.

కనియెన్ గల్లోలమాలో
త్కరజనితతటాక్రాంతడిండీరపుంజం
బును ముక్తా వజ్ర నీలాం
బుజ మరకత సంస్ఫూర్తి సంశోభితంబున్
వనకోలకూర్మరదంతా
వళి మకర ఘలీ వ్యాళి మైనాకయుక్తం
బును గృష్ణా జహ్నుకన్యా
ముఖ ఘనతటినీమూర్తిభద్రున్ సముద్రున్. 127

తే. అమ్మహాంభోధిఁ జేరంగ నరుగుచోట
నవనిసురముఖ్యుఁ డీక్షించె నబ్ధిలోనఁ
గనకమయ వజ్ర వైడూర్య ఖచితమైన
కల మొకం డప్డు కన్నుల కలవుదీర. 128

క. కని యతఁ డాబేహారుల
యనుమతిఁ గలమెక్కె నదియు నప్పుడ కదలెన్
ఘనభేరీశంఖమహా
నినదంబుల నవనితలము నింగియు నద్రువన్. 129

చ. కదలి యనేకదీవు లొడికంబుగ దాఁటి పయోధిపైఁ జనన్
వదలని తీవ్రవేగమున వాయువుదాఁ బిసరె త్తినన్ భయం
బొదవఁగ నందునున్న ప్రజలొక్కటనొక్క మహాద్రి చేరుదన్
గదలకయుండగుండ లెసఁగ న్వసవై చికుదించిర య్యెడన్.

సీ. వరచకోరకతతీవ్రతతి కన్నసత్రంబు
కలితకైరవణీవికాసలక్ష్మి
బుధగుణశ్లాఘైకభోజనమంత్రంబు
తారాంగనాముఖదర్పణంబు
పృథులాంధకారనిర్భేదనోజ్జ్వలదీప
మంగసంభూతసహాయకారి
యామినీభామాకుచాగ్రచందనచర్చ
యుదధిసంచయసదాభ్యుదయశాలి

తే. సకలలోకైకమిత్రుండు జారచోర
చక్రవాకసముత్కరోత్త్రాసహేతుఁ
డబ్జహితుసంగడీఁ డమృతాబ్ధిసుతుఁడు
సోముఁ డుదయించెఁ దారకస్తోముఁ డగుచు. 131

క. తెలుపెక్కె దిశల వెన్నెల
బలుపెక్కెఁ జకోరకులకు బంధువు లయ్యెన్
బొలుపెక్కెఁ దొగలు గలువలు
నలుపెక్కెం జక్కవలకు నలవిరహులకున్. 132

వ. అయ్యవసరంబున మహీసురోత్తముండు. 133

క. ఆఁకటఁ జక్కి జలంబుల
కేఁకరి పెనుదప్పిఁ బెదవు లెండఁగ నేఁడి
ట్లీకలములోన నూరక
నా కేటికి నవయు నని మనం బురియాడన్. 134

ఉ. ఇక్కడ నీకలంబు దిగి యీఁయుచలంబు రయంబుతో జవం
బెక్కఁగ నిందుమీఁద ఫలియింపవె చూతకపిత్థకాదు లే
దిక్కున నైన నంచుఁ జను దెంచి మహానగశృంగ మెక్కి న
ల్దిక్కులుచూచి కాంచె నొకదిక్కున నిర్మలతోయదీర్ఘికన్.

సీ. కారండవ క్రౌంచసార సోత్కరటిట్టి
భ వ్రాతకలకలోద్భాసితంబు
రాజీవ కేసర గ్రాసఖాదనమరా
ళవ్యూహకూజితాలంకృతంబు
కోమలసౌగంధికామోదబిందురా
నందితేందిందిరానందితంబు
మందానిలోద్ధూతమంజులాబ్జపరాగ
ధూళినిరాఘూతధూసరితము
తే. నతులఘనదావదోహలాయాతగహన
గజఘటాటోపభయదఘీంకారితంబు

నమృతమయశీతతోయంబు నగుసరోవ
రంబు వోడఁగాంచి మదిలో ముదంబు నొంది. 136

క. ధరణీసురవరుఁ డవుడా
సరసిం జల్లఁగ మునింగి సంధ్యాదులు స
త్వరగతి నొనర్చి తృష్ణా
తురుఁడై యుదకంబు గ్రోలెఁ దొడరినకడఁకన్. 137

చ. అటచని కొంతదవ్వున ధరామరుఁ డప్రతిమానమాధురీ
స్ఫుటపరిపక్వచారుఫలశోభితచూతవనంబు గాంచి యు
త్కటమగుచున్నయాఁకటికిఁగల్గెఫలంబులుచాలనంచు న
చ్చటఁబరితృప్తిగా ఫలరసంబులుగ్రోలిముదం బెలర్పఁగన్.

క. శీతలవాయువు లొలయఁగఁ
బ్రీతిన్ శశికాంతవేదిఁ బృథివీసురుఁ డ
చ్చూతవనప్రాంతంబున
నాతతచంద్రాతపంబునందు సుఖించెన్. 139

వ. అని నైమిశారణ్యవాసులైన మునీశ్వరులకుసూతుం డెఱిం
గించిన విని యటమీఁదివృత్తాంతం బెట్టి దనిన. 140

శా. వామాంకప్రమదా! మదాహితజితవ్యాపార! పారాశర
శ్రీమార్గప్రతిపాద! పాదకటకశ్రీధార! ధారాళగం
గామూర్ధాంచితభాగ! భాగరళసంగా! సంగతాంగక్రియా
సామా!సామజదైత్యభంజన! జనస్వాతంత్ర్యకల్పద్రుమా.

క. దండధరదమన! మనసిజ
చండతరారోపవిజయజయకారణ! కో
దండధర! ధరణిభృత్ఫణి
కుండలయుగ! యుగవిరామ! గుణమణిధామా!. 142

ఉత్సాహ. దేవదానవార్చితాంఘ్రిదివ్యపద్మ, సప్తగో
దావరీజలావగాహదక్షవాటపట్టణ
శ్రీవిహార! సామవేదచిత్రగానలోల! రా
జీవమిత్ర కైరవాప్త చిత్రభానులోచనా!. 143

గద్యము. ఇది శ్రీమత్పార్వతీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనానందచర్య ప్రౌఢకవిమల్లనార్య ప్రణీతంబైన రుక్మాంగదంబను మహాపుణ్యకథయందు నవనీశ్వరుండు విదిశాపురంబుఁ బ్రవేశంబుసేయుటయు శరత్కాలవర్ణనయు నేకాదశీవ్రతోపకరణంబును నావ్రతంబుడుగుమని మోహిని మహీపాలుని నిర్బంధించి పలుకుటయు సంధ్యావళిచనుదెంచి పతివ్రతాధర్మం బెఱిఁగించుటయుఁ గాష్టకీటోపాఖ్యానంబునునందు చిత్రకథయందు పద్మనాభుండను బ్రాహ్మణుని దుర్వర్తనంబునునతం డప్పాలవారిమోఱంగి కలం బెక్కి చని సముద్రమధ్యశైలంబున వసియించుటయు నన్నది చతుర్థాశ్వాసము.

---

శ్రీరస్తు.

# రుక్మాంగదచరిత్రము.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీజంభాహితదత్తవి
తాజితకన్యావివాహరంజితహృదయాం
భోజాత! పాదపంకజ
పూజాలోకేశ! దక్షపురిభీమేశా!. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె
నట్లు సుఖనిద్రం జెందియున్న భూమీసురకుమారు నొద్దకు
నొక్క దైత్యసుందరి యేతెంచి నిద్ర మేల్కొలిపిన లేచి య
తండు నలుదిక్కులుం గలయం గనుంగొను సమయంబున.

ఉ. కాముని దీమమో మరునికైదువయో రతిచేతిచిల్కయో
కోమలిరత్నపుత్రికయొ కొమ్మెలుఁగో నవచంద్రరేఖయో
యామనిపూవుఁదీఁగెయొ జయంతునిపట్టపుదంతియో యనన్
గామినియొప్పు విప్రునికిఁ గన్నులపండువు చేసె నంతయున్.

ఉ. అంగనరూపురేఖలకు నద్భుత మంది మనంబులోపలన్
బొంగుచు నద్ధరామరుఁడు పుష్పసుగంధి! యెటుండి రాక నీ
కుం గలబంధు లెవ్వ రిటకుం జను దేరఁగ నేల నాకుఁ ద
న్వంగి! సమస్తముం దెలియునట్లుగఁ జయ్యనఁ జెప్పు నా పుడున్.

క. వనిత ధరణీసురవర్యునిఁ
గనుఁగొని యిట్లనియె నాకుఁ గలతెఱఁగెల్లన్
వినిపించెద వినుమా నా
ట్టన చల్లఁగ వచ్చి ముంత దాఁచఁగ నేలా!. 5

ఉత్సాహ. ధారుణీసురవర్య! బాహువర్వ మొప్ప నిమ్మహా
దారుణాద్రి నుండి సర్వధాత్రి సంచరించఁగాఁ
దారకుం డనేటి పేరిదానవుండు బల్మిసం
సారులన్ వధింపుచుండు సంతతంబు నల్కతోన్. 6

ఉ. నానికి భార్యనై వలయువస్తువు లెల్ల నొసర్చి నిచ్చలున్
భూనుత! కామరూపమును బూనిచరింతు సుకేశియుం డ్రున్
మానవభోజనుండు సతతంబు ననీతులు సేయుచుండఁగా
నేనవిచూచి యూర్వశి మహీసుర! నీకడ కేఁగుదెంచితిన్.7

సీ. కాశికాపురి నభంగపరాక్రముఁడు రాజు
గలఁడు పాంచాలశేఖరుఁ డనంగ
నతనికూఁతురు రూపవతి పద్మినీకన్య
మణిమయంబైన హర్మ్యంబునందుఁ
గల్వపాన్పున గళ్లగణతయప్పింపఁగా
నిన్నసంధ్యావేళ నిద్రవోవ
శయ్యతోడనె దానిఁ జయ్యనఁ గొనివచ్చి
సమతలరమ్య దేశమున నునిచి
తే. దానికుచకుంభయుగళంబు నాననంబు
మెఱుఁగుఁగన్నులు నీక్షించి మేను వదలి
భామ నినుఁ బెండ్లియాడె నీబంట నగుదు
సేవసేయుదు నీకు నేఁ జిత్త మలర. 8

చ. వెఱవకుమాత్మలోన ననువింతగఁజూడఁగఁ బోకటంచు న
త్తెఱవకు లోలుఁడై యతఁడు తెల్లమిగా నను నొల్లకుండుటే
నెఱిఁగి సహింపలే కెచటికేనియు నేఁగువలంపుతోడఁ ద
త్తఱమున నేఁగుదెంచి ప్రమదంబున నిన్ననుఁగొంటి నియ్యెడన్.

క. విల్లును నమ్ములు నివి యా
ప్రల్లదుఁడు ధరించునవి శుభస్థితి నీ వీ
భల్లములు ధనువుఁ గైకొని
తెల్లంగా నేయువలయు దితిజాధమునిన్. 10

ఉ. భూసురవర్య! నీ వతనిఁ బోర జయించిన నీకు భార్యనై
యే సతతంబు నీమదికి నెక్కుఁగ నింపగు కామరూప ము
ల్లాసమునన్ ధరించి శుభలక్ష్ములు గల్గెడునట్లు సేయుదున్
వాసవభోగ! రక్కసునిఁ బాపు నణంపఁ దలంపు సేయుమా.

వ. అనిన విని యతం డిట్లనియె. 12

ఉ. నీతలఁపె ట్లెఱుంగ నగు నీరజనేత్రలు మాయజోగినుల్
పాతక లుగ్రకోపలు కృపారహితల్ కపటస్వరూపిణుల్
వీతభయల్ మహోద్ధతలు విత్తవినాశను లవ్యయుచ్యుతల్
చేతనహారిణుల్ కఠినచిత్తలు శౌర్యరతిక్రియాన్వితల్. 13

సీ. పతి విష్ణువర్ధను బగతు కొప్పించదా
కందర్పసేన మార్గంబునందుఁ
దనయుచేఁ బొడిపించదా శరభంగుని
పీడ్వడ శశిరేఖ విటుని దాఁచి
యనుజుఁ బుష్కరుని మిథ్యలు పల్కి కోయించ
దా పుష్పగంధి భూధవుని చేత

సహాజన్ము భీముచేఁ జంపించదా హిడిం
బుని హిడింబ రణాగ్రభూమియందు
తే. భర్తృహరియా లొనర్చినపాతకంబు
చేత నెంతేనిరోఁతలు చెప్ప నరిది
యన్యపురుషరతిప్రియ లజ్జవదన
లింతి! నీమాట నమ్మంగ నెట్లు వచ్చు. 14

చ. అనవుడు యింతి యిట్లను ధరాసుర! నిక్కము నాదుపల్కు నీ
మనమున నమ్ము కల్లలగు మాటలు పల్కితినేని విప్రునిన్
దునిమిన పాతకంబునఁ గ్రతుక్రియమాన్పినకల్మషంబునన్
దనయువధించినట్టి దురితంబును బొందుదు శంక యేటికిన్.

ఆ. దనుజుఁ దునుము మనుట తప్పుగాఁ గొనకుమీ
పాతకుండు వాఁడు పరిణయంపు
భర్త గాఁడు నాకు బాధ రతిక్రీడ
నలరియున్నదాన వలపు మిగిలి. 16

తే. అనుచుఁ దనచేతివిల్లు నయ్యంప దొనయు
భూసురుని చేతి కిచ్చినఁ బూని విప్రుఁ
డసుర నవలీలఁ దునిమెద నంబుజాక్షి!
చూడుము! నీవు నావుడు సుదతి యలరి. 17

క. వసుధామరేంద్ర! దానవు
నసమున సమయింపుదేని యంతియ చాలున్
బసుల మఱలించినాతఁడె
యొసఁగఁగ నర్జునుఁ డనంగ నెఱుఁగుదుమె కదా. 18

క. నావుడు మది నుబ్బి మహీ
దేవుఁడు విల్లెక్కువెట్టి దిక్కులు పగులన్

గావించె గుణధ్వనిఁ ద
ద్రావంబునఁ గర్ణయుగము వ్రస్సినఁ జెలుచన్. 19

ఉ. వాలుమగంటిమిన్ దనుజవల్లభుఁడల్కవహించియొవ్వఁడో
శైలమునన్ గుణస్వనముసల్పెనుబాపురె!వంటయింటఁగుం
డేలిడెచొచ్చె రక్తములు తీవ్రతఁ గ్రోలఁగఁ గల్గె నంచు ను
త్తాలశరాసనాంచితగదాక్షురికాసిముఖాయుధాఢ్యుఁడై.

తే. పద్మినీకన్య నల్లనె పాన్పుమీఁదఁ
గదలకుండంగ నియమించె గర్వ మెసఁగ
నసుర పఱతెంచి కాంచెఁ దదగ్రమునను
గేళికడ నున్నవిప్రు నక్షీణబలుని. 21

చ. కనుఁగొని తీవ్రరోషమునఁ గన్నుల నిప్పులు రాల నోరి నా
వనితకుఁ గన్నులార్ప నిటు వచ్చినవాఁడవె నిన్నుఁబట్టి చ
య్యనసమయింతునంచు నిశితాస్త్రము లేసినపద్మనాభుఁడు
క్కునవిద్రుంచి వైచియులఘుప్రదరంబున నేసె రాక్షసున్.

క. బలునారస మసుర మహో
బలమునఁ జాపమునఁగూర్చి పాఱునిమేనన్
జొనిపిన నందుఁ జలింపక
నిలిచి ధరామరుఁడు చాపనిపుణత వెలయన్. 23

క. పదియును నిరువదియును ము
ప్పదియును బాణంబు లసురపై నేసిన నా
త్రిదశరిపుఁడు పూసినబా
రిద మనఁగా రుధిరములు ధరిత్రిం బరఁగెన్. 24

ఉ. అంతటఁ బోక విప్రుఁడు లయాంతకుకై వడి నల్గి చాప మిం
తింతలుఁ జేసి బాణము లనేకము లొక్కట నారిఁగూర్చి య

త్యంతరయంబునం బరప నంగములెల్లను దూరిపోయి వాఁ
డంతకుపట్టణంబు దరియంజని క్రమ్మఱ వచ్చె ధాత్రికిన్. 25

తే. ఒండువిలుపూని యతివర్వ మొలయ నగ్ర
జన్ముఁ గని కూటికూరకు చంద్రహాస
మలవుమైఁ బూనఁబడెనంచు వళనికల్ప
మగు శరం బేసి యార్చె నయ్యసురవరుఁడు. 26

క. పూనిక సురల జయించెగ
దానవులకు మనుజు లెంత తలపోయఁగ దు
ర్మానవ! గుడి డిగమ్రింగే
వానికి నలసంది పిండిపడియము గాదే. 27

క. నాబాహుబలిమి కోర్వఁగ
నీబల మది యెంత త్రుంతు నెఱ నీశుణమే
నాబలిమి నేల పెనఁగం
గా బాపనపోటు కప్పకాటుం గలదే. 28

క. కొంచెపువిలుఁ గొని న న్నది
రించంగా లేవు తేఁ ధరిత్రి న్వన వే
మంచున కిడిన తుషారము
లెంచంగాఁ గాడిపేట్ల కేక్రియ నోర్చున్. 29

శా. ఈఁద్రాఁ బోరఁగ లేవు బాపఁడవు నీ విస్సీ! రణక్రీడకున్
దోడ్రావల్లన శౌరివచ్చిననినున్ ద్రుంతున్ మనుష్యాధముల్
జోద్రా నన్నదిరింప శూలధరుఁడున్ జాలండు వీరుండవై
చూడ్రా నాశరజాలవృష్టి సమరక్షోణీస్థలిన్ భూసురా!. 30

క. అనవుడు విప్రుఁడు దైత్యుని
గనుఁగొని తత్సాయకంబు ఘనశస్త్రమునన్

దునుమాడి నయనములఁ గెం
పినుమడిఁగుగ నాగ్రహించి యిట్లని పలికెన్. 31

శా. వేఁద్రాబాపఁడు బాపనిం గెలువఁగా వీరుం డౌకం డిద్ధరన్
లేఁడ్రా పట్టినవాఁడు పుట్టినదిగోలె న్విల్లు నీ జంకెనన్
బోఁద్రారంతులు మాని శౌర్యమెసఁగన్ బోట్లాడ రాభూసురున్
నీఁద్రా నిన్నిఁకఁ దొల్లిటట్లమనఁగా నీకొండపై నెచ్చటన్.

చ. వదరులు పల్కినంతట నె వచ్చెనె స్థైర్యము శౌర్యవృత్తి నీ
కొదవినఁ జక్కనై నిలువు మోరి నిశాచర! యిన్నిగంబునన్
మదిమదినుండి నేఁడు నను మారొకనియొందుల కేఁగవచ్చునీ
మదమణగింతుఁ బోరహనుమంతుని ముందఱఁ గుప్పిగంతు లే.

క. వలవదు రాక్షస! సమర
స్థలమున గర్వించ బావాలదర్పంబున నీ
యిలఁ దాడిఁ దన్ను వారల
తలఁ దన్నినవారుగలరు తలపోయుంగన్. 34

శా. నీచా! నీ విటు వల్కినంత నె మహీ న్నీ శౌర్యమొప్పారెనా
వాచాపౌరుషముల్ త్యజించి భుజగర్వంబొప్పసంగ్రామమున్
వైచిత్ర్యంబులఁ జూపుచిత్తమునఁ దాల్మిన్ బల్మియున్ మీఱఁ
గా, 'కాచింతా మరణేరణే' యనినవాక్యంబుల్ విచారించరో.

క. రాత్రించర నినుఁ దునుమక
ధాత్రీసురుఁ డేల చను "నిదం బ్రాహ్మ్య మిదం
క్షాత్ర" మను టెఱుఁగవా యీ
మాత్రమునకు బిరుదు లేల మాకుం జెప్పన్. 36

వ. అని పలికి తత్క్షణంబ. 37

లయగ్రాహి.

అమ్మహితవిక్రముఁడు నమ్మనుజభోజియు మ
 నమ్ములను గ్రోధ ముదయమ్మగుచు మీఱన్
హామ్మనుచు డాయుచు శరమ్ము లరివోయుచు ర
 యమ్మెసఁగ నేయుచు జవమ్మెసఁగఁగా నొ
క్కుమ్మడిఁ బరాక్రమమున మ్మెఱసి రక్తములు
 గ్రమ్ముకొని మేనులఁ గరమ్ము దిగజారన్
రమ్మనుచుఁ జీరుచు జవమ్మెసఁగ నుగ్రసమ
 రమ్మపుడు నేసిరి బలమ్ములు సెలంగన్. 38

క. పులులక్రియ నుగ్రసింహం
బులకరణి మదేభయుగముపోలిక శరభం
బులపగిదిఁ గ్రూరభుజగం
బులకైవడిఁ బోరి రధికభుజబల మొదవన్. 39

క. అవనీసురుండు శరలా
ఘవమున నిశితాస్త్ర మేసి గ్రక్కున దైత్య
ప్రవరుని చాపము ద్రుంచెను
ధవళేక్షణ యగు సుకేశి తనమది మెచ్చన్. 40

సీ. చాపంబు తుమురైనఁ జలమున దైత్యుండు
 శూలంబు వైచినఁ జూచి విప్రుఁ
డది నాల్గుశరములఁ బదివ్రక్క లొనరింప
 ఘనగదాదండంబు గొని రయమునఁ
దలమీఁదఁ గొట్టినఁ దప్పించుకొని పాఱుఁ
 డెదురుఱొమ్మునఁ గ్రుచ్చెఁ బ్రదర మొకటి

యసుర యంతట జవం బడిగి యంతటఁ దేరి
పటుకఠారమునఁ గోపమునఁ బొడిచె
తే. నాకుఠారంబు ద్విజుఁడు రెండంబకములఁ
దునుక లొనరింప మానుపాదుండువాలుఁ
బలుకయునుఁ బూని కవిసిన బ్రాహ్మణుండు
నమ్ముచే రాక్షసుని మ స్త మప్డు ద్రుంచె. 41

ఉ. రక్కసు నల్కనుగ్రసమరంబునఁ గీటణఁగించి ముందటన్
జక్కఁగనున్న భూమిసురస త్తముఁ గన్గొని మోదమొప్పఁగా
నక్కమలాక్షి కౌఁగిటఁ బ్రియంబునఁ జేర్చి యనంగ కేలిసాం
పెక్కఁగ నోలలార్చి దనయిచ్ఛకువచ్చినయట్టి చోటులన్. 

వ. అయ్యవసరంబున. 43

మ త్త. తార లొక్కటవిచ్చె భృంగకదంబముల్ చెల రేఁగఁ గా
సారవీథులఁ బువ్వుఁ దేనెలు జారెఁ బువ్వులతావిలన్
గై రవంబులు వాడెఁ జంద్రుని కాంతి వెల్వెలఁబారె నం
భోరుహాప్తుఁడు గానఁగా బడెఁ బూర్వశై లతటంబునన్.

సీ. వనజాతకహ్లార వనజాతయుతసరో
వరవీచికలమీఁద వ్రాలివ్రాలి
కలకంఠశుకశారికాకంఠ కాకలి
కలితచూతములపైఁ గ్రాలి క్రాలి
మల్లికామాధవీమందారనూతన
సూనగంధములపై సోలిసోలి
కేలీవనాంతకం కేళిశాఖాశిఖాం
దోలాగతాళిఁ బోఁ దోలితోలి

తే. యల్లనల్లనఁ జనుదెంచె నలసగతుల
భావభవసంగరాయాసభామినీకు
చాగ్రసంజాతఘర్మంబు లణఁచి యణఁచి
చందనపుఁగొండపైనుండి చల్లగాలి. 45

మ. ధరణీదేవునిఁగూడి యప్పుడరుదందన్ బద్మినీకన్యయు
న్వరసాలాంఘ్రిప మొద్దకేఁగ గరుణన్ వామాక్షి నీక్షించియా
దరమొప్పంగను కేశి! యోయబల! యీధాత్రీసురుండుగ్రసం
గరభూమిన్ బడనేసెఁదారకునికన్ గైకొమ్ము సౌభాగ్యముల్.

క. పడఁతీ! నీతలిదండ్రుల
కడకుం గొనిపోదు నిన్నుఁ గలఁగకు మని యా
జలజాతనేత్రఁ బద్మిని
నొడఁబడఁగా గారవించి యుచితప్రీతిన్. 47

ఉ. తా నొకహంసియై విభునిఁ దామరసాక్షి వహించి వీచికా
యానమునన్ మహాంబుధిరయంబునదాఁటి తదగ్రసీమసో
పానమణిప్రభాపటలభాసురగోపురహర్మ్యమంటపా
స్థానముఁగాశికాపురము దవ్వులఁగాంచెముదం బెలర్పఁగన్.

ఆ. అచట పద్మనాభు నాపద్మినీకన్య
నవని డించి యెప్పటట్ల చారు
మూర్తిఁ దాల్చియున్న ముగ్ధేందుముఖమూర్తి
వసుధ లోచనోత్సవం బొనర్చె. 49

ఉ. ఆకనుదోయిచెల్వు వికచాబ్జములందు మెఱుంగులందు లే
దాకుచభాతి జక్కవలయం దిభకుంభయుగంబునందు లే
దాకచదీప్తి నీలమణులందు ద్విరేఫచయంబునందు లే
దాకలకంఠిరూపమహిమాతిశయంబున కెవ్వరీ డిలన్. 50

క. తిన్ననిపిఱుఁదును దుఱుమును
జన్నులు గన్నులును ఘనత సంపాదింపన్
గన్నియకు వెన్క ముందఱ
నున్నతి నే వెట్టి లేక యొరపు వహించెన్. 51

వ. అవుడు సుకేశి పద్మనాభునిం జూచి యిట్లనియె. 52

మ. ఇది వారాణసి జహ్నుకన్య యిదె సంవీక్షింపుమాశోభన
ప్రదునిర్దుంఠివినాయకుం గొలువు సద్భక్తిన్మహాభైరవున్
మదిలోఁ గైకొను మాదికేశవుఁ దలంపన్ మేలు చేకూరు న
ల్లదిగో శ్రీమణికర్ణికాహ్రదము పుణ్యశ్రేణి విప్రోత్తమా!.

సీ. వింధ్యశైలంబున వింధ్యవాసిని కాంచి
గామకోటి యవంతిఁ గాళరాత్రి
శ్రీగిరిభ్రమరాంబ చిద్యోగినీశక్తి
యేకచక్రపురి ననేకవీర
బాలభూస్థలియందు వైష్ణవి పురుహూతి
పీఠను గోల్వురి పీఠలక్ష్మి
కొల్లాపురమ్మునఁ గోమలి శ్రీదేవి
మేరుకామాక్షి కాశ్మీరవాణి

తే. లంకశాంకరి సింహావిహార మఱియు
మండలికశాంతవాటిని మాణికమ్మ
కన్యకాకుబ్జమునఁ గన్యకరిణిఁ బఱఁగుఁ
గరుణమీఱ విశాలాక్షి కాశియందు. 54

సీ. దేవేంద్రభోగంబు సేవగింపఁడుగదా
కాశిలోపలఁ జావఁగలిగినతఁడు

ధననాయకత్వంబు ప్రస్తరింపఁడుగదా
కాశిలోపలఁ జావఁగలిగినతఁడు
గంధర్వసౌఖ్యంబు కాంక్ష సేయఁడుగదా
కాశిలోపలఁ జావఁగలిగినతఁడు
నాకలోకసుఖంబు నోకిలింపఁడుగదా
కాశిలోపలఁ జావఁగలిగినతఁడు
తే. గరుడ ఖేచర యక్ష రాక్షస భుజంగ
సిద్ధ విద్యాధరోల్లాసశ్రీవిభూతి
తోతువలెఁ జూడఁ డొకనాఁడు దూరముననె
కాశిలోపలఁ జావంగఁ గలుగునతఁడు. 55

ఉ. ఎంగిలిఁ దిన్నపాపము మహీసురహత్యయు నన్యకామినీ
సంగమదుష్కృతంబు మఖశాసనదోషముమాతృమస్తకం
బంగనఁగొట్టివైచినయఘావళిఁ బాయును విశ్వభర్తపై
సంగగుకాశికాపురవరంబున నిల్చుటఁ జేసి భూసురా!. 56

ఉ. ప్రాణముతోడనుండిబహుభంగులఁబుణ్యములాచరించియుం
బోణిమిగాఁగమోక్షమును బొందుటదుర్లభ మన్యజన్మ! వా
రాణసియందుఁ జచ్చిసుకరంబుగఁగాంచుసమస్తజంతువుల్
రాణవిరించికిం బడయరాని వృషధ్వజరూపసంపదల్. 57

క. విష మెక్కఁ దలకు మెసఁగిన
విష మమృతంబై తనర్చు విషమాస్త్రుఁడుఁ వి
ద్విషుఁడై యణంగుఁ గాశీ
విషయమునఁ జెగినజంతువిసరంబులకున్. 58

చ. కరి కరి తోలు గప్పు నురగం బురగంబుధరించు శాకర్వరం
బిరవుగశాకర్వరంబుగనియెక్కుమృగంబుమృగంబుదాల్చు

భూసురవర! కాశిలోనధికసుస్థి వహించినతత్త్వ ణంబ యే
పురములకివ్విభూతి పరిపూర్ణతనొందుఁ దలంచిచూచినన్.

శా. శ్రీవిశ్వేశ్వరుసాటిదైవమును గాశీక్షేత్రముంబోలఁ బు
ణ్యావాసంబును జహ్నుకన్య సరిభవ్యంబైనతీర్థంబుఁ దే
జోవిఖ్యాతివిశాలనేత్ర కెనగాఁ జూపన్ మహాశక్తియున్
భావింపన్ సమకూరదెట్లఖిలభూభాగంబునన్ భూసురా!

సీ. కల్పవృక్షము లిందుఁ గల భూరుహము లెల్ల
సిద్ధలింగము లిందుఁ జిడిపిరాలు
కామధేనువు లిందుఁ గల గోగణము లెల్లఁ
బటుసుధాంబుధు లిందుఁబల్వలములు
గంగాసమము లిందుఁ గల నిర్ఝరము లెల్ల
నమరు లిందుఁ జరించు నంత్యజనులు
ఖగకులాధిపు లిందు గల మశకము లెల్ల
సంజీవిలత లిందుఁ గుంజసమితి

తే. పరసవేదులగను మిందుఁ బజ్జ గోచ
రంబు లగుచున్న గండశైలంబు లెల్లఁ
గమలగర్భునకైన నీకాశిమహిమ
ప్రస్తుతింపంగవచ్చునా ప్రాభవమున. 61

క. కాశీసంస్మరణంబును
గాశీదర్శనముఁ గాశికానివసనమున్
గాశీమరణము గలనరుఁ
డాశంభునిరూపుఁ దాల్చు నాశ్చర్యముగన్. 62

మ. అనికాశీనగరప్రభావము ప్రియం బారంగ నాపద్మనా
భునకున్ జెప్పిను కేశితానుద్విజుఁడున్ భూపాలపుత్రింబ్రియ

బున భాగీరథిఁ దీర్థమాడి కరుణాంభోరాశి లోకత్రయా
వనునిం గాంచిరి విశ్వనాథుని మణిద్వారైకమార్గంబునన్.

సీ. తమ్మటధ్వనులు మృదంగనినాదముల్
శంఖస్వనములు నిస్సాణరవము
లాతపత్రములు సింహాసనంబులు దోమ
తెఱమంచములు మణిదీప్తతతులు
పంచఘంటలు పైఁడిపల్లెరంబులు చామ
రంబులు చిత్రవర్ణధ్వజములు
ముత్యాలపచ్చడంబులు మేలుకట్లును
నిలువుటద్దము లింద్రనీలవేదు

తే. లంగనాజనకలకలం బతివినోద
రథగజవిమానతురగగోవ్రతతు లమర
నలరు నాదేవు దేవాలయమ్ము సొచ్చి
విశ్వనాథుని దర్శించి వేడ్కతోడ. 64

మ. పదపద్మంబులకుం బ్రణామములు సద్భక్తిం సమర్పించి యో
త్రిదశేంద్రార్చిత! పార్వతీశ్వర! మహాదేవా! శరన్మేఘపా
రద కర్పూర పటీర హీర హిమ తారా చంద్ర సంకాశ! మా
హృదయంబుల్ భవదంఘ్రిలీనములుగా వీక్షించు విశ్వేశ్వరా!.

చతుర్విధకందము. కాశీపురీశ! శ్రీవి
శ్వేశా! కైలాసవాస! హితపరిపాలా!
క్లేశహర! యభవ! భవభయ
నాశా! పాలింపు మము ఘనంబగు శ్రీలన్. 66

సీ. కోటిమన్మథరూప! హాటకాచలచాప!
చటులబాహాటోప! శరణుశరణు

శ్రుతిచతుష్టయఘోట! శుభ్రగంగాజూట!
జలజాసనకరోట! శరణుశరణు
వ్యాఘ్రపురసురధ్వంస! వర్ణితమీమాంస!
చంద్రఖండవతంస! శరణుశరణు
భుజగేంద్రకేయూర! భువనత్రయాధార!
సద్భక్తమందార! శరణుశరణు
తే సామజాసురమదభంగ! శరణుశరణు
శైలకన్యామనస్సంగ! శరణుశరణు
సతతకరుణారసాపాంగ! శరణుశరణు
శర్వ! విశ్వేశ! శివ! లింగ! శరణుశరణు. 67

సీ. కన్నప్పవిభుని వక్త్రము మజ్జనపుబిందె
పంచసాయకుమేను పచ్చపట్టె
కరటిదానవమాతృగర్భంబు బొక్కస
భుజగశాయిముఖంబు పువ్వుఁదోఁట
పాతాళభువనంబు పసిఁడిసొమ్ములపెట్టె
పద్మగర్భశిరంబు పళ్లెరంబు
పాథోనిధానంబు భరితబోనపులోవి
వెలియాలిచనుగుబ్బ వీఁడుపట్టు
తే. లంజవా రిల్లు నీకు బల్లాడనిలయ
మశ్వరత్నంబు పశువై నయాలపోతు
నీమహత్త్వంబు దలపోయ నీక యొప్పు
కాశికాధీశ! విశ్వేశ! కలుషనాశ!. 68

తే. ఆయు రారోగ్య మాకార మర్థ మార్జ
వంబు నీసేవ హరిచింతనంబు నతుల

వాక్పటుత్వంబు శుభముకై నల్లలక్ష్మి
యింద్రభోగమ్ము నిమ్ము విశ్వేశలింగ!. 69

క. పన్నగపతిభూషణ! మా
సన్నుతపదసేవ గలుగ సద్గతికై మా
కన్నమతి మరయ నేటికి
వెన్న గలుగ నెయ్యి వెదకు వేదుఱు గలఁడే!. 70

సీ. నీటఁ దేలుశరంబు పాటసోలుసరంబు
ధరియింప భరియింపఁ దలఁచఁ డేని
యుబ్బిపాటినయాలు గబ్బిమీటినతోలు
జడలందు నొడలందుఁ బడయఁ డేని
యుగముగాల్చినచేఁదు జగముగెల్చినజోదు
గడిసేయఁ బొడిసేయఁ గలుగఁ డేని
యలివేణివలిచంట వెలయాలివెలిగుంట
నుండఁగాఁ బండఁగాఁ నోపఁ డేని

తే. యీడు వత్తురె నీసాటి యితరమూర్తు
లవనిమండలి దేవ వేశ్యాభుజంగ!
త్రిపురసంహార! జాహ్నవీతీరవాస
కాశికాధీశ! విశ్వేశ! కలుషనాశ!. 71

సీ. అని విశ్వనాథు మహాదేవు సేవించి
కాలభైరవదేవుఁ గని భజించి
డుంఠి విఘ్నేశు వేడుకఁ బ్రార్థనముఁ జేసి
శ్రీవిశాలాక్షిఁ బూజించి కొలిచి
యాదికేశవు చరణాబ్జంబులకు మ్రొక్కి
లోలార్కు హృదయంబులోన నిల్పి

సిద్ధలింగముల నార్జితభక్తి సేవించి
ముక్తిమంటపము శాస్త్రోక్తిఁ దరిసి
తే. జ్ఞానవాపిమహాతీర్థచంద్రఖండ
పుష్కరేణువులం దోఁగి పుణ్యమోక్ష
లక్ష్ములం దేలి ద్విజుఁడు బాలామణులును
భూమిపాలుని మందిరంబునకుఁ జనిరి. 72

వ. ఇవ్విధంబున వార లారాజభవనంబు ప్రవేశించి నిజపుత్త్రి కారణంబునకై యనేకచింతాక్రాంతుం డై యున్న పాంచాలశేఖరమహీపాలుసమ్ముఖంబునకుం జని యారాజపరమేశ్వరు సన్నిధిని సుకేశి పద్మినీకన్య ననుచుటయు నిరీక్షించి సంభ్రమాశ్చర్యయుక్తుండై పెన్నిధిం గన్న పేదచందంబునఁ బ్రమోదాయత్తుండై నయనాంబుజంబుల హర్షాశ్రుకణంబులు దొరుఁగం బులకితాఖిలాంగుండై తత్పుత్త్రికారత్నంబు నక్కునం జేర్చుకొని యంతఃపురంబునకుం గొనిపోయి తన మహాదేవులుం దానును నాపద్మినీ తనూజాతవలనఁ దారకుండగు దానవుండు దన్నెత్తుకొని సముద్రమధ్యశైలంబునకుం జనుటయుఁ బద్మనాభునిచేతం దారకుని సుకేశి చంపించుటయుఁ దనయున్నరసాలభూజంబు చక్కటికిం బోనేఁగుదెంచి వారిరువురుఁ దన్ను వెఱపకుమని యూరార్చి సుకేశి కామరూపిణి యగుటంజేసి తానొక హంసి యై విప్రకుమారునిం దన్నును వహించి వారాణసీ క్షేత్రంబునకుం దెచ్చుటయు నెప్పటియట్ల స్త్రీరూపంబు వహించి తమసముఖంబునం దన్నునుచుటయుఁ దెలియఁ జెప్పిన విని యారాజవరేణ్యుండును నతనిమహాదేవులు సం

తోషభరితాంతరంగు లై పద్మనాభుని సుకేశిని దమ సమ్ముఖంబునకు రావించి కనకాసనంబుల నునిచి రత్నభూష ణాదిదివ్యాంబరంబులు గట్ట నిచ్చి సవినయంబున నబ్భూపాల శేఖరుం డిట్లనియె 73

శా. ఓవిప్రోత్తమ! నేను నాసతులు నీ యుత్ఫుల్లపత్రాక్షికై
భావంబుల్ ఘనశోకవహ్నులఁ దపింపన్ వేగుచున్నట్టిచో
నావిశ్వేశ్వరదేవదేవుఁడు విశాలాక్షిన్ మమున్ బ్రోవఁగా
నావిర్భావమునొందినట్లిపుడు మీరాశ్చర్య మే తెంచుటల్.

క. రక్కసు నాయోధనమున
నుక్కణఁచి మదీయపుత్రి నొగిఁ గాచి మమున్
గ్రక్కున రక్షించిన మీ
చక్కనికారుణ్యరసము చను వర్ణింపన్. 75

తే. మీరొనర్చిన యీయుపకారమునకు
మగుడ నుపకార మొనరింప మావశంబె
నన్ను రాజ్యంబు ప్రజలఁ బ్రసన్నబుద్ధి
నీయధీనంబులుగఁ బూని నిర్మలాత్మ!. 76

సీ. ఈపాప నిచ్చెద నిల్లాలిఁగా నీకుఁ
బరిణయంబుగఁ గొమ్ము పద్మనాభ!
యని బంధువర్గంబు నాప్రొద్దె రావించి
పురము శృంగారించి భూరిమహిమఁ
జరణముల్ గడిగి భూసురకుమారకునకుఁ
బట్టాంశుకము మధుపర్క మిచ్చి
తగుముహూర్తంబునఁ దనకూర్మిసుత నలం
కారపూర్వకముగ ధారవోసి

తే. వినుతికెక్కిన కళ్యాణవేదిమీఁద
సప్తపదములు ద్రొక్కించి చంద్రముఖులు
ధవళములు వాడ ద్విజులు మంత్రములు చదువ
లాజహోమంబు సేయించె రాజవరుఁడు. 77

చ. కమలదళాక్షి నేత్రములఁ గాటుకయై చనుదోయి నింద్రనీ
లమణులహారమై యలకల న్వికచోత్పలదామమై ముఖా
బ్జమున ద్విరేఫమై నుదుటఁ జక్కని కస్తురిబొట్టుచందమై
యమరె నవీనహోమసముదంచితకోమలధూమ మయ్యెడన్.

చ. తనయకు భూసురప్రవరునకుఁ దత్పరబుద్ధి మహీవిభుండు కాం
చనమణిభూషణంబు లరణంబులుగా నిడి యున్పఁ బంపినన్
వనితల నిద్దఱన్ గొనుచు వారణ ఘోటక దాస చేటికా
జనములతోడ నాకడకు సమ్మతి మత్పతి వచ్చె వేడుకన్. 79

మ. తన కే మున్నొనరించినట్టి యపరాధంబుల్ విసర్జించి చం
దనరత్నాంబరభూషణప్రకరముల్ నా కర్థితో నిచ్చి మ
న్ననమీఱన్ దన యేలుగ్రామమునకున్ మా వారితోఁ గూ
డఁ, జయ్యన గొంపోయి సమస్త భోగముల నిత్యంబున్
[బ్రహోషింపుచున్.

తే. కొంతకాలంబునకు విప్రకుంజరుండు
దివికి నేఁగిన మఱికొన్నిదివసములకు
మగని కేఁ జేసినట్టి దోషములు దలఁచి
తాశరీరంబు విడిచితిఁ దక్షణంబ. 81

సీ. ఉడుకునూనియల బిట్టొరలఁగా నుడికించి
కూటశాల్మలులందుఁ గుదియఁగట్టి
గండుకుక్కలచేతఁ గండలు కఱపించి
చట్రాతిపై మేను చదియఁగొట్టి

క్రొవాఁడిశరములఁ గ్రుచ్చి పారఁగ వైచి
పలలంబు లుక్కుఱంపములఁ గోసి
నిప్పులయేటిలోనికి నుగ్రముగఁ ద్రోఁచి
నిగుడుపెన్మంటల మొగము గాల్చి
తే. దండహస్తుండు మఱియు బాధలను బెట్టి
కట్టకడపట వెయ్యేండ్లు కామ్మకీట
కముగఁ బుట్టించె నని తనకలుష మెఱుఁగఁ
జెప్పి యాపుర్వి నన్ను నీక్షించి పలికె. 82

తే. జలజలోచన! మాఘమాసమున నీవు
తీర్థమాడిన నొకనాఁటి తీర్థఫలము
నాకు దయ సేయు మన్లైన నాకమునకుఁ
జనుదు నెమ్మెను దొఱఁగి తేజంబుతోడ. 83

చ. అని సనుఁ వేఁడుకొన్నఁ బ్రియమారఁగ నట్లనె చేసితిన్ రయం
బున నదియున్ వినూత్నమణిభూషణరాజిఁ దనర్చి పొల్చునం
గనచెలువంబు దాల్చి కనక ప్రభలీల విమాన మెక్కి య
య్యనిమిష రాజధానికి మహావిభవంబున నేఁగె వేడుకన్.

మత్త. కావునన్ దరళాయతాక్షి! మగండ దైవము నాథునిన్
గారవంబున ధిక్కరించినఁ గల్మషంబును నొందు రా
జీవలోచన! వాదులాడక చేయనిమ్ము వ్రతమ్ము ధా
త్రీవరుం బ్రమదం బెలర్ప మదింజలంబు త్యజింపుమా. 85

సీ. అని యిట్లు ప్రీతి సంధ్యావళిదేవి ప
తివ్రతాధర్మంబు దెలియఁబలుక

వినిమోహినీకాంత తనమదిఁ గోపించి
కల్మషం బెఱింగిన గరితవగుదు
భామ! నే నిను బుణ్యపాపముల్ దెలియఁగాఁ
జెప్పుమన్నది లేదు సిగ్గుమాలి
పిలువనిపేరంట మలవుమై నిందఱు
నవ్వఁగాఁ బఱతెంచి నడుమఁ జొచ్చి

తే. మగనిముందఱ నిపుడు నీమహిమ నెఱపి
కతలు సెప్పెదు వినుమంచుఁ గాఱులఱచు
నేర్పు గలుగుట గనుఁగొంటి నేర్పడంగ
వలపు దిచ్చోట నుడుగు నీవాక్యసరణి. 86

తే. అవనిపతితోడ నే మాటలాడుచోట
భామ! నీవాడుమాటలు పనికిరావు
కంచునిస్సాణములు భోరుకలిగి మ్రోయ
ఢక్కవాద్యంబు లెక్కడి కెక్కుఁ జెపుమ. 87

క. ఎమ్మెలు నాముందఱనా
యమ్మక్కరో! చెల్ల "వగ్రహారములోనన్
దమ్మళిజోస్యము" లన్నవి
ధ మ్మిది నీవలన నాకుఁ దథ్యం బయ్యెన్. 88

క. ఊనంబుగాని చెఱచదు
మానుము నీయరవులకును మాకును వెఱవం
గా నేల "యెద్దు బెదరిన
గానుగునకు బెదరు గలదె" గణుతింపంగన్. 89

క. నీయడ్డగట్టిమాటల
కీయెడఁ బనిలేదు నిల్వు మెప్పటివలెనే

చీయన్నఁ గడమ రాగము
సేయుదురా యెఱుకగల్గు చేడియ లెందుఁ. 90

క. నీనుడువుల కే నడు గెం
దైనను దాఁట నని సత్యమాడెను గౌరీ
జాని విన విభుఁడు నేఁడా
సూనృత మెటువోయెఁ దలఁచిచూడఁగఁ దరళా!. 91

మ. అని సంధ్యావళిదూఱఁబల్కి నరనాథాగ్రేసరుంజూచి య
వ్వనితారత్నముభూమిపాల! తగవా వాక్యోపవాక్యంబు నీ
వును నీమూర్ధ్వరుభార్యలుం వరుసవావుల్ దప్పి నాతోడ నె
ట్టనసల్పం బరికింపఁగావలదెయుండందొంటివాక్యంబులం.

క. శర్మమున నుండి నీపై
నర్మిలిఁ జనుదేర నేల యువనిప! "బుద్ధిః
కర్మానుసారిణీ" యను
నిర్మలవచనంబు తప్పునే యెందైనం. 93

వ. అని పలికి మఱియును. 94

ఉ. బొంకినఁ బాతకంబొలయుబొంకిన నాశమునొందుఁబుణ్యము
ల్బొంకినరోగముల్ వొడము బొంకిన నిర్మలకీర్తి హీనమౌ
బొంకిన లక్ష్మి వాసి చను బొంకిన నాయువణంగుఁ గావునం
బొంకుదురే మహాత్ములు ప్రభుత్వముదప్పి నరేంద్రశేఖరా!.

సీ. అంత్యజన్మునితోడ ననృతంబులాడినఁ
జరియించుఁ బదియేండ్లు జమునివీఁట
శూద్రుతో మిథ్యలు సోఁకనాడిన నల్వ
దేఁడులు నివసించు నినజువీఁట

వైశ్యతోడ నసత్యవాక్కులాడిన దండ
ధరుప్రోల నూఱేండ్లదాఁక నిలుచు
క్షత్రియాన్వయునితోఁ గల్లలాడిన దక్షి
ణేశు లోకమున వెయ్యేఁడు లుండు
తే. నవనినిర్జరుతో మృష లాడెనేని
నరకముల నొందు లక్షజన్మముల నరుఁడు
పుణ్యసతితోడ బొంకులు బొంకి యగణి
తాబ్దములు రౌరవంబులయందుఁ బడును. 96

సీ. చిరభక్తిఁ దీర్థముల్ సేవించుపుణ్యముల్
సత్యవాక్యమునకు సవతురావు
ఘనతులాపురుషంబు గావించుపుణ్యంబు
సత్యవాక్యమునకు సవతురాదు
కలకాలమును దపంబులు సేయుపుణ్యంబు
సత్యవాక్యమునకు సవతురాదు
ధృతి శతక్రతువు లర్థి నొనర్చుపుణ్యముల్
సత్యవాక్యమునకు సవతురావు
తే. దేవతాపూజలును భూమిదేవపాద
పూజలును సేయునతిశయపుణ్యఫలము
సత్యవాక్యమునకు నెన్న సవతురాదు
మనుజుఁడనువాడు సత్యము మరువరాదు 97

ఉ. సత్యముఁబోలుధర్మమును శాంతముఁ బోలుఁదపంబుసాధు
సాం, గత్యముఁబోలు లాభము నగర్వముఁబోలుగుణంబు
సన్నుతా,పత్యముఁబోలుమోదము కృపామతిఁబోలఁగఁ దీర్థ

మన్ బుధ,స్తుత్యముఁ బోలు భాగ్యము వసుంధరఁగల్గునె
[రాజశేఖరా!. 98

శా. శ్రీలన్ మించుసమస్తరాజ్యసుఖమున్ జిత్రంబుగాడించియి
ల్లాలిం బిడ్డని నమ్మి మాలనికి బంటై మన్ హరిశ్చంద్రభూ
పాలగ్రామణి యెల్లలోకములకున్ బ్రఖ్యాతిగా సత్యమున్
బాలింపండె నిలింపవర్గము నుతింపన్ రాజచూడామణీ!.

క. పాటకు సత్వము శ్రుతి గడి
కోటకు సత్వంబు సమతఁ గొల్చెడిసైన్యం
బాటకు సత్వము తాళము
మాటకు సత్వంబు నిజము మనుజాధీశా!. 100

ఆ. శమములేనితపము సతిలేనిసౌఖ్యంబు
పతిహితంబు లేని భటునిసేవ
పాత్ర మెఱుఁగ నీవి పగ దీర్పఁగాలేని
బలిమి నిజములేని పలుకు లేల. 101

క. కులసతికి వన్నె మానము
కలిమికి వితరణము వన్నె కదనంబునకున్
దలకమియె వన్నె భటునకుఁ
బలుకునకు నిజంబు వన్నె పార్థివముఖ్యా!. 102

క. "అకలంకనానృతాత్పా
తకం పరం" బనుచు సూనృతం బెప్పుడు ద
ప్పక నిర్వహించుఁ గావునఁ
బ్రకటింపుము నీవు సత్యఫణితి నరేంద్రా!. 103

సీ. పరమేశ్వరుని ప్రోలఁ బరిణయకాలంబు
నందు నాడినసత్యమాత్మ నిలుపు

నేను నామానినుల్ నీమాట యనురక్తిఁ
జేసెద నంటివి సేయవయితి
నినుఁ బాసి నిముసమేనియును నుండఁగఁజాల
నను గారవించఁగాఁ జనదె నీకు
నేమిటి కార్తిక మేటి యేకాదశి
యేమిటి యుపవాస మేటి వ్రతము
తే. నన్నుఁ గొనిపచ్చునపుడు భూనాథ! నీవు
నీకుఁ గలుగు వ్రతంబులు నియమములును
దెలియఁజెప్పిన నిన్నేల తేరిచూతు
భూప! వలవదు నన్నింత బూమెసేయ. 104

చ. ఎటువలె బ్రహ్మనన్ను సృజియించెనొ కాని వ్రతంబుచెప్పినన్
దటతటనాదు దేహము వృథా యొడరుందలయేర్చుచుందు నే
మిటికలయింపనన్ను రమియింపఁగరాక వ్రతంబులంచు నీ
విటువలెఁబల్కఁగాఁదగునె యేనుఁగనెక్కియు దిడ్డిదూరఁగన్

క. కంతుని బూజింపుము సుతు
నింతటికిన్ రాజు సేయు మిలపై వ్రతముల్
చింతింప నేల నృప "రా
జ్యాంతే నరకం వ్రజంతి" యనఁగా వినవే!. 106

క. చెలువంబు జవ్వనంబును
దలఁగినచో నీవు నన్నుఁ దలఁచెదె మదిలోఁ
దలఁచు గగుర్పొడ నేటికిఁ
జలి వోయినవెనుక రాజసత్తమ! చెపుమా. 107

క. కట్టుము రతిసౌఖ్యములకుఁ
బట్టము గాకున్న ననిచివేయుము నన్నున్

మిట్టకుఁ జెట్టకుఁ గాదను
నట్టివిధము సేయవలవ దవనీనాథా!. 108

క. అంగభవతంత్రములను బో
సంగం బాలింపు నన్ను జయ్యన వల దీ
భంగి నలయింప జాజులు
మంగలముల వేఁతు రోటు మనుజాధీశా!. 109

చ. అనిబవాలుభంగులందుఁ గమలాయతలోచనపల్కువాక్యముల్
మనము నొగుల్పధైర్యమున మానవనాయకుఁడాలకించియుం
గన! నను నేలదూఱెదవు గల్లలు నీయెడ నేమియాడితిఁ
తనయుఁడు నాసతుల్ దగవుఁదప్పిరె నీపలుకాక్రమించిరే.

ఉ. వేయిటికైన బొంకఁ బదివేలకునైన నసత్యమాడ న
న్యాయమువల్కఁ లక్ష్మికయినన్ వనజాయతనేత్ర! యూరకే
రాయిడిచేసి మానుమనరానివ్రతం బిది మానుమన్న నే
నీయెడ నెట్లుమానుదు నిఁ కేమిటి కింతచలంబు చెప్పుమా.

సీ. రాజసూయాదిసత్క్రతుదీక్షలందైన
మగువ! యేకాదశి మానరాదు
కళ్యాణకమనీయకాలంబులందైన
వనిత! యేకాదశి వదలరాదు
పితృదేవతాసమంచితపూజలందైన
వెలఁది! యేకాదశి విడువరాదు
జాతసూతకమృతసూతకంబులనైన
సుదతి! యేకాదశి నుడుగరాదు

తే. బాలురకు వృద్ధులకు గర్భభారవాహ
తరుణులకు రోగులకు నౌషధక్రియాది

నిరతులకున్నైన వర్జింప నీతిగాదు
సితకరానన! యేకాదశీవ్రతంబు. 112

ఉ. భూమిసమస్తమునిచ్చుటయు భోగములెల్లఁద్యజింతు భామినీ
స్తోమము నుజ్జగింతు నిజసూనుశిరం బసిధారఁ ద్రుంతు నో
కామిని! నీవు నిల్పుమనఁగా విడఁజాలఁగరాని దేవతా
గ్రామణి యడ్డగించిన ధరన్ హరివాసరమేలమానుదున్.

చ. అనుడుఁ దదీయసద్వ్రతమహాదృఢభంగికి నాత్మ నెంతయున్
వనిత ముదంబునక్కి తనవచ్చినకార్యము తప్పెనంచుఁ జ
య్యననొకకుత్సితంబుహృదయంబునఁదోఁచినభూమిపాలనీ
వనినవిధంబునన్ దనయునొద్దఁ ద్రుంపుముమాటలేటికిన్.

తే. కన్నతండ్రివి సుతునిపైఁ గరుణలేక
బలిమిఁ దలఁ ద్రుంతు నని బిట్టు పలికె దట్టె
తల్లియును పీని కాత్మలోఁ దలఁక దట్టె
మీకు లేని కృపాబుద్ధి మాకు నేల!. 115

క. ఖండింపుము సుతు నటుగా
కుండిన వ్రతమైన మాని యుండుము నీ విం
దొండైనఁ జేయ కూరక
ఖండించిన పరమపదము గలదె నృపాలా!. 116

వ. అని మోహినీకాంత యివ్విధంబునం బలుకు నతికఠిన
వచనంబులు కులిశసమానంబై హృదయంబు భేదింప నమ్మ
హీపాలశేఖరుండు మాఱుమాట పలుకకున్నతఱి సంధ్యా
వళి కదియ నేతెంచి. 117

చ. అమరఁ దనుప్రభల్ మణిమయాభరణైకరుచుల్ విశాలనే
త్రముల తటిల్లతల్ కచకదంబము మేచకమేఘ మింద్రగో

పము లరుణాంశుదీప్తులు శుభస్థితిగాఁ జెలువారి యంబుదా
గమునఁ జూడ నొప్పెగజగామిని మోహిని జూచి యిట్లనున్.

మ. ఒడఁబాటించుక లేక నీమనసులో నుత్ఫుల్లపత్త్రాక్షి! యీ
యెడ నేకాదశిమానకున్న సుతునిన్ హింసింపుమా యంచు
మా, కడనే యుండి వినంగరాని పలుకుల్ క్ష్మాపాలకున్
బల్కుటల్, గుడినుండె గుడిత్రాళ్లు గోయుటయు నాకుం
జూడ నీచందముల్. 119

తే. అవనిపతి నేముఁ బరితాప మందుచుండ
నాత్మజుని ద్రుంపు నీ వంచు నళినికల్ప
మైన మాటాడ నాలుకె ట్లాడె నీకుఁ
దెఱవ! గొడ్రాలు బిడ్డకు ల్లెఱుఁగు నోటు!. 120

క. మగువా! నీహృదయంబునఁ
దగు లోకయింతయును లేక తలపోయఁగ నీ
జగతీనాయకు పట్టున
నొగిఁ దామరపాకుమీఁది యుదకము భంగిన్. 121

క. రమణునిమన్నన గలదని
క్రమ మెడలఁగ మాటలాడఁగాఁ దగవగు నో
కమలాక్షి! వేళ్లతోడుత
నములుదురే చెఱకు తీయనఁగదా! యనుచున్. 122

క. మానిని! యెఱుఁగవుగా కీ
క్ష్మానాయకు వ్రతము మాన్పఁగా నీతరమా!
యేనుఁగుకుఁ గొమ్ము వెల్లిన
నేనాఁటను మగుడఁ ద్రోయ నెవ్వం డోపున్. 123

వ. అని మోహినిం బలికి సంధ్యావళి నరనాయకుం జూచి యి
ట్లనియె. 124

ఉ. ఓనరనాథ! ప్రాకృతునియోజ విచారము నొందనేల నీ
మానసశుద్ధిఁ బద్మభవమాధవ శంభు లెఱుంగఁ గోరియీ
మానినిఁ బంపఁ బోల్దు రనుమానము లేదటుగాకయున్న నే
లా నలినాయతాక్షికిఁ జలంబున నీవ్రతహాని సేయఁగన్.

క. పాత్రముగుచోట నార్యులు
పుత్రకళత్రాత్మదేహముల నైన మహా
చిత్రముగ నిత్తు రెఱుఁగవె
"పాత్రం త్యాగాయ" యన్నపలుకు నృపాలా!. 126

క. ఈపనికి మీరు ధైర్యముఁ
జేపట్టుట యిరవుగాదె చిత్తమున యశః
స్థాపక! "నావిష్ణుః పృథి
వీపతి" యనుమాట నీకు విహితము కాదే. 127

తే. ధనమనోవాంఛనలు దక్క ధరణినాథ!
యెందుఁబట్టిన నిదియకా నిడక నరుఁడు
చింత నొందినఁ గైవల్యసిద్ధి యగునె
వట్టిపిడికిలికోండ్ర వేలెట్టుఘండు 128

తే. అనుచు సంధ్యావళీదేవి యధిపుఁ దరమి
పలుకుచోఁ బుత్రుఁ డచ్చటిభంగి దెలియ
విని రయంబునఁ బఱతెంచి విభునిమ్రోల
నిలిచి ముకుళితహస్తుఁ డై నెమ్మిఁ బలికె. 129

క. ఏకాదశీవ్రతంబున
కై కామిని ప్రాణమడుగునఁట నీతనయున్

లోకేశ! కలదె పుణ్యము
నా కింతటికంటె త్రిభువనంబులయందున్. 130

క. ఇయ్యన్ని మనసుకోరిక
సయ్యనఁ గావించి వ్రతము సాగింపక మీ
రియ్యెడ చలచిత్తుల రై
నుయ్యో కొండో యనం జనునె భూనాథా!. 131

క. భూరమణ! "యనిత్యాని శ
రీరాణి" యటంచుఁ బలుకరే పెద్దలు ని
స్సారపుశరీరమునకు న
కారణ మవిచార మొందఁగా నేమిటికిన్. 132

సీ. జ్వర పాండు శోభా తిసారంబు లొకవేళ
నరికట్టుకొని యొంప నఱచి యఱచి
క్షుద్రపీనస మోహ గుల్మంబు లొకవేళ
నుద్రేక మొనరింప నొఱలియొఱలి
శీతాంగ కఫ పైత్య వాతంబు లొకవేళఁ
బొదివి కారింపఁగఁ బొఱలిపొఱలి
క్షయ పీనసశ్వాస కామెర లొకవేళ
బలిమిమైఁ గుదియింప ములిగి ములిగి
తే. ఘన జరాభారమునఁ జాలఁ గాఁగి క్రాఁగి
తనువుఁ దొఱఁగుటకంటె వ్రతంబుకొఱకు
దేహ మర్పించి శ్రీహరిదివ్యలోక
మున వసించుట దగదె యోభూవరేణ్య!. 133

సీ. అజినంబు రవిసూనుఁ డగ్రజన్మున కిచ్చి
సత్కీర్తినొందఁడా జగ మెఱుంగ

గలమాంసమెల్ల డేగకుఁ బెట్టి శిబిరాజు
పడయఁడా కైవల్యభవ్యలక్ష్మి
నెముకలు సురకోటి కిడి దధీచివిభుండు
పొందఁడా మితిలేనిపుణ్యపదవి
యహిపుత్త్రునకుఁ బ్రాణ మర్పించి జీమూత
వాహనుండు నడువఁడా స్వర్గమునకు

గీ. ఘనులు తొల్లింటిపెద్దలు జనుల కేల
నెఱుఁగఁ జెప్పిరిగాదు యిట్లెఱిఁగి యెఱిఁగి
యవనినాథ! యనిత్యదేహంబు నమ్మి
శాశ్వతంబైన ధర్మంబుఁ జనదు విడువ. 134

చ. సుతుల ననేకులంబడయఁ జొప్పడు నోనరనాథ! నీకు నీ
యతివల నూర్వురందు నొకయాత్మజునిన్ హరిపుణ్యవాసర
వ్రతమునకై త్యజించి సగువంబున ధర్మమునిల్పి యచ్యుత
స్థితిఁజరియింపఁగాఁదగదె చిత్తమునన్ దలపోసిచూడుమా.

చ. తనువులు గావునిత్యములు తామరసాక్షులు నశ్వముల్ కరుల్
ధనములు రాజసంబులు వృథాసహజన్ములు బంధుమిత్త్రులుం
దనయులు నేమియూఁ దురమునంబునఁ జేసినధర్మ మొక్కటే
మనుజవరేణ్య! నమ్మఁదగు మానవకోటికి నెల్లకాలమున్.

క. ధరణీశ్వర! యాలస్యము
జరపంబనిలేదు పుణ్యచయ మొనరింపన్
బరఁగినచో "ధర్మస్య
త్వరితా గతి" యనెడిమాట తథ్యముగాదే. 137

క. నందనుఁ దునుమఁగరా దను
సందేహము మాని వ్రతము సాగింపుము గో

విందవురవిభవలక్ష్మిన్
బొందుదు సురసిద్ధవాక్ప్రభులు వర్ణింపన్. 138

తే. అనుచు నరనాయకునిఁ బల్కి యాక్షణంబ
స్నానమొనరించి ధౌతవస్త్రములు గంధ
పుష్పములు రత్నభూషణములును దాల్చి
కడఁక ధర్మాంగదుఁడు భక్తి గడలుకొనఁగ. 139

క. పద్మాసనస్థుఁ డై హృ
త్పద్మంబునఁ బద్మనాభు భవ్యాంఘ్రిశ్రీ
పద్మములు నిలిపి నిలిచిన
పద్మాప్తకుచుం దనూజుఁ బార్థివముఖ్యుల్. 140

చ. కనుఁగొని వేడ్కనిర్జరనికాయముతోఁజనుదెంచి యంబరం
బున వనజాతనేత్రుఁడు సమున్నతిఁ గన్గొనుచుండ నిందిరా
వనిత మహాద్భుతం బమర వంద్య! ప్రసన్నుఁడ వేలకావు స
య్యనన్నృపపుత్రుఁ గావుమనియర్మిలిఁ దత్తరమందిపల్కఁగన్.

చ. జనపతి శైవఖడ్గ మపసవ్యకరంబునఁ బూని నందనుం
దునియఁగ వ్రేయ నెత్తుటయుఁ దొయ్యలి మోహినియు
గ్రభార్య తెం,పునకు నిజేశు తెంపునకుఁ బుత్రుని తెంపున కా
త్మ విస్మయం, బును భయముం బెనంగొనఁగ భోరున ఖడ్గ
[ముఁబట్టి యిట్లనున్. 142

క. అరపైకంబును జేయని
హరివాసరమునకునై నిజాత్మజుఁ దునుమన్
గరవాలుఁ జేతఁ బూనిన
కరిణి నినుపమొలకు మేడఁ గాల్చుట సుమ్మీ. 143

తే. ఆత్మజుని జంప దుఃఖంబు నపజయంబు
నఘముఁ బ్రాప్తించుఁ బ్రత్యక్షమగుచు నిపుడు
మీఁద నెవ్వఁ డెఱుంగు నో మేదినీశ!
వ్రతముచే నీవు పొందెదు వైభవములు. 144

క. ఎఱుఁగవు వ్రతమున మోక్షము
నెటిఁ గాంచెదనంచుఁ బుత్రునిం దనుముదురే
పలు మొగులు నమ్మి నిండిన
చెఱువుదకము వెళ్లఁజల్లు చినఁటియుఁ గలఁడే 145

క. అస్తోకదాననిరత! ప్ర
భుస్తుతచారిత్ర! ధర "నపుత్రస్య గతి
ర్నాస్తి" యను వేదఫణితి ప్ర
శస్తముగా నీవు వినవె చదువులవలనన్. 146

సీ. సగరుండు పుత్రసంజననంబుకొఱకునై
తరుణేందుధరుఁ గూర్చి తపము సేసెఁ
దనర దిలీపుండు తనయులకొఱకునై
కామధేనువు సేవ కడఁకఁ జేసె
దశరథేశ్వరుఁడు సంతానంబుకొఱకునై
పుత్రకామేష్టి పొల్పుగ నొనర్చెఁ
బాండుమహారా జపత్యంబుకొఱకునై
యారాధనము చేసె నఖిలసురుల

తే. మందపాల జరత్కారమౌనివరులు
సుతులు వెలిగాఁగఁ బుణ్యసద్గతులు వడయఁ
దపము లొనరించి కాదె యీధరణిలోన
యెంతపాటులఁ బడిరి ధాత్రీశచంద్ర!. 147

క. పాపనిఁ దునిమెద నని నీ
వీపణఁతులయొద్దఁ గినియు నేటికిఁ "గామాం
ధోపి న పశ్యతి" యను కథ
భూపా! నీతరమునందె పుట్టెను చెపుమా. 148

సీ. హితవుచెప్పిన నాగ్రహించు బాంధవమిత్ర
తతి దక్కు దక్కు సద్ధర్మగరిమ
ధైర్యంబు దొఱఁగు నర్థమువోకఁ దెలియందు
పతికార్య మేమఱఁ గృతము మఱచు
నపకీర్తికిని లోఁగఁడోఁ గాము లెఱుఁగఁడు
లజ్జాభిమానంబు లుజ్జగించు
బొంకు రోయఁడు పాపమునకు శంకింపఁడు
కులశీలముల పోక కలయఁ డతఁడు

తే. చోరులనుగూడు సత్యంబుచోటు విడుచు
భయమునొందఁడు రిపులచే భంగమొందు
దారతనము నీతి నియమంబు ధూళిఁ గలుపు
నంగనాజనలోలుఁ డైనట్టినరుఁడు. 149

క. కావున నూఱ్వురుభార్యల
లో విడువక మెలఁగు కామలోలుఁడవు నృపా!
భావంబు నీకుఁ గలదే
యేవిధమునఁ జర్చసేయ నినకులతిలకా!. 150

వ. అని వసుమతీశ్వరుం దూఱఁబలికి ధర్మాంగదుం జూచి మో
హినీకాంత యిట్లనియె. 151

క. తెంపరిమాటలు పతికిని
నింపగునో తండ్రి! నీకు నేటికి వల దీ

లంపటము చచ్చి కుడిచెడు
సంపద లెండైనఁ గలవె చర్చింపంగన్. 152

క. సొలుపునఁ జచ్చియు సంతతి
కలఁగాంచిన నిదర్శ మేలుకని యుండంగా
వలయు ననుపల్కు పెద్దల
పలుకులు తెలియంగవలదె పార్థివతనయా!. 153

ఆ. మారరూప! విను "శరీర మాద్యం ఖలు
ధర్మసాధనమ్" ముదమున ననుచుఁ
బలుకు నీతిశాస్త్రపద్ధతు లెఱుఁగవా
పడుచుబుద్ధు లెల్లఁ బరిహరించు. 154

క. కలిమికి రాజ్యవిభూతికి
నిలవ్రతములు పూని వదలకిఁగతిఁ జావక
వలవదు ప్రాణము గలిగిన
బలుసుగూరఁ దినియునైన బ్రతుకఁగవచ్చున్. 155

ఆ. అవనినాథుఁ డెఱుఁగఁ డాగ్రహంబే కాని
నీచవృత్తి నిట్లు నీకు నేల
ప్రాణ మిత్తు ననుచుఁ బైసిక వెట్టంగ
వలదు రమ్ము భూపవరతనూజ!. 156

వ. అని ధర్మాంగదుం దరమిపలికి భూమిపాలుం గనుంగొని.

మ. కలవాఁడొక్కఁ డెనందనుండయిననోఁ గాకేమిసామ్యం
దుని, శ్చలచిత్తుండనఘుండుధర్మగుణవిస్తారుండు శ్రీవిష్ణుపా
దలసద్భక్తుఁడు వంశపావనుఁడు మీఁదన్ దిక్కు మీ కితఁడే
చలమేలా వ్రతముజ్జగించి సుతునిన్ సంరక్ష గావింపుమా.

క. నీకేఁ జెప్పినమాటలు
చేకొన కప్పెలయు భూప! శిశువు వధింపన్
బైకొంట వెట్టి దీఱున
రోఁకలి తలఁ జుట్టుమనుట రూపింపంగన్. 159

క. నిందలకు నోర్చి నిజసుతు
నిం దునుమక మాన ననుచు నిలిచెదు కట్టా!
యెందును దలపోయఁగ నృప
సుందర! యిందునకు వెలుఁగు చులకన కాదే!. 160

ఉ. నావుడు భామతోడ నరనాథవరేణ్యుఁడు వల్కె నింక రా
జీవదళాక్షి! యీహితవు సెప్పకు మిప్పనిఁ బూన బ్రహ్మయున్
దేవవిభుండు నేఁడరుగుదెంచి ప్రతిప్రతికూలురైన నే
నావిధ మేలమానుదుఁ బెనంగక తక్కమటంచుఁ ద్రోయుచున్

క. కరవాల మెత్తి నందను
శిర ముపలక్షించి వ్రేయఁ జిత్రంబుగ న
క్కరవాలు పుష్పదామ
స్ఫురణంబులు పాఱి కంఠభూషణ మయ్యెన్. 162

వ. అయ్యవసరంబునఁ దదగ్రభాగంబున. 163

సీ. సనకాదిమునియోగిసంఘంబు లుభయపా
ర్శ్వములందు భయభక్తి సంస్తుతింపఁ
దుంబురు నారదాదులు వీణియలు గూర్చి
సంకీర్తనంబులు సలుపుచుండ
గంభీరరవమున నంభోజభవశివుల్
సందడు లెడఁగల్గ జడియుచుండ

రంభాదికాప్సరోరామాసమూహంబు
లభినయం బలర నాట్యంబు సలుప
తే. వ్యాస శౌనకముఖభాగవతులతోడ
సిద్ధ గంధర్వ కిన్నర శ్రేణి గొల్వ
గరుడవాహన మెక్కి యిందిరయుఁ దాను
నాదినారాయణుండు ప్రత్యక్షుమయ్యె 164

సీ. క్రతువులు ఋతువులు కాలముల్ వేదముల్
నదులు కిన్నరలు వనధులు నిధులు
యతులు వాక్పతులు బ్రహ్మాండముల్ కుండముల్
రుద్రు లద్రులు చతుశ్శ్రుతులు గతులు
దైత్యులు భృత్యులు ధర్మముల్ కర్మముల్
దినములు ఘనములు దిశలు నిశలు
పక్షముల్ ఋక్షముల్ పవనముల్ సవనముల్
మందులు మంత్రముల్ మణులు ఘృణులు
తే. ఘనము లగములు చౌషష్టికళలు గళలు
రవులు భైరవు లామ్నాయరతులు వ్రతులు
శక్తు లితిహాససూక్తులు శార్ఙ్గపాణి
ప్రోల నిలిచిరి తమ నిజమూర్తితోడ. 165

లయవిభాతి.

హరి యనల కాల నరహర వరుణ వాయు నిధి
ధర హర దిశాధిపులు చరణములఁ గొల్వన్
గిరిజ విధితరుణి శచి మరునిసతి ముఖులు వర
కరములను మృదులచామరములను వీవన్

స్మర గుహ వినాయకులు సరసిజాసనూజ పుర
హార సనకనారదులు దరిని నుతిసేయఁగా
సరసిజకరాబ్ధిసుత సురసతులు గొల్వఁ గరి
వరదుఁడగునట్టిహరి కరుణ దయచేసెన్. 166

వ. ఇట్లు ప్రత్యక్షంబైన పరమేశ్వరుని నిరీక్షించి సంభ్రమా
శ్చర్యచిత్తులై భయభక్తితాత్పర్యంబుల వార లందఱు
నయ్యిందిరాధీశ్వరుపాదారవిందంబులకు నందంద దండప్ర
ణామశతంబు లాచరించి ముకుళితకరకమలులై ముందట
నిలిచి తదీయ తేజోవిలాసంబు తమనేత్రపర్వంబుగా విలో
కింపుచు నిట్లని స్తుతియింపం దొణంగిరి. 167

ఉ. కౌస్తుభవక్ష! సన్మునినికాయశరణ్య! సమస్తదేవరా
జస్తవనీయపాదజలజాత! సితాంబుజపత్రనేత్ర! ల
క్ష్మీస్తనచంద్రచందననిషిక్తసమంచితదివ్యదేహ! వి
ధ్వస్తనిశాచరేంద్ర!బలదర్పవిరాజిత!యోగిపూజితా. 168

చ. శ్రుతులు హరించి యంబుధులుచొచ్చినఁదోడనె మీనరూ
పమై, యతులితవార్ధిఁజొచ్చి యసురాధిపుగర్వము ద్రొక్క
లించి దేవతలునుతింప వేదములు వాక్పతికిచ్చిననీమహో
గ్రశరూ, రత వొగడంగనేర్తుమె సురవ్రజభూషణ! భక్త
[పోషణా!. 169

చ. అమరులు దానవావలియునంబునిధానమునందు మందరం
బమరఁగనిల్పి త్రచ్చునెడనయ్యచలంబు తలంబునన్ బడన్
గమఠమురూపుఁదాల్చి నిజకర్పర ముద్రికి నూఁతనేసి నీ
వమృతముఁగల్గఁ జేసిన మహత్త్వము వర్ణనసేతు మచ్యుతా!.

ఉ. అతురశౌర్యగర్వమహిమాతిశయంబున నుగ్రుఁడై హిర
ణ్యాక్షుఁడు భూమిఁ జుట్టి యతలాభిముఖుండయి పోవఁగా
ననిన్, రాక్షసుఁజంపి కొమ్మున ధరావలయం బవలీలనెత్తునీ
యతియయజ్ఞసూకరమహత్త్వముఁ బ్రస్తుతిసేతుమచ్యుతా!.

చ. కలఁడుచరాచరస్థితినికాయమునందుఁ బరాపరేశుఁ డన్
బలుకుతనూజువాక్యములభంగికిఁగోపమునొందియెందునన్
గలఁడెయటంచు వ్రేయబలుకంభమునందుజనించి దైత్యు
నిన్,గెలిచిననీమహోగ్రనరకేసరివిక్రమమొప్పునచ్యుతా!.

క బలి మూఁడడుగులకై భూ
తల మొకపాదంబుచే నతల మన్యముచేఁ
గొలిచి యొక టతనిశిరమున
నిలిపిన నీవామనత్వ నిపుణత యొప్పున్. 173

చ.పరఁగుమహోగ్రధారఁబృథుబాహుబలంబుదలిర్పభూమిపై
నిరువదియొక్కమారు ధరణీశ్వరసంఘము నెల్లఁ ద్రుంచి ని
ర్జరు లలరం దదీయరుధిరంబులఁ దీర్థము లాచరించు నీ
గురుతరశౌర్యసంపద దగుం దలపోయఁగ నంబుజోదరా!.

సీ. తరణికులుండవై తాటకిఁ గూల్చి య
జ్ఞము గాచి విలు ద్రుంచి జనకజను వ
రించి భార్గవు నోర్చి ఋషివృత్తిఁ జని ఖరుఁ
జంపి చిత్రమృగంబు సమయఁజేసి
యినసుతు నేలి వాలి నణఁచి పురిఁ గాల్చి
యబ్ధిఁ గట్టి సువేలయందు విడిసి
కలన రావణకుంభకర్ణులఁ గెడపి వి
భీషణునకు లంక పేర్మి నొసఁగి

తే. యవనిసుతబంధుహితుఁడ వై యశ్వమేధ
శతము లొనరించి దశసహస్రమ్ము లొక్క
వేయు వర్షంబు లిల యేలి వెలయునీదు
రామచంద్రవిభూతి వర్ణనకు నెక్క. 175

తే ముష్టికాసుర చాణూర ముఖసమస్త
దుష్టజనకోటి ననిలోనఁ ద్రుళ్లణంచి
ప్రస్తుతికి నెక్కు బలభద్రరామ! నీదు
గరిమ యొప్పు ముకుంద! లోకములయందు. 176

చ. అగనము భార్యసారథి పరాత్మజుఁడుకేతువు చక్రముల్ వచో
గరిమతురంగముల్ భటనికాయముచాపము శయ్యనారిశ్రీ
కరవిశిఖంబు నీవు నయి గ్రక్కున నంధకదైత్య సంహరుఁ
బురములుగెల్వఁ జేసిన ప్రభుత్వముఁ బ్రస్తుతిఁ జేతుమీశ్వరా!.

తే తురగరూపంబు నవతెంచి ఖురపుటముల
సకలధాత్రీతలంబును సమతలముగ
నాచరింపంగఁ గల్గు కల్క్యాకృతియును
నభినుతింపంగ నొప్పుఁ బద్మాయతాక్ష!. 178

క. సొగసుగ దశావతారము
లగుఁ బ్రస్తుతి నేయ నొక్క యరకందమునన్
కగ వనగ ఖర్వ భార్గవ
ఖగకుల బుద్ధా యటంచు కల్కి యటంచున్. 179

క. మేదిని భవరుజలకు మం
దేదీ నరసింహ! "రుక్మిణీశాయ నమో
వేదాంత వేదినే" యను
మీదివ్యకథామృతంబు మీాఁట ముకుందా!. 180

మ. రవిచంద్రగ్రహతారకంబులు దివారాత్రుల్ దిశల్ వాహినుల్
భువినాకంబచలంబులంబుధులు నామూఁడగ్నులింద్రుల్ ఫణి
ప్రవరుం డంబుజగర్భుఁ డీశ్వరుఁడు దిక్పాలవ్రజం బధ్వర
వ్యవసాయాగ్రఫలంబు నీవ తలఁపన్ వారాశికన్యాధిపా!

తే. భక్తిమీఱంగ! నీరీతిఁ బ్రస్తుతించు
వారిలో ముఖ్యుఁడగు ధరావరుని జూచి
సంతసంబును గరుణారసంబు నిగుడ
నంబుగుహపత్ర నేత్రుఁ డిట్లనుచుఁ బలికె. 182

క. ఓరుక్మాంగద నీదగు
వీరవ్రతమునకు నాత్మ విమలతకు మహో
దారత్వమునకు మెచ్చితిఁ
గోరుము వర మెద్దియైనఁ గుతుకం బలరన్. 183

సీ. భూకాంత! యిమ్మోహినీకాంతయును నీకు
నమకూలగాని నెయ్యంబు వదలి
దుష్కర్మమునకునై తోడరినయది గాదు
పద్మసంభవుఁడు నీభావశుద్ధి
పరయఁగాఁ గోరి యీయురవిందలోచనఁ
గలుగఁగాఁ జేసి నీకడకుఁ బంపె
ద్వాదశీపారణోత్తరమున నిద్రించు
వారిపుణ్యంబు లీవనితఁ బొందు

తే. బ్రహ్మమానసపుత్ర శోభనచరిత్ర
నీతనూజుండు భార్యలుం బూతమతులు
నిందలకు మోక్ష మొసఁగితి నీసుతుండు
ధరణిఁ బాలించి మీఁద మత్పురికి నడుచు. 184

క. కావున ధర్మాంగదు నీ
భూవలయంబునకుఁ బట్టముం గట్టెద నీ
దేవులును నీవు వైకుం
ఠావాసంబునకు నడువుఁ డని నెయ్యమునన్. 185

క. అమరుల విహంగవంశో
త్తముఁ గమలాక్షుండు చూచి ధర్మాంగదుఁ బ
ట్టము గట్టవలయు నుపకర
ణము లొనగూర్పుఁ డని పనిచినం జని వారున్. 186

సీ. గంగాదిపుణ్యాపగాపావనోదకం
బులు సముద్రోదకంబులును దెచ్చి
హేమకుంభములందు శ్రీమీఱఁగా నిల్పి
సకలధాన్యంబులు సంఘటించి
వజ్ర వైడూర్య ప్రవాళ రత్నంబులు
బహుదివ్యభూషణప్రకరములును
పారిజాతకదంబపద్మప్రసూనముల్
పనస రంభా చూత ఫలచయంబు
తే. పట్టమాంజిష్ఠ నేత్రశోభనపటములు
గంధ కర్పూర కస్తూరికా గణంబు
పసిఁడిపాత్రలఁ దాంబూలపత్రపూగ
కుశ తిల వ్రీహి లాజ ప్రకోరకములు. 187

తే. విశదముగ నుంచి కల్యాణవేదిపై ను
దుంబరోన్నతభద్రపీఠంబు నిల్పి
సింహచర్మంబు దానిపైఁ జెఱఁగు లమరఁ
బఱచి విప్రోత్తములఁ బిల్వఁ బంపుటయును. 188

సీ. పాలిత భీమేశుఁ డచ్యుతశర్మ, యొజ్ఝాన
ధాని యాజ్ఞేశుఁ డాధానయాజి
చల్లవల్లభుఁ డగ్రచర్చ గోవిందుండు
భట్టమేఘళుఁడు దర్భలముకుందుఁ
డీశ్వరభట్లు బ్రహ్మేంద్రయోఝులు క్రమ
దాడిమాధవుఁడు జంద్యాలపెద్ద
భాస్కరోఝులు చక్రపాణిచతుర్వేది
శొంఠికృష్ణుఁడు మల్లుసోమయాజి
తే. వామదేవుండు నరసింహ వాజపేయు
లాదికేశుండు వడ్డిదామోదరుండు
పట్టవర్ధనయెల్లన్న పల్లమంచి
యాదియగువిప్రులేతెంచి రచటి కపుడు. 189

వ. ఇవ్విధంబునం జనుదెంచిన భూసురోత్తముల నుచితప్ర యోజనంబుల నియమించిన వారలయ్యిందిరాధీశ్వరుసమ్ము ఖంబునకుం జని దేవా! సకలోపకరణంబులు నొనగూర్చి యరుగుదెంచితి మని విన్నవించిన నద్దేవతాసార్వభౌముం డచ్చోటు గదలి చనుచో నగ్రభాగంబున మకరతోరణా లంకృతంబును ఫలిత క్రముక పాదప విలసితంబును బహుపతాకాభిరామంబును ధవళ ఛత్ర చామర కలితం బును ననేకపుష్పమాలికాలంకృతంబును గరితురగ స్యం ద నానేకరాజకుమార నానాదేశసామంతసంకులంబును శంఖ భేరీ పటహ తమ్మట మృదంగ నిస్సాణధ్వానబం ధురంబును నగు రాజమార్గంబునకుం జని పట్టాభిషేకమంట పంబు గదియ నేడ శాంతకుంభకుంభసహస్రనిర్మితం

బును జంద్రకాంతోపలసోపానరచితంబును ననేకరత్న ఖచితంబును బట్టుమంజిష్ఠాదివిచిత్రవస్త్రవితాన భాసురంబును ముక్తాఫలరంగవల్లీసమన్వితంబును బుష్పోపహారసుందరంబును జందన నాగరు కర్పూర ధూప వాసితంబును జూతాశ్వత్థ పల్లవోల్లాసంబును నై మిసిమి గల పసిండితోరణంపులం జిత్తరువులు వ్రాసిన గోడలు నింద్రనీలమణిస్తంభంబులుఁ బచ్చలగవాక్షులుఁ బ్రవాళసాలభంజికలును బద్మరాగకపోతపాలికలును జెలువార రంభాద్యప్సరస్త్రీనాట్యశోభితంబును వందివైతాళిక మాగధ పాఠక సంస్తుత్యారావంబును దుంబురు నారదాదిగీత వాద్యంబులును సకలదేశమానవ జయజయశబ్దంబులును కర్పూర నీరాజన సమన్వితంబును నై కనకపాత్రలు ధరియించిన కామినీసహస్రంబునుం గలిగి యొప్పారు పట్టాభిషేకమండపమధ్యసింహాసనంబున ధర్మాంగదు నాసీనుం జేసి ధరణీసురుల గంధపుష్పాక్షతాంబరతాంబూలంబులం బూజించి రజత సువర్ణ నిష్కంబులు మణిమయాంచితభూషణంబులు కరితురగస్యందనధేనుదానంబుల నొసంగిన భూసురోత్తములుసువర్ణాక్షతంబుల వీతిహోత్రునలంకరించి యాజ్య తిల తండుల సమిచ్చరు మధ్వాదిహోమద్రవ్యంబులచేత ననేకవిధమంత్రంబుల విహితహోమంబు గావించి ముక్తామణి మయోపరిభాగంబునఁ జందనాగరుకస్తూరి కర్పూర హారిద్రాక్ష తాంబర పుష్పమాల్యాలంకృతంబైన గంగాదిపుణ్యనదీ సముద్రోదకపూర్ణంబులైన హేమకలశంబులు నిలిపి పుణ్యాహంబు లొనర్చిన పవిత్రవారి

పూరితకలశంబులు దేవేంద్రముఖ్యబృందారకులును గమ
లసంభవాదిమునులును నందుకొని యిందిరాదేవియు భా
రతియు శచీకాంతయు నరుంధతియు ననసూయయు నాది
యైన పుణ్యాంగనలు గారికళ్యాణంబులు వాడుచు ముత్యా
లసేస లిడ భూసురులు చతుర్వేదంబుల నాశీర్వదింప నభి
షిక్తుం గావించి. 190

శా. ఆచంద్రార్కము భూమియేలు మనినిత్యశ్రీల ధర్మాంగదుఁ
భూచక్రంబున కెల్లఁ బట్టము కృపాస్ఫూర్తిఁ దగం గట్టిల
క్ష్మీచేతోవిభుఁ డంగనాసహిత మాస్పష్టేశ్వరుఁ గాంచన
ప్రాచుర్యాగ్రవిమానపంక్తి నిడె దిక్పాలామరశ్రేణితోఁ.

క. ఇందిరయుఁ దాను సనకస
నందనయోగీంద్రమునిజనస్తుతు లమరఁ
స్యందనము లెక్కి నరపతి
ముందుగ వైకుంఠలోకమునకై నడచెఁ. 192

సీ. సర్వసర్వంసహాచక్రంబు లంఘించి
తగ భువర్లోకంబు తరించి
త్రిదశలోకము లిరువదిమూఁడు వడి దాఁటి
ఘనమహార్లోకమార్గంబు గడచి
జనలోకని స్తీర్ణసరణి వేగ క్రమించి
గురుతపోలోకంబుఁ బరిహరించి
బ్రహ్మలోకసమగ్రపదము విసర్జించి
శివలోకవిఖ్యాతిసీమ దరసి
తే. మాధవుని గొల్చి దివ్యవిమానపంక్తి
గగనగమనంబునందు నఖర్వమహిమఁ

జనియె రుక్మాంగదక్షితీశ్వరునితోడ
భూరివిస్ఫూర్తి వైకుంఠపురమునకును. 193

శా. ఆవైకుంఠపురంబునందు సురకన్యారత్నముల్ గొల్వ రా
జీవాప్తాన్వయుఁ డంగనాసహితుఁడై శ్రీవిష్ణుపాదాబ్జసం
సేవానిశ్చలమానసస్థితి వసించెన్ రమ్యహర్మ్యంబులన్
శ్రీవిఖ్యాతసమగ్రవైభవమునన్ జిత్తంబు మోదింపఁగన్.

సీ. అక్కథకుఁడు శౌనకాదిసన్మునులకు
రుక్మాంగదునికథ యూఢిగాను
జెప్పి యోమునులార! చిరభక్తి నీపుణ్య
చరితంబు నిరతంబుఁ జదువువారు
వినువారు పుస్తకంబును లిఖించెడివారు
కలశాంబునిధిశాయి కరుణగల్గి
ధనధాన్యపుత్రపౌత్రాయురైశ్వర్యవై
భవశత్రుజయము సద్భక్తి గలిగి

తే. యంతమీఁదట సిద్ధవిద్యాధరోర
గులకు దుర్లభమైన వైకుంఠపురము
నందు నిజపుత్త్రపౌత్త్రదారాన్వితముగ
నూర్జితప్రాభవంబుల నుందురనుచు. 195

శా. సూతుం డమ్మునిసార్వభౌములమనస్సుల్ మెచ్చఁ జెప్పెన్ సు
ధా, రీతిన్ బ్రాధకపీశ్వరుం డదిప్రచారించెన్ మృదూక్తిన్
గళా, చాతుర్యుం డగుభీమనాథునకు శశ్వద్భక్తితో దక్షమహా
ఖ్యాతిన్ బొల్పుగఁ గాతమీఁసుచరితం బాచంద్రతారార్కమై.

శా. కైలాసాద్రివిశేష! శేషఫణిసంగా! సంగరాభంగ! భం
గాలీలాస్యవికాస! కాసజితమార్గా! మార్గణాకార! గో

పాలా! పాలసదైత్యభంజన! జనప్రాణైకరక్షాకళా
జాలా! జాలనిబద్ధపాపచయ! సాక్షాన్ముక్తికాంతాధిపా!. 197

శ్రీరమణబాణ! బాణా
ధారా! ధారాభరైకదానకళావి
స్తారా! తారనగేంద్రవి
హారా! హారేందురత్న! యుగజార్ధాంగా!. 198

ఉత్సాహ.

ముక్తికామినీవిహార! ముగ్ధచంద్రశేఖరా!
భక్తపాలనప్రచార! పన్నగేంద్రభూషణా!
శుక్తిపేశిఖరీవిలాస! సుందరీకుచాలయా!
శక్తిమానవేశ్వరా! ప్రశస్తపార్వతీశ్వరా!. 199

గద్యము.

ఇది శ్రీమత్పార్వతీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనానందచర్య ప్రౌఢకవిమల్లనార్యప్రణీతంబైన రుక్మాంగదంబను మహాపుణ్యకథయందు సుకేశియును దానవాంగన పద్మనాభునిం గాంచుటయుఁ దారకాసురవధయును గాశీప్రవేశంబును బాంచాలశేఖరమహీపాలసంపీడనంబును బద్మినీవివాహంబును బద్మినీసుకేశిసమన్వితుండై తనపతి తనకడ కేతెంచి తన్నుం జేపట్టుననియును దానొనర్చిన కలుషంబునకై జముఁడివ్విధంబునఁ బుట్టించెనని కీటంబు చెప్పినకథ విని మోహిని సంధ్యావళిని

ధిక్కరించుటయు మోహినీ రుక్మాంగదసంవాదంబును వ్రతంబునకై భూమీశ్వరుఁడు నిజతనూభవుశిరముఁ దును మం గరవాల మెత్తుటయుఁ దక్షిణంబున లక్ష్మీశ్వరుండు ప్రత్యక్షం బగుటయు ధర్మాంగదు రాజ్యాభిషేకంబును రుక్మాంగదు వైకుంఠాగమంబును నన్నది సర్వంబును బంచమాశ్వాసము.

రుక్మాంగదచరిత్రము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.